The Largest Circulated Telugu Monthly

# చతుర

డిసెంబర్ 1997 ✻ రూ. 7/-



ఎ.జయలక్ష్మీరాజు **ప్రయాణం**

# చతురప్రపంచం

## వివాదాస్పద కృష్ణమందిరం

**అ**యోధ్యలోని రామజన్మభూమి గొడవ ఇంకా ఓ కొలిక్కి రాకుండానే, మధురలో కృష్ణజన్మభూమి గురించి కూడా ఓ వివాదం మొదలయింది.

మధురలో 1337 ఎకరాల ప్రదేశంలో గల మసీదు ప్రాంతం కృష్ణుడు జన్మించిన ప్రాంతమని నిర్ధారించి అక్కడ కృష్ణమందిర నిర్మాణం జరిపే ధ్యేయంతో 'శ్రీకృష్ణ జన్మ స్థానవికాస సమితి' ఆవిర్భవించింది.

ఈ సమితిలో అల్హాబాదు హైకోర్టు రిటైర్డ్ జడ్జిగారొకరు, కొంతమంది పేరుపొందిన మేధావులు సభ్యులు. ఈ స్థలానికి సంబంధించిన డాక్యుమెంట్స్‌ని, పురాతన సాక్ష్యాలని సేకరించి ఆ స్థలం మొత్తం కృష్ణ జన్మస్థానంగా నిరూపించడానికి ప్రయత్ని స్తోందీ సమితి. ఆ ప్రదేశంలో మసీదును, దేవాలయాన్నీ విడదీస్తూ ఓ ఉమ్మడి గోడ వుంది. ఆ ప్రాంతంలో కృష్ణమందిర నిర్మాణం ఇప్పటికి 5 సార్లు జరిగింది. మొట్టమొదటి మందిరం క్రీ.పూ. 80-50 సంవత్సరాల మధ్య నిర్మించగా తర్వాత అది కూలగొట్టారని ఆ ప్రాంతంలో దొరికిన ఓ రాతిఫలకంపై బ్రాహ్మీ లిపిలో రాసి వుంది. రెండవసారి విక్రమాదిత్యుని కాలంలో క్రీ.శ. 400లో మళ్ళీ మందిర నిర్మాణం జరిగింది. దాన్ని 1017లో మహమ్మద్ గజనీ కూలగొట్టించాడు. మహమ్మద్ మున్షీమీర్ ఆల్తుబి తన 'తారిక్-ఇ-జామిన్'లో 'మధురలో ఓ సుందర మందిరం వుంది. దాని అందాన్ని మాటల్లో చెప్పడం కష్టం' అని అభివర్ణించాడు.

మళ్లీ 1150లో అదే ప్రదేశంలో మహారాజా విజయపాలదేవుని ఆధ్వర్యంలో మందిర నిర్మాణం జరిగింది. ఈ సమాచారం సంస్కృత లిపిలో ఓ రేకుపై చెక్కి వుంది. సికిందర్ లోడీ 16వ శతాబ్దంలో ఈ మందిరాన్ని కూలగొట్టించాడు.

జహంగీర్ పాలనాకాలంలో 4వ మందిర నిర్మాణం జరిగింది. ఆర్చాకి చెందిన రాజా బీర్‌సింగ్ బుందేలా దీన్ని నిర్మింపజేసి మందిరానికి చుట్టూ ఎత్తైన గోడను కట్టించాడు. ఇప్పటికీ ఆ గోడకు చెందిన కొన్ని




శిథిలభాగాలున్నాయి. 1650లో ఫ్రాన్స్ యాత్రికుడు తావెర్నీర్ ఇండియా సందర్శించినప్పుడు మధుర వచ్చి ఇండియాలోకెల్ల అద్భుతమైన మందిర నిర్మాణమిది అని ప్రశంసించాడు. ఈ మందిరం ఎంత ఎత్తుగా వుండేదంటే అక్కడ వెలిగించిన దీపాలు, అక్కడికి 50 కి.మీ. దూరంలో వున్న ఆగ్రాదాకా కనిపిస్తాయి.



1669లో దీన్ని ఔరంగజేబు కూలగొట్టించి అక్కడ మసీదు నిర్మింపజేశాడు. 1815లో ఈస్ట్ ఇండియా కంపెనీ ఈ ప్రాంతాన్ని వేలం వేసినప్పుడు వారణాసి రాజు పాట్నీమల్ దీన్ని కొని అక్కడ కృష్ణ మందిర నిర్మాణం చేద్దామనుకున్నాడు. కానీ ఆ కోరిక తీరకుండానే ఆయన మరణించాడు. అతని దాయాదులకు ఆ ప్రదేశం స్వంతమయింది. అయితే 1904లోను, 1920లోనూ ముస్లింములు ఆ ప్రాంతం తమకే చెందుతుందని కోర్టుకు వెళ్ళారు. కానీ తీర్పు రెండుసార్లు ముసల్మానులకు వ్యతిరేకంగానే వచ్చింది.

1951లో శ్రీకృష్ణ జన్మభూమి ట్రస్ట్ ఏర్పడింది. ఇప్పుడున్న మందిర నిర్మాణం అప్పుడే జరిగింది. అయితే అక్కడున్న మసీదుకు చెందిన పాడుపడిన ఓ మెట్ల ద్వారం గుండా భూగర్భంలోకి వెడితే అక్కడ అంతకు పూర్వం మందిరానికి సంబంధించిన రాళ్లు లభిస్తాయని సమితి వారి వాదన. భూమికి అడుగున వున్న ఆ భాగం ఏమాత్రం పాడవకుండా సురక్షితంగా వుందనీ, అదే అసలైన కృష్ణజన్మస్థానమని, అక్కడ మసీదు వుందని వారి వాదన.

## వలసపోతున్న విగ్రహాలు

పురాతన వస్తువులు అమ్మి సొమ్ము చేసుకునే వ్యాపారం ఇండియాలో మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది. చివరికి ఇండియాలో చెప్పుకోతగ్గ అందమైన చారిత్రాత్మక వస్తువు ఒక్కటీ మిగలని రోజు కూడా రావచ్చునంటున్నారు కొందరు.




ఓసారి జర్మనీలో నివసించే ఓ భారతీయుడు బెర్లిన్ మ్యూజియంని సందర్శించడానికి వెళ్లి అక్కడ ఓ సూర్య విగ్రహాన్ని చూసి తెల్లబోయాడు. అదే ప్రతిమని ఆయన అంతకుముందు మన బరోడా మ్యూజియంలో చూసి ఉన్నాడు. ఈ వార్త పత్రికల కెక్కడంతో ఆ విగ్రహాన్ని స్మగ్లింగ్ చేసిన వ్యక్తులవేట ప్రారంభమయింది. స్పెషల్ క్రైమ్ బ్రాంచ్ గ్రూప్‌వారు పరిశోధించగా 1965 వరకూ ఈ విగ్రహం బరోడా మ్యూజియంలోనే భద్రంగా వుందనీ, అటుపైన బెర్లిన్ మ్యూజియంకి 25,000 డాలర్లకి అమ్మారనీ పరిశోధనలో తేలింది. అయితే సి.ఐ.డి.వారు అందుకు ఖచ్చితమైన సాక్ష్యాధారాలును చూపించలేక పోయారు.

ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. విగ్రహాల దొంగతనాలు, వాటి అమ్మకాలు దేశం మొత్తంమీద చాలాచోట్ల జరుగుతూనే వున్నాయి. 20 ఏళ్లకాలంలో కేవలం ఒక్క తమిళనాడునుంచే 1000కి పైగా విగ్రహాలు మాయమయ్యాయి. పాశ్చాత్యదేశాల కోటీశ్వరులు ఈ పురాతన వస్తువులపై విపరీతమైన మక్కువ చూపిస్తారు. ఒక్క భారతదేశంనుంచే కాక చైనా, నేపాల్,




కంపూషియా దేశాలనుంచి కూడా ఈ వ్యాపారం జరుగుతోంది. ఇవన్నీ విదేశీ కుబేరుల ఇళ్లను అలంకరిస్తున్నాయి.

భారతీయ దేవాలయాలు శిల్పుల ధనాగారాలని చెప్పవచ్చు దక్షిణ ప్రాంత దేవాలయగోపురాలు వారి నిపుణతకు ప్రతీకలు. శిల్పులకు చక్కని గుర్తింపు, వారికి మంచి జీవన విధానం చోళుల కాలంలోనే లభించింది. భారతీయ శిల్ప, చిత్రకళలకు అది స్వర్ణయుగం. చోళుల పరిపాలన క్రీ.శ. 846 నుంచి 1173 వరకూ సాగింది. ఈ కాలంలోనే అద్భుతమైన శిల్పసంపద వెలికి వచ్చింది. తంజావూరు, మధురై వీటికి ఉదాహరణలు.

విగ్రహ చౌర్యం కూడా ఎక్కువగా పురాతన కట్టడాలున్న ప్రాంతంలోనే జరిగింది. ఇదంతా పకడ్బందీగా ఓ ప్లాన్ ప్రకారం జరుతుగుంది. స్మగ్లర్స్‌కు కొంతమంది ఏజెంట్లుంటారు. వీరు దేవాలయాల్లోకి సందర్శకుల్లా, భక్తుల్లా ప్రవేశించి విగ్రహాన్ని అన్ని కోణాలనుంచీ ఫొటోలు తీస్తారు. దాని ఎత్తు, బరువు, కాలపరిమితి మొదలైనవన్నీ తెలుసుకుంటారు. పనంతా అయ్యాక ఓ శుభముహూర్తాన రాత్రికి రాత్రి దాన్ని మాయం చేస్తారు.

ఒక్కోసారి డబ్బుకి ఆశపడి పూజారే ఈ ఏజెంట్లకి సహాయపడతాడు. దక్షిణాదిన దేవాలయాల గర్భగుడులలోకి భక్తుల ప్రవేశం నిషేధం. దూరంనుంచి చూసేవారికి విగ్రహపు ఆనుపానులు తెలియవు. అందుకని పూజారే డబ్బుకు కక్కుర్తిపడి ఏజెంటుకు సహాయపడతాడు. అంతేకాకుండా అసలు ప్రతిమ స్థానంలో నకిలీ ప్రతిమను అమర్చి శృతిమించిన అలంకరణతో చూపరుల కన్ను కప్పుతారు.

దక్షిణ భారతంలోని శివపురంనుంచి నాలుగున్నర అడుగుల ఎత్తున్న వేయి సంవత్సరాలనాటి నటరాజ విగ్రహం మాయమై అమెరికా చేరింది. ఈ నేరం మీద రామలాల్ నారంగ్ అనేవ్యక్తి అరెస్ట్ అయ్యాడు. 1954లో ఈ విగ్రహం రామస్వామి అనే శిల్పి వద్దకు రిపేర్ కోసం వచ్చింది. దాని స్థానంలో నకిలీ విగ్రహాన్ని తయారుచేసేశాడు అతడు. ఆ తరవాత 1957లో బొంబాయిలోని ఓ ధనికుడయిన పార్శీకి ఆ విగ్రహాన్ని అమ్మడం జరిగింది. అటుపైన మెల్లగా విదేశమార్గం పట్టింది.

రామలాల్ నారంగ్‌కి విగ్రహాల వ్యాపారంకాక 'నారంగ్ ఓవర్‌సీస్ లిమిటెడ్' అనే కంపెనీ వుంది. 1965లో ఆకస్మికంగా దాడిచేసి అతని వద్ద చాలా పురాతన వస్తువులను స్వాధీనం చేసుకున్నారు కస్టమ్స్ అధికారులు. నిజానికి ఇండియాలోని ఏ మ్యూజియంలోను వస్తువులకు సరియైన భద్రత లేదు. అందులోని ఉద్యోగస్థులు కమిషన్స్ తీసుకుని వస్తువులను చేతులు మారుస్తారు. పైగా మ్యూజియంలోని వస్తువులకు సంబంధించి రిజిష్టర్లు సరిగా వుండవు. జునాగఢ్ మ్యూజియంనుంచి ఎన్నో విలువైన వస్తువులు అలా మాయమయ్యాయి. రాజకోట్ మ్యూజియంలోని వస్తువులతోపాటు వాటి రిజిష్టర్ కూడా మాయమయింది. ప్రస్తుతం కొన్ని మ్యూజియంలలో ఎలక్ట్రానిక్ అలారమ్స్‌ని పెడుతున్నారు. ఒక వస్తువుని తయారుచేసి దాన్ని ఓ 5, 6 నెలలు భూమిలో పాతరవేసి వుంచి అటుపైన వెలికితీసి అది పురాతన వస్తువేనని చెప్పి హెచ్చు వెలకి అమ్మేస్తున్నారు. కొనుగోలుదారులు కూడా చెక్ చేయించుకోవాలనే ఆలోచన లేకుండా వేలు, లక్షలు, కోట్లు కూడా పోసి కొనడానికి ఎగబడుతున్నారు.



# 'కెరటాలు'పై సమీక్షలు

అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన పట్టిసపు రాధామహలక్ష్మి నవల 'కెరటాలు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## న్యూజిలాండ్ దర్శిని

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**మె**డిసిన్ చదివి న్యూజిలాండ్‌లో జాబ్ సంపాదించిన శైలజ అక్కడ తనకు నచ్చిన ప్రియుణ్ణి కూడా సంపాదించి తోడి మిత్రురాండ్ర జీవితాలను తెలుసుకోవడానికి ఉబలాటంతో భారతదేశానికి వచ్చింది. రాగానే రెండు కాపురాలు వెలగబెడుతోన్న వినూత్న భర్త సాగర్ గురించి తెలుసుకొని కలత చెందింది.

తరువాత అనవసరపు అనుమానాలతో, అపార్థాలతో భర్త జీవితాన్ని నరకంచేసి, అతను చెడిపోవడానికి స్వయంగా ఆమె మాత్రమే కారణమయి, చేజేతులా తానే జీవితాన్ని మసి చేసుకున్న కవిత గురించి విని కన్నీరు పెట్టింది.

భార్యపోయిన వినోద్ జీవితాన్ని చూసి జాలిపడినా అతను తనను రెండో భార్యగా పొందగోరితే సున్నితంగా తిరస్కరించింది.

తొణకని నిండు కుండలాంటి మాధురి ఆర్థిక ఇబ్బందుల్లో తన చదువుకోసం డబ్బు పెట్టిన ఏభయ్యయిదేళ్ల వ్యక్తి తనని పెళ్లి చేసుకోమని వేధిస్తుంటే రోదిస్తోన్న మాధురి గాథ విని కన్నీరుమున్నీరయింది. వీరందరి జీవితాలకంటే తన జీవితమే బాగున్నదని





మురిసిపోతూ, న్యూజిలాండ్ వెళ్లాక అక్కడ ప్రియుని రహస్యం తెలుసుకొని బెంబేలెత్తిపోయింది.

ఇంతవరకూ నవల చదివాక రచయిత్రి హిందూ వివాహ వ్యవస్థలో ఉన్న లోపాలను, సంప్రదాయపు ముసుగులో రగులుతోన్న సెగలను, భుగభుగలను ఎత్తిచూపి దాడి చేస్తారేమోనని ఆశిస్తాంగానీ సడన్‌గా రచయిత్రికి తెలుగు సినిమాలు గుర్తుకొచ్చాయేమో హీరోయిన్ ప్రియుడు హంటర్ తిరిగొచ్చేశాడు. మంచివాడైపోయి మనువాడేస్తాడు. వినూత్న జీవితంలో నిప్పులు చల్లారి పువ్వులు విరబూస్తాయి. మాధురి కష్టాలు గట్టెక్కి కోరుకున్న గూటిలోకి చేరిపోయింది. కవితను మళ్లీ ఎలాగో బతికి వచ్చిందని చెప్పి ఆమెను కూడా ప్రవేశపెట్టనందుకు అభినందించాలి. వంట చేసే వనిత అయినా, డబ్బుసంపాదించే ఆడదానికైనా పురుషాధిక్య సమాజంలో అన్యాయమే జరుగుతోందని చెప్పదలుచుకున్న రచయిత్రి (మొదట్లో అలా అనిపించింది) డాక్టర్లందర్నీ ఓ పెళ్లి సెమినార్లోకలిపి కులాతీత, మతాతీత, సంప్రదాయాతీత, దేశాతీత వివాహాలు జరిపించేశారు. ప్రపంచాన్నో గూటికిందికి తేదలచుకున్న రచయిత్రి అభినందనీయురాలు.

పెద్ద చదువులు చదివి మనసుని తెలుసుకోకుండా వ్యామోహంతో వినూత్న సాగర్‌ని కోరుకోవటం, నెలలో పదిహేను రోజులు మరొకరితో అతన్ని పంచుకోడానికి సిద్ధపడటం వెగటు కలిగించింది. మరో అమ్మాయిని పెళ్లి చేసుకున్నా హంటర్ లేకపోతే తను బతకలేనని శైలజ అనుకోవటం, చదువులేని సగటు స్త్రీలా ఆలోచించటం చూస్తే ఆడవాళ్లలో ఎదుగుదల రాదా అనిపిస్తుంది. చదివించే గుణం ఉన్నా చదవనవసరంలేని నవల ఇది. అయితే న్యూజిలాండ్ విశేషాలను కళ్లకు కట్టినట్లు చూపటంలో మాత్రం రచయిత్రి కృతకృత్యులయ్యారు.

-స్ఫూర్తి
పార్వతీపురం

## ప్రయోజనం ఏమిటి?

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

రచయితలు తమ వంతు బాధ్యతగా సమాజాన్ని ముందుకు నడిపించాలేగానీ తిరోగమనానికి బాటలు వేయకూడదు. స్త్రీకి చదువు తెలివితేటల్నీ, విజ్ఞానాన్నీ, ఉద్యోగం- ఆత్మవిశ్వాసాన్నీ, జీవితాన్ని ఎదుర్కొనే ధీమానీ ఇవ్వకపోతే ఆ చదువు, ఉద్యోగం రెండూ నిరర్థకాలే.

"కెరటాలు'' నవలలో స్త్రీ పాత్రలకు కథాపరంగా ప్రాధాన్యం ఉన్నా, వ్యక్తిత్వపరంగా మాత్రం పూజ్యం. సమాజంలో ఉన్నతంగా చూడబడుతున్న డాక్టర్లు ఇందులోని స్త్రీ మూర్తులు. భర్త చేసిన తప్పును సమాజంలోనేకాదు తల్లిదండ్రులకు సైతం నిరూపించలేకా చేతకాకా ఆత్మహత్య చేసుకుని ఆ దుష్టుణ్ణి మంచివాడుగా సంఘంలో విడిచిపెట్టిన కవిత, సాగర్‌కన్నా అన్నింటిలోను అధికురాలై ఉండికూడా అతన్ని దేబిరించి పెళ్లి చేసుకుని ఇంకొక స్త్రీతో సంబంధం పెట్టుకున్న భర్తని నెలలో 15 రోజులైనా తన దగ్గరకు రమ్మనీ, సంతానాన్నిమ్మనీ కోరుకునే వినూత్న, హంటర్‌ని చూడగానే మోహించేసి అతను కొత్త ప్రదేశాలు చూపితే పరవశించి న్యూజిలాండ్ వాసిగా అతను చేతులు చాపితే భారతీయస్త్రీగా తను అతని బాహువుల్లోకి చేరిన శైలజ...

ఈ పాత్రల వలన ప్రయోజనమేమిటి?

అమెరికాలోని ఫియాన్సీ కాదన్నాకే శైలజను చేసుకున్న హంటర్‌ను ఏ పాఠకులు గౌరవిస్తారు?

వినూత్న అత్తగారి పాత్రలో శ్యామల ఒక్కరే రిలీఫ్ ఈ నవలలో. మాధురి, కృష్ణ, వినీత్ ఫర్వాలేదనిపించారు. అందరినీ కాకపోయినా ఏ ఒక్కరినైనా ఉజ్జ్వలంగా, చిత్రీకరిస్తే బావుండేది.



న్యూజిలాండ్ విశేషాలు మాత్రం ఇందులో చదవదగ్గవి. తన పాత్రల మీద అసంతృప్తి రచయిత్రికి ఉన్నట్లు కానరాదు. అందుకే ఎక్కడా రచయిత్రిగా నవలలో మాట్లాడలేదు. పాఠకురాలిగా ఇది నాకు పెద్ద అసంతృప్తిని కలిగించిన విషయం.

-రాయప్రోలు సుజాతాప్రసాద్
విజయనగరం

## చంద్రునిలో మచ్చ

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**మా**రిన కాలంతోపాటు మారలేని అతివమనసుకు దర్పణం పట్టినవి రాధామహాలక్ష్మి గారి 'కెరటాలు'. గౌరవ ప్రదమైన డాక్టరు వృత్తిలో వుండీ విదేశాలలో నివసిస్తున్నా భారతీయ సంస్కృతీ, సంప్రదాయాలకు తిలోదకాలివ్వలేక, విదేశీ సంప్రదాయాలకు అలవాటు పడలేక అడకత్తెరలో పోకచెక్కలా తల్లడిల్లుతుంది శైలజ. శీలాన్ని సమర్పిస్తుంది హంటర్‌కు. తన స్నేహితులతో చర్చించి ఒక నిర్ణయానికి రావాలని భారతదేశానికి వచ్చిన మనిషి వారంతా జీవితాలతో రాజీపడి బతుకుతున్నారనే నిరాశతో న్యూజిలాండ్‌కు తిరిగి వెళ్తుంది. అయితే హంటర్ భారతీయ సంప్రదాయాలకు ముగ్ధుడైనందువల్లనే భారతదేశానికే వచ్చి ఆమెను ఇక్కడే వివాహమాడతాడు.

న్యూజిలాండ్ గూర్చిన వివరాలు సందర్భోచితంగా వివరించారు రచయిత్రి. 'కెరటాలు' అనే టైటిల్ సరిపోయినా చంద్రునిలో మచ్చలా ఈ కథలోనూ ఒక లోపం మిగిల్చారు రచయిత్రి. వినూత్న పట్టుదలతో బావనే భర్తగా చేసుకున్నా జీవితంలో అతి ముఖ్యమైన స్వీయ వ్యక్తిత్వాన్ని కోల్పోతుంది. అన్నీ వుండి కూడా తనతో ఎందులోనూ సరితూగని సాగర్‌ను ప్రేమిస్తుంది. అయితే అతను న్యూనతాభావంతో ఆమెను నిర్లక్ష్యం చేసి లిల్లీని వివాహమాడినా కూడా నెలలో సగం రోజులు వినూత్నతో మిగిలిన సగం రోజులు లిల్లీతో గడుపుతానని అతననడం, అందుకు వినూత్న అంగీకరించడం, దానికి ప్రేమ అని పేరు పెట్టడం విడ్డూరంగా వుంది. ఈ పాత్ర తప్ప మిగిలిన కథంతా అతి సహజంగా మలచిన రచయిత్రి అభినందనీయురాలు. చక్కని నవలను అందించి 'చతుర' వారు మరోసారి తమ ప్రత్యేకతను చాటుకున్నారు.

-పి.మాలతి
తిరుపతి

## సమస్యలకు దర్పణం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**చ**తుర నవల 'కెరటాలు' రకరకాల స్త్రీల సమస్యలకు దర్పణం. రాధామహాలక్ష్మిగారు కొత్తరచయిత్రే అయినా కథను నడిపించిన తీరు ప్రశంసనీయం. అయితే రచయిత్రి కొన్ని విషయాలను గమనిస్తే మంచి రచయిత్రిగా కొనసాగుతారనడంలో అతిశయోక్తిలేదు. అనవసర పాత్రలకు పేరుపెట్టటం, జరిగిన కథను ఒక వ్యక్తి చెప్తున్నప్పుడు అందులో పాత్రలచేత ఎక్కువ సంభాషణలు చెప్పించటం, ఇవన్నీ చదువరులకు కొద్దిగా విసుగును కల్గిస్తాయి. జరిగిన కథను అవసరమైనంతవరకు సంభాషణలను చెప్పిస్తూ, చెప్పే వ్యక్తి మాటల్లో మిగిలిన కథను నడిపిస్తే చదవటానికి బాగుంటుంది.

కథాపరంగా చూస్తే తనకన్నా తక్కువ చదివిన వాడైనా అతన్నే ప్రేమిస్తూ, అతన్నే చేసుకుని ఆత్మన్యూనతతో అక్రమ సంబంధం పెట్టుకున్న భర్తను క్షమించి తన దారికి తెచ్చుకున్న వినూత్న, ఒక్కతే సంతానంగా పుట్టి, తల్లితండ్రుల దగ్గర గారాబంగా




పెరిగి, తన స్వార్థమే పరమార్థంగా ఇతరుల బాగోగులు గమనించని అమ్మాయిగా పెరిగి, భర్త ఆదరణకు నోచుకోక అక్రమ సంబంధం పెట్టుకున్న భర్త ప్రియురాల్ని చంపి, తను కూడా ఆహుతి అయిన కవిత, భార్యా విహీనుడైన వినోద్, చదువుకోసం ఒక వృద్ధుడివద్ద అప్పుచేసి, తనని పెళ్లిచేసుకోమని వేధిస్తున్న ఆ వ్యక్తిని వదిలించుకుని తను ప్రేమించిన వ్యక్తిని పెళ్లి చేసుకున్న మాధురి, వీరందరి కథలు వినీ, వారి గురించి బాధపడి, తన జీవితం కూడా అలాగే అవుతుందేమోనని భయపడి, తను ప్రేమించిన విదేశీయుణ్ణి పెళ్లాడి తన జీవితాన్ని నందనవనంగా మార్చుకున్న కథానాయకురాలు శైలజను ఈ నవలలో చూస్తాము.

రకరకాల మనుష్యులు, మనస్థత్వాలు, సమస్యలు, పరిష్కారాలు, ఈ నవలను చివరిదాకా చదివిస్తాయి.

ఒక్కరే సంతానంగా ఉన్నప్పుడు పిల్లల్ని ఎలా పెంచాలో కవితకథ మనకి చెప్తుంది. చక్కటి కథను అందించిన రాధామహలక్ష్మి గార్కి, చతుర సంపాదకులకు అభినందనలు.

**-జె.శ్రీలక్ష్మీపల్లవి**
హైదరాబాద్

## హ్యాట్సాఫ్...

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**దే**శమేదైనా ఉద్దేశమొకటే, భాష ఏదైనా భావమొక్కటే. పరదేశమైనా స్వదేశమైనా ప్రేమకి నిర్వచనం మారదని రుజువు చేస్తూ స్వదేశంలోని తన మిత్రుల జీవన గమనాలకి ఆశ్చర్యపోయి విదేశమైనా అభిమానం, ఆత్మీయతల్ని వెతుక్కుంటూ తిరిగి వెళ్లిన ఓ ప్రేమిక కథానాయికగా బతుకు కెరటాల్ని విశ్లేషిస్తూ రాసిన అక్టోబర్ నెల చతుర నవల 'కెరటాలు' చాలా బావుంది.

భర్త పరస్త్రీని మరిగినా బావ భర్తగా మారిన బంధానికి బానిసై అతనిపై ఉన్న ప్రేమకి తార్కాణంగా అత్తయ్యకి అండగా కూతురిలా ఉంటూ దాంపత్యపు మంచిరోజు కోసం నిరీక్షించిన వినూత్న జీవితం శైలజ రాకతో ఓ మలుపు తిరిగి ఆశించిన ఫలితం దక్కడం కథకి ఓ వన్నె తెచ్చింది.

కవితలాంటి అమాయకపు భార్యలు మాయగాడైన భర్త చంద్రశేఖరం లాంటి మేకవన్నె పులుల చేతుల్లో దినదినగండంగా బతుకీడుస్తూ అదను దొరగ్గానే సావిత్రిలాంటి స్త్రీలను అంతంచేసి తాము కూడా బలైపోవడానికి సిద్ధపడడం నిజంగా సాహసమే!

వినోద్‌గాథ జాలి కలిగించినా, శైలజని పెళ్లి చేసుకుంటానని అర్థించిన వినోద్‌ని ఆమె నిరాకరించడంతో చివరికి మరదలు పద్మతోడుగా జీవితం సుఖాంతం కావడం రిలాక్సనిపించింది.

మాధురి లవ్‌స్టోరీ సస్పెన్స్‌లో ఉంచి పట్టుసడలకుండా చివరివరకు పాఠకులను చదివింపజేసింది. ప్రాణానికి ప్రాణంగా ఒకపై ఉంటున్న శైలజ, హంటర్‌ల ప్రణయ రాగజీవనాన్ని మధ్యలో ఫియాన్సీ కాస్త అడ్డుపడి అపశృతి కల్గించినా ముగింపులో మధురమైన గానంగా ఆనందభైరవి రాగం ఆలపించడం మనసుకి ఆహ్లాదాన్ని కలిగించింది.

న్యూజిలాండులోని పలు ప్రదేశాల్నీ, వాటి అందాల్నీ విశేషాలతో హంటర్, శైలజల పిక్నిక్ సన్నివేశాల్లో పాఠకుల కళ్లకు కట్టినట్టు వివరిస్తూ అద్భుతంగా మలచిన రచయిత్రికి హ్యాట్సాఫ్. కెరటాల్లాంటి జీవితాల్ని ఆరాటంగా చదివింపజేసిన చతురకి మరోసారి కంగ్రాట్స్.

**-అవునలి ఆంజనేయులు**
హైదరాబాద్

# చతుర

సంపుటి : 20 సంచిక : 11 డిసెంబర్ : 1997

ఆర్టీసీ బస్‌లో టౌనుకు, పల్లెటూరికి మధ్య నీలుగుతూ నడిచే లేడీ కండక్టర్ ఆమె. నలుగురు అక్కచెల్లెళ్లలో అందరికన్నా పెద్దది కనుక ఆ ఏమీలేని కుటుంబాన్ని దారికి తేవడం తన బాధ్యత అనుకుంది.

మరి బాధ్యతగా పనిచేసే ఆ యువతి ఓ దుర్ముహూర్తాన టికెట్ తీసుకోని ఓ పీనాసి ప్రయాణీకురాలి మూలంగా చెకింగ్ స్క్వాడ్ రాక చూసి గడగడలాడిపోవాల్సిన విపత్కర పరిస్థితినెలా ఎదుర్కొంది?

బాల్యంనుండి యవ్వన ప్రాయందాకా అనేకానేక ఆటుపోట్లకు గురయిన ఆమె జీవనయానం చివరికేమలుపు తిరిగింది?

పల్లెటూరి అందరికీ అలుసయి లేడీ బస్‌కండక్టర్‌గా జనం మధ్య గడపాల్సివచ్చే మహిళల సాధక బాధకాలను ఆసక్తికరంగా వర్ణించిన....




ఎ. జయలక్ష్మిరాజు నవల
ప్రయాణం
'చతుర' పాఠకులకు ఓ ఉత్కంఠభరిత సాహితీయానం.

శ్లోకం చదవటం ముగించి హారతి పళ్లెం పట్టుకుని వెనుతిరిగిన సీతమ్మను తదేకంగా చూసింది లీలావతి. అరవైఏళ్లు దాటినా సీతమ్మ ఆరోగ్యం చెక్కుచెదరలేదు. ఆరోగ్యమే కాదు రోజువారీ దినచర్యలు, నియమనిష్టలు కూడా చెదరలేదు. "ఈవిడ వయసు వచ్చేసరికి నేనింత హుషారుగా వుండగలనా? "

"ఏమిటి లీలా పరధ్యానం. దేముడికి దణ్ణం పెట్టుకో!" అంటూ ప్రసాదం చేతిలో పెట్టింది. హారతి కళ్ళకద్దుకుని ప్రసాదం నోట్లో వేసుకుని,

"డ్యూటీకి వెళ్ళొస్తాను బామ్మగారూ!" అంది లీల.

"కాసేపాగు! కాఫీ కలిపిస్తాను" అంది బామ్మ.

"వద్దండి! టైం లేదు"

"ఎలాగూ పెందరాళే లేస్తావుకదా! ఇంకో పదినిమిషాలు ముందుగా నా దగ్గరికొస్తే ఏంపోతుంది. శుభ్రంగా కాఫీ తాగి వెళ్ళేదానివికదా!"

"అవుననుకోండి! మీకెందుకండి శ్రమ. నా ఈ ప్రయాణం ఒకరోజు రెండురోజులది కాదుకదా! అన్నట్టు మీరు నిన్నటినించి ఏదో హడావిడిలో ఉన్నట్టున్నారు. నిన్న రాత్రి ఏవో పిండివంటల వాసనలు కూడా మీ ఇంట్లోంచి వచ్చాయి. నాకు పెట్టకుండా తినేశారా? " చనువుగా అంది లీల!

"నీకు పెట్టకుండా తింటానుటే అమ్మా! ఈరోజు నా మనవడు ఆనందరావు వస్తున్నాడు. వాడికీ ఊరు బదిలీ అయింది..." అంటున్న ఆవిడ మాటలు కట్ చేస్తూ, "బామ్మగారూ సాయంత్రం తీరిగ్గా మాట్లాడుకుందాం. టైం అయింది నేను వెళ్ళొస్తానండి!" అంటూ వ్యానిటీ బ్యాగు సర్దుకుంటూ గేటుదాటి వెళ్ళిపోయింది లీల.

"ఏమిటో! పెళ్ళి చేసుకుని పిల్లాపాపలతో, హాయిగా ఉండాల్సిన పిల్ల! ఆ ఎర్రబస్సుల్లో వెళ్లి పొద్దున్నించి సాయంత్రందాకా చాకిరీ చేసి వస్తుంది. వంటచేసుకుని కడుపారా తినటానికి కూడా ఓపిక లేనట్టు ఏదో కాస్త ఎంగిలిపడి, అలసిపోయిపడి నిద్రపోతుంది పాపం!" అనుకుంటూ లోపలికెళ్ళింది సీతమ్మగారు!

"లీలావతి డ్యూటీ కెళ్ళిపోయిందా పిన్నీ? " అంటూ తలంటుకున్న తలను తుడుచుకుంటూ లోపలికొచ్చింది కావేరి.

"ఆc ఇప్పుడే ఆ పిల్ల అలా వెళ్ళింది. నీవిలా వచ్చావు" అంది పాలు పొయ్యిమీద పడేస్తూ సీతమ్మగారు!

"కాస్త కాఫీ కలిపివ్వకపోయావా పిన్నీ! మా పాలవాడు ఏడింటిగ్గానీ రాడు. లేకుంటే నేనే కలిపి ఇచ్చేదాన్ని" అంది కావేరి.

"సరేలే! ఎన్నిసార్లు కలిపివ్వలేదు? ఆ పిల్ల తాగితేకదా! టైంలేదు... టైంలేదు అంటూ ఒకటే పరుగు! అందుకే పనిదండగ అని మానుకున్నాను" అంది సీతమ్మ.

"ఏం ఉద్యోగమో ఏమో! అయినా ఆడవాళ్ళకిలాంటుద్యోగాలు తగవే అమ్మా! ఏదైనా ఆఫీసులో కూర్చుని చేసే ఉద్యోగం సుఖం కదా!" అంది సీతమ్మగారు మళ్లీ.

"ఏమిటి పిన్నీ! రోజూ పేపరు చదువుతావు. మంచీ, చెడ్డా చెబుతావు. నువ్వా అందరి ఆడవాళ్లలాగా అనుభవం లేనిదాన్లా మాట్లాడతావు. ఆడవాళ్లు చేయని ఉద్యోగాలున్నాయా ఈ రోజుల్లో! అవకాశం వచ్చి ఉద్యోగం చేస్తున్నమ్మాయిని ప్రోత్సహించాలిగానీ... నా ముందరంటే అన్నావు, ఇంకెవరి ముందరా అనకు బాగోదు. డిగ్రీ చదువుకుని అంట్లు తోముతూ, మొగుడికి తెలియకుండా ఒక్క రూపాయి ఖర్చు పెట్టుకునే స్వతంత్రం లేక, అతని మాటకు కట్టుబడి ఉద్యోగం చేయటానికి వీల్లేక నేనెంత బాధ పడుతున్నానో చూడు" అంది కావేరి.

 

"నిజమేననుకో కావేరీ! 'దూరపు కొండలు నునుపు' అన్నట్టు, ఎక్కడో మనకు తెలియని, కనపడని స్త్రీలు ఉన్నత ఉద్యోగాలు చేస్తున్నారని పేపర్లో చదివి, అబ్బా! ఆహా! ఓహ్! అనుకుంటాం. ఎందుకంటే వారి సాధక బాధకాలు మనకు తెలియవుకదా!

కానీ కళ్లముందున్న అమ్మాయి ఉద్యోగంలో పడుతున్న ఈ అవస్థ కళ్లారా చూస్తుంటే ఎందుకొచ్చిన ఉద్యోగాలు, పెళ్లిచేసుకుని నీడపాటున కాపురాలు చేసుకోకుండా అనిపిస్తుంది. అయినా మా ఇంట్లో ఎంతమందో అద్దెకుండి వెళ్లారు. కానీ ఈ అమ్మాయిలాగా నా మనసునెవరూ ఆక్రమించలేదు సుమా! ఏ జన్మలో ఏ బంధమో!" అంది సీతమ్మగారు వేదాంత ధోరణిలో సంభాషణ ముగిస్తున్నట్టు.

"అలాగని ఎందుకనుకుంటారు అత్తయ్యగారూ! మీకు తెలియకుండా ఏ పుష్కరాల్లోనో, మీ కూతురి కూతురో, కొడుకు కూతురో తప్పిపోయి, ఎవరికో దొరికి, ఎలాగో చదివి, ఇప్పుడిలా చివరికి మిమ్మల్ని కలుసుకుని, ఏ పుట్టుమచ్చ ఆధారంగానో, గుర్తుపట్టి మీ మనవరాలు ఉరఫ్ కండక్టర్ లీలావతిగా కనిపించి తెరమీద 'శుభం' పడవచ్చుగా" అంటూ వారిద్దరి మధ్య సంభాషణలో తలదూరుస్తూ అన్నాడు కందస్వామి.

"చూశావా! ఇదీ వరస!" అన్నట్టు చూసింది కావేరి సీతమ్మకు భర్తను చూపిస్తూ.

"చూడు కందస్వామీ! తెలుగు సినిమా పరిజ్ఞానమంతా ఒలకబోసి గొప్పపని చేశావుకానీ, ముందిక్కడినించి కదులు! అమ్మా కావేరీ నీ మొగుడిని తీసుకుని వెళ్లు. ఈరోజు నా మనవడు వస్తున్నాడు. స్వీట్సు చేయాలి. దయచేసి డిస్టర్బ్ చేయకండి" ఏమాత్రం మొహమాటం లేకుండా అనేసింది సీతమ్మ.

"మీ ఇంట్లో అద్దెకుంటున్నాంకదాని మరీ మొహంమీదే మాట్లాడే పద్ధతి బాగాలేదు. మార్చుకోమంటే మార్చుకోరు! సరే! ఈరోజుకు మిమ్మల్ని క్షమిస్తున్నాం! రావే పోదాం!" అంటూ భార్యను తీసుకుని అక్కడినించి కదిలాడు కందస్వామి.



ఆర్.టి.సి. డిపోనుంచి బస్టాండులోని నాలుగవ నంబరు ప్లాటుఫారం దగ్గరకు, దడదడలాడుతూ వచ్చి ఆగింది ఖాళీ ఎర్ర బస్సు! ఆ బస్సు రాగానే, ఆ వూరికి సంబంధించిన వారంతా, తోసుకుంటూ బస్సు తలుపు దగ్గరకు చేరిపోయారు. డ్రయివరు తలుపు తీసుకుని దిగిపోయి ఆర్.టి.సి. బస్టాండులోనున్న క్యాంటీన్‌లో దూరాడు. కండక్టర్ లీలావతి కూడా బస్సు దిగి విచారణ కేంద్రం దగ్గరకు వెళ్లి త్వరగా తిరిగి బస్సు దగ్గరకు చేరుకుంది.

మైకులోంచి "ఫలానా పురంనించి ఫలానా పురంవరకు వెళ్లు బస్సు నాలుగవ నంబరు ప్లాటుఫారంమీద రెడీగా ఉన్నది" అంటూ అనౌన్సర్ వినిపిస్తున్నాడు. బస్సు క్రిక్కిరిసి ఉంది. మనుషులెంతమంది ఉన్నారో, లగేజి కూడా అంతే ఉంది! 'లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్' అని ఇంగ్లీషులోనూ, 'తక్కువ లగేజితో ప్రయాణం సుఖమయం' అంటూ తెలుగులోనూ బస్టాండులోని గోడలమీద నీతివాక్యాలు వ్రాసినట్లు. వ్రాసినా వాటిని చదవటానికి ఈ ప్రయాణీకులకు సమయమెక్కడ? వారి కళ్లన్నీ వచ్చే బస్సు వెళ్లే బస్సుమీదున్న నేమ్‌ప్లేట్లు చదవటంతోనూ, బస్సు ఆలస్యానికి కారణాలు చర్చించుకోవటంతోనూ సరిపోతుంది. ఎవరో ఒకరో, ఇద్దరో శ్రద్ధగా చదివినా, 'అయినా ఎంత లగేజి తీసుకుపోతే ఏం? వీళ్ళ సొమ్మేం పోయింది. గోడలమీద రాతలు రాసేవాడిని మొయ్యమన్నామా? బస్సుకదా మోస్తుంది. పనిలేకపోతే సరి' అని మనసులో విసుక్కున్నవారూ లేకపో

లేదు!

"అబ్బ! ఈ బస్సు ఇంకా ఎంతసేపటికి కదులుతుందో! ఉడకబెట్టి సంపుతుంది! గాలి ఆడడంలేదు"

"బస్సు పోతావుంటే కొంచెమన్నా ఊపిరాడ్తుంది"

"ఏమ్మా! కొంచెం జరుగు. ముగ్గురు కూసుండే సీట్లో ఇద్దరే కూసున్నారు. ఆ పిల్లను మీద కూసోబెట్టుకో"

"ఆ! బాగుంది నీ కథ. పిల్లదానికి పైలో బాగలేదు. ఎనిక్కిపో సీట్లుంటాయి!"

"వాయబ్బ! ఎనక సీట్లుండేది నువ్వే జెప్పాల. బస్సును నువ్వే కొనినట్టు మాట్టాడుతుండావె"

"ఎక్కువ మాట్లాడద్దు! మట్టసంగ మాట్లాడు"

బస్సులో పోట్లాట శృతిమించుతోంది.

లీలావతి, "ఎందుకమ్మా అలా పోట్లాడుతారు. పది నిమిషాలు ఓర్చుకుంటే మీ ఊరొస్తుంది. కాస్త సర్దుకో! పాపను ఒళ్లో పడుకోబెట్టుకో!" అంటూ సర్ది ముందుకెళ్లి టికెట్లు ఇవ్వసాగింది. బస్సులో సీట్లు నిండిపోయి, ఆ చివరినించి ఈ చివరిదాకా మగ ఆడ తేడా లేకుండా నిలబడిఉన్నారు. మనుషులే ఎక్కువ అనుకుంటే కాలు పెట్టడానికి వీల్లేకుండా ఎవరి కాళ్లదగ్గర వారి గంపలు, మూటలు వేసుకుని నిలబడ్డారు. ఆ బస్సు నిండా పల్లెటూరి జనం! ఎవరో ఒకరిద్దరు నాగరికతకు అలవాటుపడిన నాజూకు మనుషులున్నారు. వారు ఆ ఊరికున్న ఆ ఒకే ఒక్క బస్సును మనసులోనే తిట్టుకుంటూ ఇస్త్రీ మడతలు నలిగిపోతున్న తమ గుడ్డలకేసి దీనంగానూ, తోస్తున్న జనంవేపు కోపంగానూ, కక్కలేక మింగలేక చూస్తున్నారు.

"ఎవరయ్యా! ఈ మూటలిలా దార్లో పెట్టింది? పైన వెయ్యకూడదా? " లీలావతి విసుక్కుంది.





"ఎయ్యచ్చు కండట్టరమ్మా పైన కూడా మనుసులు కూసున్నారు ఇంగేడెయ్యాల!" కిసుక్కున నవ్వులు వినిపించాయి.

"కాస్త జరుగు ఎవరయ్యా! టికెట్! రెండు రూపాయలుంటే ఇవ్వు అయిదు రూపాయలిస్తా! అందరూ ఇరవైనోటు ఇస్తే చిల్లర ఎక్కడినించి వస్తుంది. టికెట్టు వెనుక రాశాను బస్సు దిగేముందు అడుగు చిల్లర ఇస్తాను. టికెట్! టికెట్! ఏమ్మా ఎక్కడకెళ్ళాలి. రెండున్నర టికెట్టుకు యాభై నోటిస్తే ఎలాగమ్మా! కాస్త సర్దుకుని ఆ ముసలమ్మకు సీటివ్వు!"

"ఏమ్మా! టికెట్లిచ్చేదయిపోయిందా? బస్సుపైన కూడా జనం ఉన్నట్టున్నారు చూడు" డ్రయివరు కేకేశాడు.

"ఇదిగో అన్నా రెండు నిమిషాల్లో అయిపోతుంది" లీల బదులిచ్చింది టికెట్లిస్తూనే.

"యాడ రెండు నిమిషాలు తల్లీ! గంటాయె సగం బస్సు అయిపోలేదు. నువ్వెప్పుడు టికెట్లిస్తావో! ఈ బస్సు ఎప్పుడు కదులుతుందో సెగకు సచ్చిపోతుండాము" బస్సులో ఎవరో ఒకతను గట్టిగా అనేశాడు. లీలావతి బదులివ్వలేదు. తన పని తాను చేసుకుపోతూ వుంది. "రైట్ రైట్" అంది. బస్సు నెలలు నిండిన గర్భవతిలా భారంగా కదిలింది. అయిదు కిలోమీటర్లు ప్రయాణం చేయగానే "హోల్డన్" అంది లీల!

"ఏం తల్లీ! ఊరిబయట ఆపిస్తివి! ఈడ యా ఊరుంది? " ఓ ఆడగొంతు ప్రశ్న!

లీలావతి బస్సుదిగి పైనున్నవారివైపు చూస్తూ "ఏమయ్యా! కిందికి దిగొచ్చి టికెట్లు తీసుకుని వెళ్లండి"

"మమ్మల్ని సూల్లేదనుకుంటిమే! దిగురా దిగు" అనుకుంటూ అంతా దిగొచ్చి టికెట్టు తీసుకుని మళ్ళీ పైకెక్కారు.

"ఎందుకు మామా బస్సు ఈడ నిలబెట్టినారు? " ఎవరో అమ్మాయి మొగుడనే మేధావిని అడుగుతోంది.



"ఆ! ఏంలేదులేయే! మగ కండక్టర్లయితే సెకసెకమని రెండు నిమిసాల్లో టికెట్లి త్తారు. ఈ ఆడకండక్టర్లకు యాడ సేతయి తది. ఇంగ కొంచేపుంటే మనూరొచ్చేత్తాది. ఈయమ్మ ఇంగా టికెట్లియ్యలే! ఊరొత్తే బిల బిలమని దిగిపోతారు. అందుకని బస్సు నిలబెట్టి టికెట్లిస్తాందన్నమాట" వివరించేశా డతను.

"ఈయమ్మకు జీతమెంతిత్తారుమామా?"

"ఆ! ఈల్లజీతమెంతలేయే మన రెండు గొర్రెలు ఇలువంత! పైయ్యాదాయం జాస్తి" చివరి ముక్క అందరికీ వినిపించేంత రహ స్యంగా చెప్పాడు.

"సిల్లరంతా కండక్టర్లే కొట్టేత్తారంటగదా మా అయ్య సెప్తుంటాడు!"

"మేలేనే! మీ అయ్య సొగిలోడనుకున్న ఇట్టా ఇసయాలుగూడ తెలుసే!"

"పో మామా! మా అయ్యంటే నీకెప్పుడూ సవకే!"

వారి సంభాషణ లీలావతికి స్పష్టంగా వినిపిస్తున్నా వినిపించనట్టు ట్రేముందు పెట్టుకుని లెక్కపెట్టుకోసాగింది. ఆమెకు ఈ సంభాషణలు, దెప్పిపొడుపు మాటలు అలవాటయి ఆరునెలలయింది. వాటికి స్పందించటం మానేసింది. స్పందించి చేసే దేమీలేదు. ఒకరోజు కాదు నెలకాదు... ఒకరు కాదు... ఇద్దరు కాదు... ఆ నిరక్షరా స్యులతో, ఆ మొరటు జనంతో తను వాదిం చలేదు. అందుకే తనపని తాను చూసుకుని చెవిటిదానిలా సాగిపోతోంది. సాయంకాలం ఏడు గంటలకు డ్యూటీనించి ఇంటికి వచ్చింది లీలావతి. గది అంతా శుభ్రంచేసి స్నానం చేసివచ్చి కాసిని బియ్యం కడిగి స్టౌమీద పడేసింది. మధ్యాహ్నం ఆ పల్లె టూరి హోటల్లో రుచీ, పచీ లేని మెతుకులు తిన్నదేమో ఆకలి చంపేస్తోంది.





"ఏం చేస్తున్నావు లీలా" అంటూ కావేరి ప్రవేశించింది.

"అన్నం చేస్తున్నానండీ కూర్చోండి. ఏమిటో మోసుకొచ్చారే" అంటూ ఆమె చేతిలో ఉన్న గిన్నెలందుకుంది.

"ఆ! ఈవేళప్పుడొచ్చి ఇంకేం కూరలు చేసుకుంటావని గుత్తివంకాయ కూర వండాను అదే పట్టుకొచ్చాను. పెరు గుందా? తెమ్మన్నావా?" అంది కావేరి.

"పెరుగు బామ్మగారు తోడుపెట్టి ఉంటుంది. తెచ్చుకుంటాను. ఇదిగో ఈ సంచిలో కూరలు పట్టుకొచ్చాను తీసికె ళ్ళండి. రోజూ ఏదో ఒక కూర చేసుకుందా మని కూరలు కొనితెస్తాను.

ఏదీ మీరూ బామ్మగారు నన్ను చేసుకోని స్తేగా? నిజంగా ఏ జన్మలో రుణమో నన్ను మీ ఆడపడుచులాగా చూసుకుంటున్నారు" అంది లీలావతి.

"సరేలే! మొదలుపెట్టావా పొగడ్తలు! ఇరుగు పొరుగు అన్న తర్వాత ఆమాత్రం ఒకరికొకరు సహాయపడకపోతే ఎలాగ? ఏం వెంటబెట్టుకుపోయేదుంది. ఈరోజు ఇంట్లో రేపు కాట్లో! సరె సరెలే భోంచేసి పడుకో! రేపు నీకు సెలవుకదా"

"అవునండి"

"నీ స్నేహితురాలు వస్తుందేమోకదా!"

"అవును. ఏం అలా అడుగుతున్నారు?"

"ఏంలేదు! సినిమాకెళ్ళక చాలా రోజు లైంది. మీ అన్నయ్యకు సినిమాలు పట్టవు. నన్ను తీసికెళ్ళరు. బామ్మగారేమో పాత సిని మాలకు తప్ప కొత్త సినిమాలకు రానం టుంది. నీవేమైనా వస్తావేమోనని. మీ ఫ్రెండుతో వెళతావు కాబోలు..." అంటూ నసిగింది కావేరి.

"అదేమిటండీ! అలాగంటారు. మా ఫ్రెండు ఉంటే మాత్రమేం? ముగ్గురం కలిసే వెళదాం సరేనా?" అంది లీల.

కావేరి ముఖం వికసించింది. "అలాగే!

నువ్వు సెలవుందికదాని వంటలు మొదలు పెట్టకు. లేవగానే బట్టలు ఉతికేసెయ్యి. వంట నేను చేస్తాను" అంది కావేరి.

"అలాగేలెండి! అన్నట్టు బామ్మగారి మనవడు వచ్చారా? " అంది లీల.

"ఆ! వచ్చాడు! అతనికి నిండా ముప్ఫ య్యేళ్లు లేవు. ఆడవాసన పడదుట. ఎప్పుడూ గదిలో కూర్చుని పుస్తకాలు చదువుకుంటాడుట. గట్టిగా మాట్లాడకూడదుట. అదేదో ఆఫీసులో గుమాస్తాగిరి వెలగబెడుతున్నాడుట. పోజు మాత్రం, సినిమాలో పోలీసాఫీసర్ల టైపు, నువ్వేమన్నా అను. అతని ఫేసు మాత్రం నాకు నచ్చలేదనుకో" అంది కావేరి.

నవ్వేసింది లీల! "అందరూ ఒకలాగా ఉండరుకదండీ! అయినా ఆయన ఎన్నాళ్లుంటారు. ఓ వారం రోజుల్లో వెళ్ళిపోరూ!" అంది.

"ఇంకెక్కడికి వెళతాడు. ఈ ఊరికే ట్రాన్సఫరయిందిట. ఆ గదిలో నేనుండేవాడినికదా! అద్దెకెందుకిచ్చావని, బామ్మతో ఉదయంనించి నస పెడుతున్నాడు"

"అమ్మో! కొంపదీసి గది ఖాళీ చెయ్యమనరుకదా!"

"బామ్మగారికి నువ్వంటే అభిమానంకదా! మనవడికి ఏదో సర్ది చెబుతూనే ఉంది"

"ఏమిటో! ఒంటరిగా ఈ ఊరొచ్చి ఉద్యోగం చేస్తూ ఎలా బతుకుతానో, ఏం బాధలు పడాలో అని భయపడేదాన్ని. తల్లిలాంటి బామ్మగారు, తోబుట్టువులాంటి మీరు నన్నెంతో ఆదరంగా చూస్తున్నారు. ఈ గది, ఈ కాంపౌండులోని మీరంతా, నాకు బాగా అలవాటయి ఆత్మీయులయ్యారు. ఉన్నట్టుండి గది ఖాళీ చెయ్యమంటే..." అంది బాధ మిళితమైన గొంతుతో!

"అయ్యో! లీలమ్మా! ఊరికెనే బెంబేలు పడిపోతావేంటి! నేనున్నాగదా" అంటూ ధైర్యం చెప్పి,

"అన్నట్టు నీకో ఉత్తరం వచ్చింది. ఉండు తెస్తాను" అంటూ వెళ్ళిపోయింది కావేరి!

★ ★ ★

లీలావతి శంకరయ్య, పద్మావతమ్మల మొట్టమొదటి సంతానం. ఆమె తర్వాత మరో ముగ్గురాడపిల్లలు, ఓ మగపిల్లవాడికీ జన్మనిచ్చింది పద్మావతమ్మ! శంకరయ్య ఓ కానిస్టేబులు. బొటాబొటి జీతం, పెద్ద సంసారం ఎప్పుడూ ఏదో ఒకటి లేదు అన్న శబ్దం వినటం అలవాటయి నిరాసక్తంగా జీవితాన్ని గడుపుతున్న జీవులు!

లీలావతి బి.ఏ. పాసయింది. బి.ఇ.డి. సీటు కూడా వచ్చింది. కానీ ఆమెను చదివించే స్థోమతలేక, అంతటితో ఆపుచేయించి పెళ్లి సంబంధాలు వెతకటం మొదలుపెట్టారు. చచ్చీ చెడీ ఓ సంబంధం ఖాయం అవటం, పెళ్ళిపందిట్లో పెళ్లి ఆగిపోవటం జరిగాయి. ఇప్పట్లో తనకు పెళ్లిప్రయత్నాలు చేయకండి అంటూ ఓ ప్రయివేటు స్కూల్లో టీచరుగా చేరింది లీలావతి. ఓసారి పేపర్లో కండక్టర్ల పోస్టులు గురించి పేపర్లో వార్త రావటం, లీలావతి అప్లై చేయడం, అవలీలగా ఉద్యోగం రావటం చకచక జరిగిపోయాయి. తను ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకోననీ, చెల్లెళ్ల పెళ్లి ప్రయత్నాలు చేయండని, తల్లిదండ్రులకు చెప్పి, ఊరు వదిలి వచ్చేసింది లీలావతి. మొదట్లో, ఉద్యోగం గురించి, ఒంటరిగా ఉండటం గురించి భయపడింది. ఓ టైంలో ఉద్యోగం వదిలి పారిపోదామని పెట్టే బేడా సర్దుకున్న రోజులూ లేకపోలేదు. కానీ అంతలోనే మనసు గట్టి చేసుకుని, మనుగడ సాగించింది. ఉద్యోగం వదిలి తల్లిదండ్రుల పంచన చేరినా, అక్కడా సుఖశాంతులు లేవు. వేణ్ణీళ్లకు చన్నీళ్లు అన్నట్లు తన జీతం కుటుంబానికి కాస్త ఆసరా ఉండటమేకాక, ఉద్యోగం చేస్తుండటంవల్ల కుటుంబంలో

తనంటే ఓ ప్రత్యేక గౌరవం కూడా ఉంటోంది. ఈ ఉద్యోగమే లేకుంటే పెళ్లి తప్పిపోయిన నష్టజాతకురాలిలా, తల్లిదండ్రుల గుండెలమీద కుంపటిలా, చీదరింపబడుతూ... తన తరువాతి చెల్లెళ్ల భవిష్యత్తుకు అడ్డుకట్టలా... ఆ అనుభవాలనూ చవిచూసి ఉండటంతో... ఈ ఉద్యోగంలో ఎన్ని ఇబ్బందులున్నప్పటికీ, అధికమించగలుగుతోంది. తన తోటి ఉద్యోగినులు సరోజ అరవిందలతో స్నేహం కుదిరింది! అద్దెకు గది ఇచ్చిన సీతమ్మగారి ఆదరణ, తోబుట్టువులా చూసుకునే కావేరి, కందస్వామిగార్ల అభిమానం, లీలావతికి ధైర్యాన్నిచ్చి నిలబెట్టాయి.

"ఎక్కడినుంచి ఉత్తరం? ఇంటి నుంచేనా? ఇంకా జీతాలు రాలేదే? " అంటూ ప్రవేశించింది సరోజ ఉత్తరం చదువుతున్న లీలావతి పక్కకు చేరుతూ!

"ఇంటినుంచి కాదు! పెన్ ఫ్రెండునుంచి" అంది లీలావతి.

"ఓహో! ఏం రాశాడేమిటి? "

"ఏదో రాస్తుంటాడు! రెండు పేజీలకు తక్కువ రాయడు. కానీ అందులో విషయమేదీ ఉండదు. అయినా ఉత్తరం బోర్‌కొట్టదు. పైగా అతని ఉత్తరంకోసం ఎదురు చూస్తుంటాను నాకు తెలీకుండానే!"

"కొంపదీసి అతన్ని ప్రేమిస్తున్నావా? " అంటూ దిండుకిందా పరుపుకిందా వెతకసాగింది సరోజ.

"ఏమిటి వెతుకుతున్నావు? " అంది కనుబొమలు ముడిచి లీలావతి.

"కలం స్నేహితుడి ఫోటో దిండుకిందో పరుపుకిందో దొరుకుతుందేమోనని"

"పిచ్చిచేష్టలు చెయ్యకుండా నోరు మూసుకుని ఉండు" అంది కోపం నటిస్తూ లీల.

"అవునూ ఈ కలం స్నేహితుడి అడ్రసు నీకెలా దొరికింది? అతనికి నీ అడ్రసు ఎలా తెలిసింది? ఎవ్వరితోనూ సరిగా మాట్లాడకుండా సామ్రాజ్యం కోల్పోయిన యువరాణిలా ఉండే నీవు ఓ అనామకుడితో ఈ కలం స్నేహం ఏమిటి? ఎన్నిసార్లడిగినా చెప్పవేంటి? "

"ఇందులో చిదంబర రహస్యమేదీ లేదు! ఊరికే నిన్ను ఉడికించటానికి వెంటనే జవాబు చెప్పనంతే! ఓ రోజు డ్యూటీ నుంచి వస్తూ మిరపకాయ బజ్జీలు పొట్లం కట్టించుకు వచ్చాను. అవి తిన్న తర్వాత ఉండ చుట్టి పారేయబోయి ఆ పేపరును ఇటూ అటూ చదివాను! అందులో కలం స్నేహం చేయటానికి ఇష్టపడుతున్న వారి పేర్లు, అడ్రసులు రాశారు. ఆ పేర్లలో సారధి అన్న పేరు నాకు నచ్చినట్టు అనిపించింది. అతని అడ్రసుకు నా పేరు, అడ్రసు తెలుపుతూ మీతో కలం స్నేహం చేయాలని ఉంది. అని రాశానంతే అప్పటినుంచి జిడ్డులా పట్టుకున్నాడు. మొదట్లో వారానికొకటి రెండు ఉత్తరాలు శ్రద్ధగా రాయడమైతే రాశాను. అతను వెంటవెంట బదులివ్వటమే కాక ఇపుడు నేను రాయకపోయినా అతను రాస్తూనే ఉన్నాడు. ఈ మగాళ్లను నమ్మిందెవరు? దారినపోయే దెయ్యాన్ని ఇంటికి తెచ్చుకున్నట్టు, ఈ కలం స్నేహం ఎక్కడికి దారితీస్తుందోనని భయమేస్తుంది. ఒక్కోసారి ఏం భయంలెద్దూ. ఈ అడ్రసు మారితే అతను రాసేదేముంది అని నాకు నేను సర్ది చెప్పుకుంటుంటాను. ఇదీ సంగతి. తీరిందా సందేహం... పదపద. కావేరి రెడీ అయిపోయింది. సినిమాకు వెడదాం" అంటూ తొందరచేసింది లీలావతి.

"అబ్బ! ఏం సినిమాలెద్దూ! మీ ఇంటిగల వారబ్బాయి వచ్చాడన్నావు, కాస్త పరిచయం చేసుకుంటే కాలక్షేపం అయ్యేదిగా!" అంది సరోజ.




"అతనితో నీకేం పని? అసలే అతను ఋష్యశృంగుడట! ఏదో మర్యాదగా ఉద్యోగాలు చేసుకుంటూ గుట్టుగా బతికేస్తున్నాం! నీవు కోతి చేష్టలు చేశావంటే గది ఖాళీ చేయమంటే ముందు చచ్చేది నేను" అంది లీలావతి.

"అది కాదు లీలా! ముందుగానే ముక్కిడి, అందులో జలుబు అన్నట్టు ఈ రోజుల్లో అన్ని హంగులున్న ఆడపిల్లకే పెళ్ళిళ్ళవటం కష్టం. బుద్ధిమంతురాలివి, అందగత్తెవు నీ పెళ్లే ఆగిపోయిందా? ఇపుడీ కండక్టరుద్యోగ మొకటి. మనల్నెవరు చేసుకుంటారు చెప్పు! అందుకని ఎవరేనా మంచివాడిని సెలక్టు చేసుకుని కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటే పెద్దవాళ్లకు శ్రమ ఉండదుకదాని!" అంది సరోజ తేలిగ్గా మాట్లాడుతూ.

"చాల్లే! ఊరుకో! కండక్టర్లంటేనే చులకన అన్నట్టు మనల్ని మనమే కించపరుచుకోవడమెందుకు? ఎవరి ఉద్యోగం వారికి గొప్ప. చేసుకునేవాడికి మనమూ, మన ఉద్యోగమూ నచ్చితేనూ, మనకూ అతని ఉద్యోగమూ వగైరాలన్నీ నచ్చితేనేకదా చేసుకుంటాం!"

"సరేలే! నీలాగా ఆచితూచి మాట్లాడి డిగ్నిఫైడ్‌గా ఉండటం నాకు చేతకాదు! అదిగో కావేరిగారు వస్తున్నారు. ఆవిడ ముందు నన్నేం దండించకు!" అంది సరోజ.

★ ★ ★

చీకటిపడి అప్పటికే గంట దాటిపోయింది. అరవింద ముఖాన పట్టిన చెమట తుడుచుకుంటూ గబగబ నడవసాగింది. వీధి మలుపు తిరుగుతుండగా ఎవరో పాప కెవ్వున ఏడ్చిన శబ్దం వినిపించింది. 'అయ్యో తనపాప' ఉదయమనగా ఇల్లు వదిలాను. పాప ఎంతగా ఏడ్చిందో ఏడు నెలలపసికందు.. మధ్యాహ్నం మూడు గంటలకే ఇల్లు చేరాల్సింది. ఆ బస్సు పెట్టిన తిప్పలు తలుచుకుంటేనే భయమేస్తుంది. ఈ ఊరి డిపోనించి, ఆ పల్లెకు మూడు ట్రిప్పులు తిరగాల్సి ఉంది. కానీ రెండో ట్రిప్పుకే మధ్యదారిలో అడవిలో బస్సు నిలిచిపోయింది. ఇంజనులో ఏదో లోపం జరిగిందిట. అదిప్పుడప్పుడే రిపేరు కాదుట. ఎర్రటి ఎండ. బస్సునిండా క్రిక్కిరిసిన జనం. పిల్లల అరుపులు! ఆ రూట్లో వేరే ఏదైనా బస్సువస్తే ఈ జనాలనందరిని ఆ బస్సులో ఎక్కించవచ్చుకానీ ఆ రూటు కున్నది అదొక్కటే బస్సు! ఒకటి రెండు జీపులు అడపాదడపా తిరిగేవి. ఈ రోజు అవి కూడా తిరగలేదు. దాదాపు గంటసేపు ఎదురుచూసి చివరికి ఎవరో స్కూటరు వాలాను పట్టుకుని డ్రయివరు డిపో చేరుకుని మరో బస్సు తీసుకుని వచ్చి జనాలను అందులో తీసుకుని గమ్యం చేరేసరికి సాయంత్రం ఆరయింది. మళ్లీ అక్కడ చెడిపోయిన బస్సును డిపోకు చేర్చవలసిన బాధ్యతకూడా డ్రయివరు, కండక్టర్ల పైనే ఉంది. కానీ ఆ డ్రయివరు తన ముఖం చూసి మీరింటికెళ్లండమ్మా! ఇంటి దగ్గర చిన్న బిడ్డ ఉందన్నారుకదా! ఈ బస్సు సంగతి నేను చూసుకుంటాను. డి.యం.కు నేను చెబుతాను అంటూ పంపగా ఇప్పటికైనా బయటపడింది. ఒక వైపు పాప దిగులు, టైంకు సరిగా ఇల్లు చేరకపోతే భర్త చీవాట్లు! అత్తగారి దెప్పిపొడుపులు గుర్తుకు వచ్చి భయంతో వళ్లు జలదరించింది అరవిందకి. నిజానికి ఆమెకీ ఉద్యోగం చెయ్యటం ఎంతమాత్రం ఇష్టంలేదు. నెలల పసికందును వదిలి. అత్త, భర్తతో తిట్లు, శాపనార్థాలు తింటూ ఈ ఉద్యోగం చెయ్యకపోతేనేం? అందరి స్త్రీల లాగా తనూ ఇంటిపట్టున ఉండి భర్త, పిల్లలను చూసుకుంటే చాలు. హూఁ... అంతమంచి రాత దేముడు తన నుదుట రాయలేదు. అందరి ఆడపిల్లలకు మల్లే తనూ భారీ కట్నంతో మెట్టినింట అడుగుపెట్టింది. ఆ కట్నంతో

తన భర్త ఆడపడుచు పెళ్లిచేశాడు. అయినా తను బాధపడలేదు. ఆ బాధ్యత తమది కాదా? అని సర్దుకుంది. మంచి ప్రయివేటు కంపెనీలో మూడు వేలకు పైగా జీతం వస్తున్న ఉద్యోగాన్ని భర్త నోటి దురుసుతో పోగొట్టుకుని ఇంట్లో కూర్చున్నాడు. చనిపోయిన మామగారిద్వారా అత్తగారికి వచ్చే కొద్దిపాటి పెన్షన్, ఓ చిన్న స్వంత ఇల్లు ఉంది! బాధ్యతలేవీ లేకపోయినా, బతకటం భారమైంది. అప్పుడప్పుడూ బ్యాంకులో దాచిన డబ్బు కాస్తా అరవింద భర్త క్రిష్ణ మూర్తి ఉద్యోగం ఊడటంతో ఉష్‌కాకి అయి పోయింది. ఏ ఇంట్లో అయినా డబ్బుకు ఇబ్బంది లేకుండా గడచిపోతుంటే ఏ చీకాకులు, పోట్లాటలూ జరగవు! ఒకరి తప్పులు ఒప్పులు కనపడవు. ఏ నెల కానెల డబ్బు ఇబ్బందితో ఉన్నది ముగ్గురే అయినా కట కటలాడిపోసాగారు. క్రిష్ణమూర్తి తల్లి కాంతమ్మ కొడుకు సంపాదిస్తున్నంతకాలం, తనకొచ్చే పెన్షను బ్యాంకులో దాచుకుని కూతుళ్లకు చీరలు, సారెలు ఘనంగా పెట్టి పంపిస్తుండేది! ఇపుడా అవకాశం లేకపోగా, పెన్షను మొత్తం సంసారానికి పెట్టవలసి రావటంతో ఆవిడ గొణుగుడుకూడా ఎక్కువవసాగింది. కొడుకు మీదకంటే కోడలిమీద ఆమె సణుగుడు ఎక్కువైంది. ఇంట్లో ఇంత కటకటగా ఉంటే నిమ్మకు నీరెత్తినట్టు ఎలా ఉండగలుగుతారో ఏమిటో! మా చెల్లెలు కోడలుంది పప్పు ఉప్పు దగ్గర్నించి పుట్టింటి నుంచి తెచ్చుకుని సంసారం చక్కగా నెట్టుకొస్తుంది. సంసారం కాబట్టిన వాళ్ల సంగతే వేరు! అంటూ దెప్పేది! అరవింద ఆమె మాటలు సహనంతో కొద్ది రోజులు భరించి చివరికి ఓ రోజు "మీరలా దెప్పి పొడవద్దు! మా నాన్న పెద్ద మొత్తంలో కట్నం ఇచ్చి పెళ్లిచేశాడు. ప్రస్తుతం వాళ్లు బతకటమేకష్టంగా ఉంటోంది. కావలిస్తే నేనే ఏదైనా ఉద్యోగం చేస్తాను, మీరు ఒప్పుకుంటే" అంది.

"అలాగేం! ఎం.ఏ. చదివిన నా కొడుక్కి ఉద్యోగం దొరక్క చస్తుంటే బోడి ఇంటర్మీడియట్ వెలగబెట్టిన నీకు కలెక్టర్ ఉద్యోగం కదూ వస్తుంది. ఇంటింటికీ తిరిగి ఏ సబ్బులమ్మే ఉద్యోగమో దొరికించుకుని పరువు తియ్యకపోతే చాలు" అంటూ సాధించింది కాంతమ్మ.

ఎప్పుడో టెన్తు క్లాసు పాసవగానే నాన్న వద్దంటున్నా వినకుండా ఎంప్లాయిమెంటు ఆఫీసులో తన పేరు, చదువు నమోదు చేసింది. అదిపుడు కష్టకాలంలో పనికి వచ్చింది. కండక్టరు పోస్టు వచ్చింది. ఆఫీసులో ఏదైనా చిన్న ఉద్యోగం వచ్చినా బావుండు. ఆ బస్సుల్లో తనా ఉద్యోగం చెయ్యగలదా అని బాధపడింది. భయపడింది. "కూడు లేక చచ్చేకంటే ఏదో ఒక ఉద్యోగం ఉంటే మేలుకదా!" అంటూ కాంతమ్మ అరవిందని ఉద్యోగానికి తరిమింది. పరిస్థితుల ప్రభావంవల్ల క్రిష్ణమూర్తికిమ్మనలేదు. అరవింద ఉద్యోగంలో చేరే టప్పటికి నెల రోజుల పసికందుకు తల్లి! గత్యంతరం లేని పరిస్థితుల్లో ఉద్యోగంలో చేరింది అరవింద! మొదట్లో భర్త తనకు సహకరించినట్లున్నా, రాను రాను అతని ప్రవర్తన మారిపోయింది. తను ఇంట్లో కూర్చుంటే పెళ్లాం బయటకెళ్లి సంపాదిస్తోందన్న భావం భూతంలామారి, రోజురోజుకూ అతన్ని శాడిస్టులా తయారు చేస్తోంది. రోజూ అరవింద ఇంటికి రాగానే పోట్లాటపెట్టుకుంటాడు. అగ్నికి ఆజ్యం తోడయినట్టు, తల్లి పితూరీలు ఎక్కువ.

అరవింద ఇంటా బయటా నరకం అనుభవించసాగింది. అయినా పసికందును చూసుకుని అన్నీ మరిచిపోసాగింది.

ఇంటికి రాగానే పాపకోసం ఇల్లంతా గాలించింది. "అత్తయ్యా, పాప ఎక్కడ?" అంది ఆదుర్దాగా.

"ఏంతల్లీ, ఇప్పుడు వదిలారా? ఉదయం నించి నడుములు విరిగేలా పనిచేసుకుంటున్నాను. ఇప్పుడే పనిపిల్ల అలా బయటకు తీసికెళ్లింది" అంది కాంతమ్మ విసుక్కుంటూ.

బ్యాగు పక్కన పడేసి బాత్రూంకెళ్లి దబ దబ నాలుగు చెంబులు గుమ్మరించుకుని స్నానంచేసి పనిపిల్ల కోసం బయటకొచ్చింది. అది ఎక్కడా కనిపించకపోయేసరికి ఇల్లిల్లూ గాలించింది. వీధి చివరన ఉండే ఇంట్లో అందరూ టి.వి. చూడటంలో మునిగిపోయారు. పాపను ఓ వారకు పడుకోబెట్టింది. పాప లెట్రిన్‌కు వెళ్లి అందులోనే బోర్లాపడి దొర్లుతూ వళ్లంతా చేసుకుంది. పాపను ఎవ్వరూ గమనించలేదు. పనిపిల్ల కూడా టి.వి. చూటడంలో మునిగిపోయింది. పనిపిల్లను చీవాట్లేసి పాపను తీసుకువచ్చింది అరవింద. పాపకు శుభ్రంగా స్నానంచేయించి ఉదయంనించి పాలివ్వక బరువెక్కిన గుండెల కదుముకుని పాలివ్వ సాగింది.

"ఉదయంనుంచి కొంపలో లేవుకదా! సంసారం చూద్దామని లేదుకదా! అక్కడికేదో పిల్లను నేను దిబ్బలో పడేసినట్టు, రాగానే స్నానం చేసి షోకులు చేసుకుని, పిల్లకు పాలిస్తూ కూచున్నావు. ఇంట్లో పనంతా ఎక్కడిదక్కడ అలాగే ఉండిపోయింది" అంటూ నోరు పెద్దగా చేసి అరవసాగింది కాంతమ్మ.

"అదేమిటత్తయ్యా, పనంతా చేయటానికి మనం పనిపిల్లను డబ్బిచ్చి పెట్టుకున్నదెందుకు? దానికి పనిచెప్పటం మానేసి, పిల్లను దానికిస్తే అది పక్కిళ్లల్లో టి.వి. చూస్తూ పిల్లనెంత అధ్వాన్నంగా పడేసిందో చూశారుగా! అదేం కాకుండా పాపను మీరు చూసుకుంటే అన్నీ సరిపోతాయిగా" అంది అంతవరకున్న నిగ్రహం సడలిపోగా అరవింద.

"ఏమిటే మా అమ్మ మాటలకు బదులిస్తున్నావు? పొగరా? ఇంటికి రాగానే స్నానం చెయ్యాలా? నువ్వు ఉద్యోగం చెయ్యటానికి వెళ్లావా? ఎవడితోనైనా..." అంటూ క్రిష్ణమూర్తి భార్యను నోటికొచ్చినట్లు మాట్లాడాడు. ఆరు నెలలుగా అతని మాటలకు అలవాటు పడ్డ అరవింద గుడ్ల నీరు కుక్కుకుంటూ, "అదేమిటండీ! ఆ బస్సులో జనం మధ్య... దుమ్ములో... చెమటతో... స్నానం చెయ్యకుండా పసిబిడ్డకు పాలిస్తే రోగాలు రావా? ఉదయంనించి పాలివ్వకపోతే నా పరిస్థితి ఎలా ఉంటుందో అత్తయ్యకు తెలీదా? " అంది.

"ఉదయంనుంచి రాత్రిదాకా డ్యూటీ ఉందా? లేక నీవు సపరేట్ డ్యూటీ వేయించుకుని 'కులికి' వస్తున్నావా? "

"మధ్య దారిలో బస్సు చెడిపోయి... ఆ తిప్పలు మీరు పడితే తెలిసేది. నోటికొచ్చినట్టు మాట్లాడితే సరిపోయిందా? " రోషంగా అంది అరవింద.

"ఒరేయ్, దానినోటికెందుకురా పోతావు. అది సంపాదించి నిన్నూ నన్నూ బతికిస్తోంది. ఓ మూలపడి తిని కూర్చోక మగాడిలా మాటలెందుకు? మనఖర్మలిలా కాలాయి" ముక్కుచీదింది కాంతమ్మ.

"నేనీ ఉద్యోగం చెయ్యలేను మొర్రో అంటే తరిమారు! ఓ పూట ఆలస్యమైతే పోట్లాటలు! ఎందుకొచ్చిన గొడవ ఇదంతా! ఏదైనా చిన్న ఉద్యోగం చూసుకోండి! పాప ఆరోగ్యం చెడిపోతుంది. అత్తగారు చూసుకోలేదు" అంది ఆ రాత్రి భర్తతో అనునయంగా.

"ఆడదాని సంపాదన తింటున్నాననేగా ఇంత అలుసు. ఉద్యోగం మానేస్తానని బెదిరిస్తున్నావు. నేనూ నీకు చెప్పాలనుకుంటున్నాను. ఉద్యోగం మానేసి కొన్నాళ్లు మీ పుట్టింటికెళ్లిపో. నాకుద్యోగం దొరికాక వద్దు



వుగాని” అన్నాడు.

“అక్కడ వాళ్ల పరిస్థితులు బాగాలేవు. నేనూ వాళ్ళ మీద పడితే ఏంబాగుంటుంది. అదీగాక పెళ్లికావాల్సిన చెల్లి ఉంది. మీకుద్యోగం ఎప్పటికి దొరుకుతుందని? అంతదాకా నేనక్కడ ఉంటే, దాన్ని చూడాలని పెళ్లిచూపులకొచ్చిన వారు భర్తను వదిలేసి ఇంట్లో ఉందని అపార్థం చేసుకుంటే... దాని పెళ్లవుతుందా? అస్తమానం ఫ్రెండ్సు అంటూ వెంటేసుకుని తిరక్కపోతే ఎక్కడైనా ప్రయత్నిస్తే పద్దులు రాసే ఉద్యోగమైనా దొరక్కపోదా? ” అంది అరవింద.

“నీబోడి సలహాలు ప్రక్కకు పెట్టు. నాకు నిద్రవస్తోంది” అంటూ చీదరించుకున్నాడు క్రిష్ణమూర్తి.

అలాగే చీకట్లో కళ్లు తెరుచుకుని పడుకుంది అరవింద. ఎన్నాళ్లిలా? భర్తకు ఏదైనా చిన్న ఉద్యోగం దొరికినా దాని వ్యాపకంలో పడితే, ఈ సాధింపులుండవు. సరోజ కలగలుపు మనిషి. ఆమె పక్కింటావిడ తమ్ముడిని ఏదో ఫ్యాక్టరీలో చేర్పించాననగా వింది. రేపు డ్యూటీకెళ్లినపుడు కలిసి భర్తకేదైనా ఉద్యోగం చూసిపెట్టమనాలి. మనసు శరీరం అలసిపోగా కళ్లు మూసుకుని నిద్రకుపక్రమించింది అరవింద.



“టిక్కెట్, టిక్కెట్! ఏంటయ్యా బస్సెక్కి

రెండు నిమిషాలు కాలేదు. అప్పుడే నిద్రా? టికెట్ తీసుకో. ఎక్కడికెళ్లాలి? చిల్లర ఇచ్చి కండక్టరుకు సహకరించండి మొర్రో అని బస్సెక్కేముందే డోరుకు రాశారు. ఒక్కరంటే ఒక్కరు చదివి చావరు. సరేలే ఈ బస్సు నిండా ఓనమాలు రానివాళ్లే! ఎలా చదువుతారు? అక్షరజ్యోతి అదీ ఇదీ అని చదువు గురించి, వయోజన విద్య గురించి వార్తలొస్తుంటాయి. ఎంతమంది చదువుతున్నారో... ఎందరుద్ధరింప బడుతున్నారో... ఎక్కడున్నారో తెలియదుకానీ... ప్రపంచంలోని నిరక్షరాస్యులంతా, ఈ ఎర్రబస్సుల్లో... తమకోసమేనన్నట్టు... కాల్చుకు తింటున్నారు మనసులో అనుకుంది సరోజ.

“ఏమ్మా! ఈ పాపకు టికెట్ తీసుకో” అంటూ టికెట్ పంచ్ చేయబోయింది సరోజ.

“అయ్యో! మాయమ్మా బాగుండావే ఆ పిల్లకెన్నేళ్లనుకున్నవు! నిండా మూడేండ్లు లేవు. అప్పుడే టికెట్టా? ” దీర్ఘాలు తీసిందా తల్లి.

మిగతా విషయాలేమోగానీ ఇట్లాంటి విషయాల్లో మాత్రం అర్జంటుగా తెలివితేటలు ప్రదర్శించే నేర్పు ఆడవాళ్లకి మాత్రమే ఉంటుంది అనుకుంటూ “ఏమిటీ! ఈ పాప నా ఎత్తు ఉంది మూడేళ్లా తియ్యి టికెట్ డబ్బులు, లేకుంటే బస్సు దిగు” కసిరింది సరోజ.

“అయ్యో! బలే సతాయిస్తావుగద తల్లీ! ఇంతకుముందొస్తున్న కండక్టరు పిల్లోల్లకి టికెట్టే కొట్టకుండె. మంచితల్లినేసినారు ఈ బస్సుకు. మొన్న సుంకులమ్మ జాతరప్పుడు పుట్టిన పిల్లకి టికెట్టంటా బాగుంది కత?” అరగంట గొణిగి టికెట్ తీసుకుందామె.

“ఆడోల్లకు పెత్తనమిత్తే ఇంతే మరి! ఇండ్లకాడ కుండబోకులు తోముకుండేటోళ్లని బస్సెక్కిచ్చినారో లేదో మిడిసి పడుతుండారు. ఆ కోటేసుకుని ఏం వగలు పడు




తుందో చూడు" ఆమెకు ఇంకోకామె తోడయి అందరికీ వినిపించే గుసగుస మాటలు మాట్లాడింది. వళ్లు మండిపో యింది సరోజకు. ఏమీ అనలేక పళ్ల బిగు వున కోపాన్ని అణచుకుని "ఈ మూట ఎవ రిది" అందా స్త్రీని.

"అయ్యో తల్లీ నాదేనమ్మ" ఇందాక వత్తాసు పలికిన స్త్రీ నాదేనని తెలిపింది. ఆమెదని తెలిసే అడిగింది సరోజ.

"లగేజి టికెట్టు కొడుతున్నా డబ్బులు తియ్యి"

"ఓయమ్మ ఓయమ్మ, పదిసేర్ల గింజల సంచీకి టికెట్టా?"

"ఇవి పదిసేర్లా యాభైసేర్లున్నాయి. ముందు డబ్బులు తియ్యి! అయినా ఇంత బరువు మూటలు ఇంటికాడుండే మొగోల్లక ప్పచెప్పక నీవెందుకింత తిప్పలు పడతావు. కుండబోకులు తోముకుంటూ పిల్లోళ్లను చూసుకుంటూ ఉండకుండ నీకీ బాధెందుకు చెప్పు" ఆమెమాట ఆమెకే అప్పచెప్పుతు న్నట్టు అనేసింది సరోజ.

బస్సులో కొంతమంది కిసుక్కున నవ్వే సేరు.

ఆడవాళ్లను ఆడవాళ్లే అర్థంచేసుకోరు. సహకరించరు. ఇక మగవాళ్లనని లాభమే ముంది. మనసులో అనుకుంటూ తన సీట్లో కొచ్చి కూర్చుని ట్రేముందు పెట్టుకుని షీటు రాసుకో సాగింది సరోజ. ఈ ఉద్యోగం చెయ్యవలసి వచ్చిన తన పరిస్థితులను గుర్తుకు చేసుకోసాగింది.

సరోజ పుట్టగానే సరోజ తల్లి చనిపో యింది. తండ్రి కనకయ్య నెల తిరగక ముందే మళ్లీ పెళ్లిచేసుకున్నాడు. ఆమె చాలా గయ్యాళి. సరోజకంటే పెద్దదయిన ఆదిలక్ష్మిని, సరోజను సరోజ నాన్నమ్మ పెంచింది. అయిదారేళ్ల వయసు రాగానే వీళ్లను పోషించటం భారమౌతోందంటూ, ఆదిలక్ష్మిని, సరోజను అనాధాశ్రమంలో పడేశాడు. ముసలి తల్లిని ఇంటినించి తరి మేశాడు. అడ్రసు వెతుక్కుంటూ మళ్ళీ తనను చేరతారని భార్యతో ఊరువదిలి వెళ్ళిపోయాడు. సరోజ, ఆదిలక్ష్మిల బాల్య మంతా అనాధాశ్రమంలోనే గడచింది. ముసలమ్మ అప్పుడప్పుడూ వచ్చి చూసివె ళ్లేది. స్కూలు ఫైనల్ దాకా చదువుకున్నారు. అదృష్టంకొద్దీ, పర్సనాలిటీ, చదువు బాగుండటంతో ఆదిలక్ష్మికి కానిస్టే బుల్ ఉద్యోగం, సరోజకు కండక్టరుద్యోగం ఒకే సంవత్సరంలో రావటంతో అనాధా శ్రమం వదిలి వచ్చేశారు. ముసలమ్మను తోడుంచుకున్నారు. మొదట్లో ఒంటరిగా బ్రతకటం భయమనిపించింది సరోజకు. మాకో తమ్ముడున్నాడు. అన్నయ్య ఉన్నాడు, మానాన్న మిలిటరీ మనిషి అంటూ ఆత్మ సంరక్షణార్థం ఇంటిగలవాళ్లతోనూ, ఇరుగు పొరుగువారితోనూ చెబుతుండేది. కానీ ఆదిలక్ష్మి మనస్తత్వం వేరు. చాలా కఠి నంగా కనిపించేది. ఎక్కువగా మాట్లాడదు. అన్నీ సిస్టమాటిక్‌గా జరగాలని చెప్పేది. మగాళ్లనసలు నమ్మకూడదని చెల్లెలుకు హితభోదచేసేది. సరోజకు కండక్టరు ఉద్యోగం వచ్చాక లీల, అరవింద స్నేహితు లయ్యారు. సరోజ చాలా కలుపుగోలు మనిషి. అంతేకాక, ముక్కుమీద కోపం కూడాను. సహనం తక్కువ.

"నువ్వసలు ఆ కండక్టరుద్యోగానికి సరిప డవు. మానేసి ఇంకోటి వెతుక్కో" అంటూ అరిచేది ఆదిలక్ష్మి.

"అక్కవు, ఏదైనా హితబోధ చెయ్యటం మాని ఉద్యోగం మానెయ్యమంటావా? కళ్ళుమోతువి" అంటూ పోట్లాడేది ఆమెతో. ప్రక్కనుంచి ఏదో శబ్దం రావ టంతో ఆలోచనలకు బ్రేక్ పడింది.

సరోజ ప్రక్కన సీట్లో ఓ ముసలావిడ కూర్చుంది. పొగాకు పసపస నములు

తోంది. వాసన కొడుతోంది. కడుపులో తిప్పినట్లయింది సరోజకు. లేచివెళ్లటానికీ, ఆమెను లేపటానికీ వీల్లేని పరిస్థితి! ఆమె అంతదాకా మౌనంగా ఉంటేనే భరించలేక చస్తుంటే, సరోజను మాటల్లోకి దింపసాగింది.

"అమ్మయ్యా! పిల్లలెంతమంది నీకు"? అనడిగింది. వళ్లు మండింది సరోజకు. "నాకసలు పెళ్లేకాలేదు" అంది విసురుగా.

"వాయమ్మ ఇంగా పెండ్లికాలేదా! అయ్యుంటే ఇయ్యాలకు ఆరుమందిని కనిందువుగదా! ఏముద్యోగం తల్లీ! లచ్చనంగ పెండ్లి జేసుకోకుండ" బుగ్గన వేలేసుకుని ప్రపంచ వింత గురించి మాట్లాడుతున్నట్టు ఆశ్చర్యంగా మొహం పెట్టింది ముసలావిడ.

వళ్లు మండిపోయింది సరోజకు. "నా ఎత్తుకు సరిపోయిన మగాడు ఈ ఊళ్లో దొరకలేదు. నువ్వు వెతికి పెడతావా" కోపంగా అనేసి "నువ్వు మీ ఊరు చేరేలోపల ఎంతమందికి పెళ్లిళ్లయ్యాయో, ఎంత మందికి కాలేదో జాబితా తయారు చేసే ఉద్యోగం ఇచ్చారా నీకు నోరు మూసుకుని కూర్చో" కసిరింది సరోజ.

"వాయబ్బ! అంత కోపం చేస్కుంటావెందుకు తల్లా" మూతి మూడువంకర్లు తిప్పి కిటికీ వైపు మొహం తిప్పి కూర్చుంది.

"ఏమిటమ్మా, ప్యాసింజర్లతో గొడవ పడుతున్నట్టున్నావు" అడిగాడు డ్రయివరు రామయ్య సరోజతో. పల్లెలో ఓ గుడిసె హోటల్లో కూర్చుని టిఫిన్ తింటున్నారిద్దరూ. "ప్యాసింజర్లతో అంత దురుసుగా మాట్లాడటం కూడదమ్మా"

"నా బాధ ఏం చెబుతావులే అన్నా! ఈ ప్యాసింజర్లు కాల్చుకు తింటున్నారు. నీ పనే హాయి. ఏ బాధా లేకుండా డ్రయివింగు సీట్లో కూర్చుంటావు. అవునన్నా ఇంకా ఎన్నాళ్లు ఈ పల్లెటూరి బస్సుల్లో మమ్మల్ని మగ్గపెడతారు. లాంగ్ జర్నీ లగ్జరీ బస్సుల్లో అయితే బాగుండు! హాయిగా ఒక్కసారి టికెట్లిచ్చేసి సీట్లో కూర్చుని నిద్రపోవచ్చు" అంది సరోజ.

"కనీసం అయిదేళ్ళ సర్వీసు పూర్తికానిదె వెయ్యరమ్మా! మామూలే ఈ గొడవలు! నువ్వింకా పుణ్యం చేసినావు! మా దూరపు బంధువునొకమ్మాయిని నక్సలైట్ల ఏరియాకేశారు! ఊరువచ్చాక నాలుగు చోట్ల బస్సు ఆపి తీరాలి! ఒక్క కిలోమీటరు దూరానికి నాలుగుచోట్ల ఆపి జనాలను దింపాలి! ఇదేమిటంటే ఒక స్టాపు ఊర్లో వారికోసం, ఒక స్టాపు నక్సలైట్లకోసం ఒకస్టాపు సర్పంచుకోసం, ఒకస్టాపు రౌడీలకోసం! అలా రూల్సు లేవు అందరికీ ఒకే బస్‌స్టాపు అక్కడే ఆపుతాము అని ఓ కండక్టరు పేచీ పడ్డాడు! అంతే! అతన్ని చితకబాదారు! అంతే! మళ్ళీ ఆర్టీసివారు ధర్నాలు, నిరాహారదీక్షలు బస్సులు రద్దు! ఓ వారం రోజులకు మనకు మనమే రాజీ! యథాప్రకారం ప్రయాణం! ఇపుడా అమ్మాయి అవస్త చెప్పలేం! మామూలు మాటలు మాట్లాడినా, లేపేస్తాం! చంపేస్తాం! అంటూ ద్వంద్వార్థాల మాటలతో కుళ్లబొడుస్తారుట! రూటు మార్చండని డి.యం. దగ్గర ఏడ్చి మొరపెట్టుకుంది! అలాగంటే ఎలాగ నీ డ్యూటీ నీవు చేసుకుపో! ఏ రూట్లోనైనా ఇబ్బందులు తప్పవు అన్నాడట!" అంటూ ముగించాడు రామయ్య!

"ఏందయ్యా డ్రయివరూ! ఎంతసేపు తింటావు బస్సు నిండిపోయి చెమటకు సస్తుంటే!"

"కండక్టరమ్మ దొరికింది కబుర్లేసుకున్నాడు!"

"రైట్! రైట్!" అరుస్తున్న ప్యాసింజర్ల మొరటు అరుపులు వినిపించనట్టుగా రామయ్య, సరోజ కర్చీఫుతో చేతులు తుడుచుకుంటూ బయటకొచ్చారు!

రామయ్య వెళ్ళి డ్రయివింగ్ సీట్లో కూర్చున్నాడు! ఇంకో పది నిమిషాలకు ప్రసవించే నిండు గర్భిణిలా ఉన్న ఎర్ర బస్సును ఉస్సురంటూ చూసి బస్సెక్కి డోరు గట్టిగావేసి రైట్ రైట్ అంది సరోజ!



"ఏమండీ లీలావతిగారూ! మీకిదేమైనా న్యాయంగా ఉందా చెప్పండి! మరీ ఇంత దారుణంగా ఉత్తరాలు రాసే కలం స్నేహితురాలు దొరుకుతుందనుకోలేదు సుమండీ! మీనించి ఉత్తరం రాగానే ఎంతో ఉత్సాహంగా చదవబోతాను. అయిదు వందల సంవత్సరాలక్రితం మానవులు రాసుకున్న ఉత్తరంలా ఉంటుంది! "మహారాజరాజశ్రీ సారథిగారికి ఇక్కడ నేను క్షేమం. అక్కడ మీరు క్షేమంగా ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఇంతే సంగతులు. మీకు నా వందనములు ఇట్లు లీలావతి. "ఎందుకండీ పోస్టల్ డిపార్టుమెంటును బతికించి, నన్ను చంపుతున్నారు! ఈ మాత్రందానికి కలం స్నేహం పేరుతో ఉత్తరాలు రాసుకోడమెందుకు నాక్షేమంకోరుతూ దేముడికో దండం పెడితే పోతుంది గదా! అయినా మీరు రోజూ బస్సు ప్రయాణంచేసే కండక్టరు ఉద్యోగం చేస్తున్నారు కదా! రాయటానికి ఎన్ని విశేషాలుండవు! లేదూ! టికెట్లివ్వటం కూర్చోవటం, బస్సు గమ్యం చేరటం ఇందులో విశేషాలేం వున్నాయి అంటారా? మీ చుట్టూ ఉన్న వాళ్ళు మీ ఇంట్లో వాళ్ళు, మీ చిన్నతనం ఏదో ఒకటి రాసి పేజీ నింపండి! దగ్గరుండి మాట్లాడుకున్నట్టు రాయండి! మరీ సుత్తి కొడుతున్నానా? సారీ! ఇకపోతే నా గురించి. ఈ ఆరునెలల నించి నాకు మా వాళ్ళు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారండోయ్! మా నాన్న నా పెళ్ళయ్యేదాకా గెడ్డం గీసుకోనని మొక్కుకున్నాడట. (ఏదేముడికో తెలీదు... అడిగినా చెప్పడు) "తలనీలాలు కూడా గెడ్డంతో సమానంగా పెంచి దేముడికి సమర్పించాలి కాబోలు నాన్నా" అన్నాను సందేహంగా. నువ్వు నోరుముయ్యి నా మొక్కు ఇలాగే ఉంటుంది అంటూ తల మాత్రం నీటుగా కటింగ్ చేసి క్రాపు దువ్వుతున్నాడు. గెడ్డం మాత్రం పెంచుతున్నాడు. "మొక్కా? పాడా? ఈమధ్య 'ఫాషన్' అని చాలా మంది గెడ్డం పెంచుతున్నారులేరా మీనాన్న వగలుపడుతున్నాడు. అని అమ్మ అంటుంది కోపంగా. అన్నట్టు మీకో ప్రపంచ వింత వార్త తెలుసా? నాకు బుద్ధి వచ్చినప్పటినించి అంటే దాదాపు అయిదారేళ్ళ వయసునించి అమ్మా నాన్న మాట్లాడుకోగా చూడలేదు! ఇద్దరూ ఎడమొగం పెడమొగం. అలాగని ఇంట్లో చెంబులు, గిన్నెలు విసిరేసుకోడాలు, అరవటాలు లాంటివి లేవండోయ్!

అంతా నిశ్శబ్ద యుద్ధమన్నమాట! ఇంట్లోకి కావల్సినవన్నీ నాన్నగారే తెస్తారు! అమ్మ వండి పెడుతుంది! ఏదైనా కావలిస్తే నాతో చెప్పిస్తారు! మా అక్క ఉండేది! ఆవిడకు పెళ్ళయిపోయింది! మా అమ్మా నాన్నల మౌనపోరాటం గురించి మొత్తం ఆంధ్రరాష్ట్రంలో ఉన్న మా బంధువులకందరికీ తెలుసుట! కాకపోతే ఆ మౌనానికి కారణాలు మాత్రం ఎవరికి తోచినవిధంగా వారు వ్యాఖ్యానిస్తుంటారు! మా అక్క భర్త దగ్గరివాడే! మా మేనమామ కొడుకే కాబట్టి ఆయనా బాగా అడ్జస్టయిపోయాడు! మా అమ్మానాన్నలు పక్కపక్కన కూర్చుని తాంబూలం వేసుకుంటూ మాట్లాడుకుంటుంటే చూడాలని నా అంతిమ కోరిక! అదొక విషాదం! బహుశ అది తీరని కోరికవుతుందేమో! నేను త్వరగా పెళ్ళిచేసుకుంటే, నాకు పిల్లలు పుడితే... ఆ పిల్లల ద్వారా... వారిద్దరూ మాట్లాడుకొంటారని నా ఆశ... పెళ్ళి చేసుకోవటానికి అర్హతలున్న వాడిని, ముప్పయి ఏళ్ళ వయసు, ఒడ్డూ







పొడుగూ, వికారంకాని అందం, గవర్న మెంటు ఆఫీసులో క్లర్కు ఉద్యోగం... ఇవన్నీ ఉన్నాయి! పోతే... కట్నం తీసికో కూడదని నేను అనుకుంటున్నాను! నాన్న గారేమో కట్నం అసలువద్దంటే నీలో లోపం ఉందనుకుంటారు! నలుగురితోపాటు నారా యణా అని అంతో ఇంతో పుచ్చుకుని అమ్మాయి పేరనే డిపాజిట్ చేద్దాం అంటు న్నాడు. సరేనన్నాను! ఇప్పటికి దాదాపు ఓ ఆరుమంది అమ్మాయిలను పెళ్ళిచూపుల పేరుతో చూసి వచ్చాను. అందరు అమ్మా యిలూ నచ్చారు! వాళ్ళకూ నేను నచ్చాను! కానీ పెళ్ళికాలేదు! మీరు ఊహించినట్టు కట్నం పేచీ కాదు! నా పెళ్ళికి మా నాన్నే విలన్. మీ మెదడుకు మేత. మానాన్న నా పెళ్ళికెందుకు అవరోధమవుతున్నాడో కను క్కోండి! సూపర్‌బంపర్ బొనాంజాలాంటి ప్రయిజులేవీ ఇచ్చుకోలేను! కనుక్కుంటే పర్వాలేదు! అందరి అమ్మాయిల్లా మీరూ





తెలివైనవారే నన్న చిన్నసర్టిఫికెట్ ఇస్తాను! అన్నట్టు చివరిన ఇంకో విషయం! మీ ఊళ్ళో కూడా అమ్మాయిలుంటే చూడండి పెళ్ళి చూపుల కొచ్చేస్తాను! ఉంటామరి! మీ అందమైన ఉత్తరంకోసం ఎదురుచూస్తూ మీ పెన్ ఫ్రెండ్ సారథి."

సారథి రాసిన ఉత్తరం చూసి మనసారా నవ్వుకుంది! తను రాసిన ఉత్తరాన్ని గేలిచే సిన విధాన్ని చూసి చిన్నబుచ్చుకుంది! ఏం తను రాయలేదా? ఏం రాయాలి? ఉత్త రాలు రాయటం కూడా ఒక కళ! ఎప్పుడో ఎక్కడో చదివిన వాక్యం గుర్తొచ్చింది! ఆ రోజు రాత్రే సారథికి ఉత్తరం రాయటం మొదలుపెట్టింది! ఎప్పట్నించో తన చిన్నత నపు సంఘటనలు కొన్నింటిని డైరీలాగా రాసి ఉంచుకోవాలనుకుంటుండేది! అంత అందమైన బాల్యమా? రాసిపెట్టుకోకపో యినా, ఏ పసివారిని చూసినా ఠక్కున గుర్తుకు వచ్చే బాల్యాన్ని మళ్ళీ రాసి భద్ర పరచటమెందుకు? అనుకునేది. సారథికిలా తన బాల్యాన్ని గురించి రాయటంవల్ల ఏదీ



ఎబ్బెట్టుగా కానీ, అతిగా కానీ అనిపించటం లేదు! సారథి ఎంతో ఆత్మీయుడిలా అనిపిస్తున్నాడు! అతనితో స్నేహం అదీ కలం స్నేహం ఏ పరిణామాలకు దారితీస్తుందోనన్న భయం తనకు కలగటంలేదు! పైగా చిన్నప్పటినించి చెప్పుకోవటానికి వీల్లేని కొన్ని సంఘటనలు... ఎవరితోనైనా మనసు విప్పి చెబితే మనసుకు కాస్త ఊరట కలుగుతుందనే ఆశ... అతనికి ఉత్తరాల ద్వారా మనసు విప్పిచెప్పి ఉపశమనం పొందాలనిపించింది లీలకు!

"సారథిగారికి,

మీ ఉత్తరంలో మీ బాల్యాన్ని గురించైనా రాయవచ్చు కదా అన్న మీ సూచనమేరకు నా చిన్నప్పటి కొన్ని (అందమైనవి కావు) సంఘటనలు రాస్తున్నాను. ఇవి చదివి మీరేదో నామీద జాలిపడాలనో, ఓదార్పు ఉత్తరం కోసమో మాత్రం కాదు! పోనీ చదివి గుర్తుంచుకుండే కావ్యమూ కాదు! నేను ముందే చెప్పాను నాకు ఉత్తరాలు రాయటం రాదని!

సారథిగారూ! మా అమ్మ చాలా మంచిదండీ! ప్రపంచంలో అమ్మలు మాత్రం మంచి వారుగానే ఉంటారేమో! నా తొమ్మిదేళ్ళ వయసులో నా ఇద్దరు చెల్లెళ్లు, నాన్నమ్మ, అమ్మ, నాన్నలతో ఎంతో ముద్దుగా, మురిపెంగా పెరిగాను! నాన్న కానిస్టేబులు ఉద్యోగం చేసేవాడు. మా ఇంటికి దగ్గర్లోనే మా నాన్నగారు పనిచేసే పోలీస్‌స్టేషన్ ఉండేది! నాన్న ఉదయం పూట డ్యూటీవల్ల టిఫిన్ తినటానికి ఇంటికి రాలేకపోతే అమ్మ జొన్నరొట్టె, వంకాయ కూర టిఫిను బాక్సులో పెట్టిచ్చేది! ఆయన టిఫిన్ తింటుంటే, నేను స్టేషను వెనకాల వెళ్ళినుంచుని వచ్చివెళ్ళే రైలు పెట్టెలను లెక్కపెట్టేదాన్ని. స్టేషనులో ఉన్న పెద్ద కుంకుడు చెట్టుకింద రాలిపడ్డ కుంకుడుకాయలు ఏరి తెచ్చేదాన్ని! నాన్న నాకు ఎన్నో జాగ్రత్తలు చెప్పి రోడ్డుదాటించేవాడు! ఆ వయసులో పోలీసు స్టేషను కెళ్ళటం, అక్కడున్న దొంగలను చూడటం, కుంకుళ్ళు

ఏరటం, రైలును చూడటం నామటుకు నాకు చాలా గొప్ప విషయాలు! నాకంటే ఒకటిన్నర సంవత్సరం చిన్నదైన నా తర్వాతి చెల్లెలు సీతను, మూడేళ్ళు చిన్నదైన రాణిని ఊరించి, ఊరించి... ఆ కబుర్లు చెప్పేదాన్ని! రాత్రుళ్లు వెన్నెల్లో నులకమంచంమీద నానమ్మ పక్కలో పడుకుని రాక్షసుల కథలు మరీమరీ చెప్పించుకునేదాన్ని! ఉన్నట్టుండి మా ఇంట్లో ఓ కొత్త వింత జరిగింది! అమ్మ కడుపు రోజురోజుకీ లావెక్కసాగింది! ఇరుగుపొరుగు వారు ఏమిటో అర్థంకాని మాటలు మాట్లాడుకోసాగారు! ఓరోజు అమ్మ "లీలా నీకు తమ్ముడు కావాలా? చెల్లికావాలా? "అనడిగింది! నేను వెంటనే "ఎక్కడున్నారు? " అనడిగాను! "ఇదిగో నా బొజ్జలో చెప్పు నీకెవరు కావాలి" అంది! "తమ్ముడేం వద్దు! చెల్లి కావాలి ఎంచక్కా నలుగురం కొత్త గౌన్లు వేసుకుని రైలాట ఆడుకోవచ్చు" అన్నాను! ఛీ! జెష్ట ముండా! అంటూ వీపున దబదబ బాదింది! నాలుక నిండా మచ్చలున్నాయి ఈ పిల్ల ఏదంటే అది జరుగుతుంది! మళ్ళీ ఆడపిల్ల పుడుతుందేమో అంటూ అమ్మ ఏడవసాగింది! నానమ్మ అమ్మ నన్ను కొట్టినందుకు తిట్టిపోసింది! "సరేలే పసిదాన్ని కొడితే ఏం లాభం! మీ పుట్టింటి సాలు పడి వరుసగా ఆడ మేళాన్ని కంటున్నావు! అత్తగారింటి సాలు పడిఉంటే ఈ సరికి ఇంటి నిండా మగపిల్లలయ్యుందురు? " అంటూ ఆమె ఆరోజంతా గొణిగింది! ఏది ఏమైతేనేం ఓ శుభముహూర్తాన అమ్మకు బాబు పుట్టాడు! మా యింట్లో అందరూ సంతోషంతో కళకళలాడిపోయారు! తమ్ముడు పుట్టగానే అమ్మ మమ్మల్ని పట్టించుకోవటం మానేసింది! అంతదాకా దగ్గరుండి స్నానం చేయించే అమ్మ గోరుముద్దలు తినిపించే అమ్మ... ముఖమంతా ముద్దులు కురిపించే అమ్మ హఠాత్తుగా మారిపోయింది గాడిదల్లాగా ఉన్నారు స్నానం చేయలేరూ! జడలేసుకోలేరూ! అన్నం స్వంతంగా కలుపుకోలేరూ! రాక్షసమేళం! అంటూ విసుక్కునేది! ఆమె సర్వస్వం తమ్ముడే! వాడిని కిందవేసేది కాదు! ఎంతో అపురూపం అయిపోయాడు!

వాడికి రోజూ రెండు రూపాయలిచ్చి వెన్న కొనేవారు! జొన్నరొట్టెమీద వెన్నరాసి వాడికి పెట్టేవారు! అమ్మా! వెన్న మాకు పెట్టవే! నాకెంతో ఇష్టం అంటూ మేం ముగ్గురం దీనంగా అడిగినా అమ్మ వెన్న తింటారేం? ఎవర్ని ఉద్ధరించాలి! ఇప్పటికే పందుల్లాగా ఊరిపోయారు. వెన్నతిని ఇంకా కొవ్వుపట్టాలే? నోరు మూసుకుపడుండండి అంటూ తిట్టేది! వాడికి సిల్కు గుడ్డలు! మాకు ముతకగుడ్డలు! వాడికి వరి అన్నం, మాకు జొన్న సంగటి. వాడికి పాలు మాకు కాఫీ! వాడొక రాజకుమారుడు లాగా మేము దాసీల్లాగా పెరిగాం! అంత చిన్న వయసులో తల్లి... స్వంత తల్లి... సవతి ప్రేమ చూపటం నా చిన్ని మనసు తట్టుకోలేకపోయేది! ఆడపిల్లగా పుట్టడమే నేరమైనట్టు అమ్మ మాట్లాడేది! ఓసారి ఊళ్లోకి పిల్లలనెత్తుకు వెళ్ళేవాళ్ళు వచ్చారనీ, ఊళ్లో నలుగురైదుగురు పిల్లల్ని ఎత్తుకెళ్ళారనీ పుకారొచ్చింది! వేసవి కాలం! అందరూ ఆరుబయట మంచాలేసుకుని పడుకునేవారం! అమ్మ ఓ తాడుతో తమ్ముడు మొలతాడుకీ తన కొంగుకీ కట్టుకుని పడుకుంది! అమ్మా! మాకు కూడా అలాగే కట్టవే! దొంగ లెత్తుకెళతారేమో! అన్నాను. ఎత్తుకెళితే ముగ్గురికీ కలిపి ఓ లక్ష రూపాయలు మిగులుతుంది! అయినా ఆడ ముండల్ని ఏ దొంగా ఎత్తుకెళ్లడులే నోరుమూసుకుని పడుకో! అంటూ కసిరింది! ఆ రాత్రంతా నాకు నిద్రరాలేదు! అమ్మ అనిన మాటలకు కాదు దొంగలెత్తుకెళతారేమోనన్న భయంతో!

నేను తొమ్మిదవ తరగతి చదువుతుండగా నానమ్మ చనిపోయింది! ప్రతిదానికీ అమ్మతో

పోట్లాడి మమ్మల్ని వెనకేసుకొచ్చే నానమ్మ చనిపోవటంతో చాలా ఒంటరితనం అనుభవించాను! విచిత్రంగా అప్పటినించి నాన్న మాకు బాగా దగ్గరయ్యాడు! నా పెద్దకూతురిని డాక్టరు చదివిస్తాను, చిన్న కూతురిని లాయరు చేస్తాను! మధ్య కూతురిని పోలీ సాఫీసరు చేస్తాను అంటూ మురిసిపోయేవాడు!

కానీ అమ్మ, నాన్న మాట ఒక్కటీ పడనివ్వలేదు! స్కూలు ఫైనలుతో నా చదువు ఆపివేసింది! రెండో చెల్లెలు, మూడో చెల్లెలును 8, 9 తరగతుల్లోనే ఆపివేసింది! నాకు పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టారు! పది రోజులకోసారి పెళ్ళి చూపులు జరిగేవి! అందరికీ నేను నచ్చాను కానీ నాన్న ఇచ్చే కట్నం నచ్చక తిరుగుముఖం పట్టేవి! నా స్నేహితుల ప్రోత్సాహంతో ఎంప్లాయిమెంటులో నా చదువు రిజిస్టర్ చేశాను! నాన్నను ఒప్పించి ప్రయివేటుగా డిగ్రీ కట్టాను! పూర్తిచేశాను! నాకు ఇరవై అయిదేళ్ళు వచ్చాయి! అతికష్టంమీద నాకు పెళ్ళి కుదిరింది!

సారథిగారూ! ఇంతటితో ఉత్తరం ఆపేస్తాను! అన్నట్టు మీ పెళ్ళికి మా నాన్నగారే అవరోధం అంటూ రాశారు! మెదడుకు మేత అంటూ రాశారు! అదేదో పూర్తికాని పజిల్ అయినట్టు బాధ పడటమెందుకు? మీ నాన్నగారికి అమ్మాయి తరపు కట్నం నచ్చకపోవటం తప్ప మరేముంటుంది? అయినా ఈ రోజుల్లో అబ్బాయిల పెళ్ళి కూడా సమస్యగా ఉందంటే నాకు ఆశ్చర్యంగా ఉంది సుమండీ! ఉంటా మరి! మీ ఫ్రెండు లీలావతి,"

★ ★ ★

"బామ్మగారూ! డ్యూటీకెళ్ళొస్తానండీ!" అంటూ లీల సీతమ్మగారింటిముందు కేకేసింది!

"అలాగే! వెళ్ళిరా! జాగ్రత్త!" లోపల్నించే సమాధానం చెప్పింది సీతమ్మ!

"ఈరోజు మీ ఫ్రెండుకు డ్యూటీ లేదాండీ!" ఆనందరావు బయటకు వస్తూ పలకరించాడు లీలను!

"ఉందండీ! మరి తనకు ఏ షిఫ్టు ఉందో తెలీదు! నిన్నంతా తను నాకు కన్పించలేదు వస్తానండీ!" అంటూ పరుగులాంటి నడకతో బయటపడింది! అమ్మాయిలకు గది అద్దెకిస్తే కోప్పడతాడు. అదీ ఇదీ అంటూ బామ్మ చెప్పింది! కానీ ఆనందరావులో అలాంటి లక్షణాలేవీ కనపడకపోగా అతనొచ్చిన రెండో రోజే పనిగట్టుకు మరీ పలకరించాడు! ముఖ్యంగా సరోజతో ప్రత్యేక శ్రద్ధతో మాట్లాడటం, ఆమెతో మాట్లాడుతున్నపుడు అతని మొహం వెలిగిపోవటం గమనించి నవ్వుకుంది లీల!

ఆలోచిస్తూనే బస్టాండు చేరుకుంది లీల! సరోజ కనిపించి దగ్గరకొచ్చింది! "ఏమిటి నిన్నటినించి కనిపించలేదు ఏమయ్యావు?"

"బద్ధకంగా ఉంది పడుకున్నాను ఏమిటి విశేషాలు?" అంది సరోజ.

"ఏం లేదు! మా ఇంటి ఓనరుగారబ్బాయి అదే ఆనందరావుగారు నిన్నడిగితేనూ! ఆయనకీ నీకూ ఇదివరకే పరిచయముందా?"

"పరిచయమా? పాడా? మొన్నోరోజు నీకోసం వస్తే నీవు, కావేరి మార్కెట్ కెళ్లారు! ఓ అరగంట నీకోసం వెయిట్ చేశాను! అప్పుడు కాస్త సుత్తి కొట్టాడు! అంతే! అతడేమైనా నన్ను ప్రేమిస్తున్నాడంటావా?"

"ష్! నోర్మూయ్యి! ఇది బస్టాండు! మరీ బరితెగించి మాట్లాడకు!"

"సర్లే! ఆ విషయం ఇంటిదగ్గర తేల్చుకుందాం టైమయింది వెళ్లొస్తా" అంటూ పరిగెత్తింది సరోజ డిపోవైపు-

"ఒఠ్ఠి వాగుడుకాయ!" అనుకుంటూ తనూ డిపోవైపు నడకసాగించింది లీల!

యస్.ఆర్. క్లోజుచేసి ఓ రెండు నిమిషాలు తీరిగ్గా కూర్చుంది లీల సీట్లో! ఆమె పక్కన ఓ పల్లెటూరి స్త్రీ కూర్చుంది! వచ్చినప్పటినించి లీలను యక్ష ప్రశ్నలతో చంపుకుతింటోంది! ఆమె ప్రశ్నలన్నింటికీ ఓపిగ్గా సమాధానం చెబుతూనే, స్టేజిరాగానే దిగేవారికోసం డోరుతెరుస్తూ, బస్సెక్కేవారి కోసం డోరు తెరచి మళ్ళీ వేస్తూ, రైట్ హోల్డాన్, చెబుతూనే ఉంది!

"అది కాదక్కా! అక్కడ చేతులు బయట పెట్టరాదు అని రాశారు గదా" అందాస్త్రీ

"అవును! నీకు చదవటం వచ్చా? " అంది కుతూహలంగా.

"మా ఊర్లో రాత్రి బడి పెట్టినారుగదా! దాంట్లో సదుకున్నలే, ఇంగా అంత బాగ రాదు! అచ్చరాలు రాయబోతే సొట్టలు సొట్టలు బోతాయి." అందామె సిగ్గుగా.

"రోజూ రాస్తుంటే అవేవస్తాయి! బడికెళ్లటం మాత్రం మానకు!" అంది లీల!

"అలాగేలే కానీ బస్సులో ఉండే వాళ్ళనేమో చేతులు బయట పెట్టరాదు అని రాసి డ్రైవరు మాత్రం మాటిమాటికీ ఒక చెయ్యి బయట పెట్టి ఊపుతుంటాడెందుకు? " అందామె! లీలకు నవ్వు వచ్చింది! నవ్వేసింది కూడా! డ్రయివరు పాటిస్తున్న ట్రాఫిక్ రూల్సు ఆమె కర్థమయ్యేలా ఎలా చెప్పాలా అని సందేహించి "వెనక వస్తున్న బస్సులు, లారీలు మన బస్సును పక్కకు జరుగు పక్కకు జరుగు నేను త్వరగా వెళ్లాలి! అంటూ హారను కొడుతుంటారు! మన డ్రయివరు వారికి స్థలమిచ్చి పో! పో! అంటూ చెయ్యి ఊపుతాడన్నమాట" అంది లీల.

"వాళ్ళ నెందుకు ముందు పోనియ్యాలి! వాళ్ళకు స్తలమియ్యకపోతే ఏమయితది? " అందామె! నొసలు చిట్లించి!

ఆమె ప్రశ్నకు లీలకెలా సమాధానం చెప్పాలో తెలియలేదు!

ఇంతలో వెనక సీట్లో ఒకతను గట్టిగా "వెనకవచ్చే లారీలకు బస్సులకు మన బస్సు సైడివ్వకపోతే ధామ్మని వచ్చి మన బస్సును గుద్దుతాడు! ఒక్కటే దెబ్బకు నువ్వు సస్తావు! నీ ఆస్థంతా నీ కొడుకులు పంచుకుంటారు! నోరు మూసుకుని కూచ్చోకుండా ఆ యమ్మను ఏపుకు తింటన్నావెందుకు?" అంటూ కసిరాడు! ఠక్కున నోరుమూసుకుందామె! ఆపద్బాంధవుడిలా అనిపించాడతడు లీలకు! ఆమెమీద జాలి కూడా అనిపించింది! ఆమె చిన్నబుచ్చుకోవటం ఇష్టంలేక ఈసారి లీలనే ఆమెను మాటల్లో దింపి రాత్రిబడి విశేషాలు అడిగి తెల్సుకుని, ఆమె మళ్ళీ మామూలు 'మూడ్'లో కొచ్చేలా చేసింది! ఆమె దిగవలసిన స్టేజి రాగానే పోయి వస్తానక్కా అంటూ చెప్పి దిగింది! అదే స్టేజిలో ఒకతను తూలుతూ ఎక్కాడు! పూర్తిగా తాగాడు! గుప్పుమంటూ వాసనకొట్టింది! బస్సంతా నిండిపోయి ఉంది!

"టికెట్ తీసుకోవయ్యా!" అంది లీల! టికెట్టా? నేనా? నన్ను టి... కె... ట్ తీ...సుకో... మండా...నికి... నీ...నీ... కెన్ని... గుండెలు... నే... నె...వ... ్ర...ను...కున్నావూ."

"నువ్వెవరయితే నాకెందుగ్గానీ ఎక్కడికెళ్ళాలో చెప్పి టికెట్‌కు డబ్బులియ్యి!" అంది లీల చిరాగ్గా.

"హ... హ...హ... నిన్ను కొంటా...ను... నీ బస్సు...ను... కొంటాను... కానీ... టి...క్కెట్టు మ్మాత్రం కొనను... నా దగ్గర డ...బ్బు లేవు! అన్నాడతను తూలిపోతూ!

బస్సింకా కదల్లేదు! డ్రయివరు అసహనంగా "ఏంటమ్మా టిక్కెట్టివ్వటం పూర్తికాలేదా? " కేకేశాడు.

"కాస్త ఆగన్నా" అంటూ డ్రయివరుకు చెప్పి "ఏమయ్యా! కాస్త సాయంపట్టండి

ఇతన్ని దింపేద్దాం"అంది లీల!

"వాయమ్మో! వాడు రౌడీ ముండాకొడుకు" యాడొచ్చిన పీడ మా సేతకాదు తల్లీ! అంటూ ఎవరూ ముందుకురాలేదు!

"వాని మొలలో ఎప్పుడూ ఒక బాకుం టుంది" గుసగుసలు వినిపించాయి!

ఇందాక లీల పక్కన కూర్చున్న స్త్రీ బస్సు దిగి అక్కడే నిల్చుని బస్సు వెళ్లలేదేమిటా? అని బస్సులో జరిగే తంతు చూస్తూ నిలబ డింది.

"అటు దిగనూదిగవు. ఇటు టికెట్టూ తీసి కోవు ఏంటయ్యా!"

"అన్నా! ఓసారిలారా ఇతన్ని దింపేద్దాం" అంది లీల డ్రయివరు నుద్దేశించి.

"ఈ పల్లెటూరి నాయాండ్లతో ఏమి సావు వచ్చిందిర నాయనా!" అంటూ డ్రయివరు వచ్చేలోగానే ఇందాకటి స్త్రీ మళ్ళీ బస్సెక్కి "ఒరే! తాగుబోతు నాయాలా? దిగురా ముందు" అంటూ అందరూ చూస్తుండగానే బరబర ఈడ్చి బస్సుదింపి "కండక్టరమ్మా ఇంగ, రైట్ చెప్పు! ఈని కత నేను చూసు కుంట మీరెల్లండి" అంది. కృతజ్ఞతగా ఆమె వేపొకసారి చూసి"రైట్! రైట్!"అంది లీల. త్రాగుబోతువాడి నోటి వెంట బండబూ తులు స్పష్టంగా వినిపించాయి. ఓ క్షణం మనసు చివుక్కుమంది. మళ్ళీ కర్తవ్య నిర్వ హణలో పడి మరిచిపోయింది. కానీ బస్సు అదే రూటులో రెండో ట్రిప్పు కొచ్చినప్పుడు విన్న వార్త లీలను హతాశురాలును చేసింది. ఆ తాగుబోతు ఆ స్త్రీని తన వద్ద నున్న కత్తితో ఆమెను పొడవబోయాడట! ఆమె చెయ్యి అడ్డం పెట్టటంతో జబ్బకు పొడిచాడట. ఆమెను టౌను హాస్పిటలుకు, అతన్ని జైలుకు తరలించారట. లీల చాలా బాధపడింది. ఆ దెబ్బ తనకు తగలవల సింది. డ్యూటీ దిగగానే ముందు హాస్పిట ల్ కెళ్ళి ఆమెను పరామర్శించింది. "నువ్వేం దిగులు పెట్టుకోమాక కండక్టరమ్మా! మా పల్లెటూర్లో ఇయన్ని మాకు మామూలే! నోరు మెత్తగుంటే ఈ కాలంలో బతకలేం తల్లీ!" అంటూ ఆవిడ తనకే హితబోధ చేస్తుంటే ఆశ్చర్యపోయింది లీల! ఆమె ధైర్యా నికి మనసులోనే మెచ్చుకుంది. ఆ సంఘ టన గూర్చి లీల చాలారోజులదాకా మర్చిపో లేకపోయింది. రోజూ బామ్మగారితోనూ, కావేరితోనూ, సరోజతోనూ చర్చించేది. రోజూ హాస్పిటల్ కెళ్లి ఆమెను పరామర్శించి పూలూ, పళ్లు ఇచ్చివచ్చేది.

★ ★ ★

ఆరోజు సరోజ, ఆనందరావు పార్కులో కలుసుకున్నారు. సరోజ కలివిడి మనిషి కావటంతో ఆనందరావుతో మొదటిరోజే ఏ జంకూ లేకుండా మాట్లాడింది. నిజానికి ఆనందరావు బామ్మ చెప్పినట్లు ఋష్యశృం గుడేం కాదు. లీలను చూసి తెలియని అభి మానం ఏర్పడి ఇల్లు అద్దెకిచ్చింది. లీల కోసం సరోజ, అరవింద రావటం కబుర్లు చెప్పుకోవటం... సినిమాలకెళ్లటం... బామ్మతో కలిసి కూర్చుని జోకులేసుకో వటం... బస్సుల్లో జరిగిన విశేషాలు చెప్పు కోవటం... ఇవన్నీ ఆనందరావు రానంతవ రకూ బామ్మకు బాగానే ఉన్నాయి. ఎప్పు డైతే యువకుడు, అందగాడు, ఉద్యోగస్థుడు, బ్రహ్మచారి అయిన ఆనందరావు ఉద్యోగ రీత్యా బామ్మగారింట్లోనే సెటిల్ కావటానికి వచ్చాడో అప్పట్నించి ఆమె గుండెల్లో రాయిపడింది. ఆడపిల్లలూ పెళ్లికానివారే! వీడూ బ్రహ్మచారి. ఏం కొంపలు మునుగు తాయో అనుకుని ఆనందరావుకు ఆడపిల్ల లంటే పడదనీ, అనుమానస్థుడనీ, అతనికో సమే పుట్టిన ఓ అమ్మాయి బంధువర్గంలో వెయిట్ చేస్తోందనీ, లక్ష రూపాయలు కట్నం ఇచ్చేవారినే ఆనందరావు పెళ్లి చేసు కుంటానని అంటున్నాడనీ, వీలుచిక్కిన పుడల్లా లీల ,సరోజలతో చిలవలు పలవలు కల్పించి చెప్పసాగింది. లీల సంగతెలా

ఉన్నా సరోజ మాత్రం బామ్మగారి మనసు ఇట్టే కనిపెట్టేసింది.

ఛ! ఎందుకొచ్చిన గొడవ! అతనితో మనకేం పని అనుకుంది మొదట్లో! కానీ ఆనందరావు సరోజవైపు ఆకర్షితుడయ్యాడు. బామ్మ ఉన్నా భయపడకుండా ఆమెతో మాటలు కలపసాగాడు. అతను వచ్చి నెల రోజులు పూర్తి కాకముందే "మీతో పర్సనల్‌గా మాట్లాడాలి ఓసారి పార్కుకు వస్తారా? " అనడిగేశాడు. సరోజముందు కాస్త ఆలోచించింది. ఓసారి అతని వెంట పార్కుకెళ్లినంత మాత్రాన శీలం కోల్పోతానా? వెళితే ఏమవుతుంది? ఓ పదినిమిషాలు మాట్లాడితే అతనేమిటో తెలిసిపోతుంది అంతేగా? అనుకుంది.

"ఏమిటండీ పర్సనల్‌గా మాట్లాడాలన్నారు? విషయమేమిటి? " అంది సూటిగా సరోజ.

కాస్త తడబడ్డాడు ఆనందరావు, "అబ్బే... ఊరికెనే... సరదాగా మాట్లాడుకుందామనీ... నేనిలా పిలవడంవల్ల మీ మనసులో ఏ ఆలోచన వచ్చింది? " అనడిగాడు.

"మీ బామ్మగారు మీరు చాలా పిసినారి పైసా ఖర్చు పెట్టడు అని చెప్పేది. ఇప్పుడు మీరు పర్సనల్‌గా అంటే... ఏదైనా ఊరు వెళ్లటానికి బస్‌పాస్ అడుగుతారేమో అనుకున్నా... నా ఊహ కరెక్టేనా? పాస్ అరేంజ్ చెయ్యమంటారా? " అంది సరోజ! బామ్మమీద పళ్లు నూరాడు ఆనందరావు.

"మా బామ్మ అలా ఏవో పనికి రానిమాటలు చెబుతూ ఉంటుందిలెండి. ముసలావిడకదా! చాదస్తం! ఆ విషయం వదిలెయ్యండి. ఏవైనా కబుర్లు చెప్పండి" అన్నాడు బలవంతంగా మూడ్ మార్చుకుంటూ!

"ఈరోజు మా బస్సు గొర్రెల మందను దాటబోయి ఓ గొర్రెను చంపేసింది. ఒకటే రక్తం. దాని యజమాని ఒకటే గోల! బస్సు గంటలేటు. ఏమిటండీ మొహం అలా పెట్టారు? ఆర్.టి.సి. వాళ్ల దగ్గర ఇంతకన్న కబుర్లేముంటాయి చెప్పండి. ఆ కబుర్లేవో మీరే చెప్పరాదూ!" అంది సరోజ పకపక నవ్వుతూ.

"ఇంకా నా మెదడులో కబుర్లెక్కడున్నాయండి బాబూ! ప్రస్తుతం నేను రాతియుగంలో కెళ్ళిపోయాను మీ మహాత్యంవల్ల! నాకు మాటలు రావు. నన్నిలా వదిలెయ్యండి" అన్నాడు చేతులెత్తి దణ్ణం పెడుతూ.

"ఏమిటో బామ్మను అనవసరంగా అనుమానించి అపోహపడ్డాను"

"ఏమిటి మీలో మీరే గొణుక్కుంటున్నారు" అడిగాడు ఆనందరావు.

"అబ్బే! ఏంలేదు. పదండి వెళదాం. నా డ్యూటీ ఎప్పుడుందో కనుక్కోవటానికి బస్టాండుకెళ్లాలి" అంది ముందుకడుగేస్తూ సరోజ! నిరాశగా అనుసరించాడు ఆనందరావు.



"ఏమమ్మా! అరవిందా? మరీ నల్లపూసవయిపోయావు. నీ కూతురేంటి ఇలా చిక్కిపోయింది? " అంటూ లీల గదిలోకెళ్లబోతున్న అరవింద చేతుల్లోని పాపను తీసుకుని ముద్దాడింది సీతమ్మ.

"ఎక్కడ బామ్మగారూ! అస్తమానం

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే అయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల ప్రయాణం

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

డ్యూటీతోనే సరిపోతుంది. ఇంటికి రాగానే ఇదిగో ఈ యువరాణిగారి డ్యూటీ. పళ్లు వస్తున్నాయో ఏమిటో ఒకటే విరేచనాలు అవుతుంటే పిల్లల డాక్టరు దగ్గరికెళ్లి చూపించి మందులు కొనుక్కుని దారిలో లీలను చూసి వెడదామని వచ్చాను. బామ్మగారూ! ఈ పళ్లవిరేచనాలు ఎన్నిరోజులుంటాయండి. ఏదైనా చిట్కా ఉంటే చెప్పండి" అంది అరవింద.

"హయ్యో! రామ! మా కాలపు వైద్యచిట్కాలు ఈ కాలం పిల్లలకు పడవే తల్లీ! ఇలాంటి విరేచనాలకు గసగసాలు నూరిపోసేవాళ్లం. చిట్కా వద్దు! పాడు వద్దు. ఆ డాక్టరు సలహానే పాటించు. కాంచాననం కర్మవిమోచనం అని ఈ రోజుల్లో డాక్టరుకు బిల్లు చెల్లిస్తే తప్ప రోగాలు నయం కావు సుమా!" అంది సీతమ్మ.

"ఎవరు బామ్మా!" అంటూ ఆనందరావు బయటకొచ్చాడు. "లీలావతి స్నేహితురాలు అరవింద! ఈ అమ్మాయీ కండక్టరే! పెళ్లయింది. ఇదిగో కూతురు కూడానూ" అంటూ మనవడికేసి మిర్రి చూసింది. 'ఇహ నీవు వెళ్లచ్చు' అన్న ధోరణిలో.

"అలాగా! మీరు ఏ డిపోలో పనిచేస్తున్నారు సిస్టర్!" అన్నాడు సీతమ్మను పట్టించుకోకుండా.

"ఈ ఊరి డిపోయేనండి! వస్తాను. వస్తాను బామ్మా!" అంటూ లీల గదివైపు వెళ్లిపోయింది అరవింద.

"అస్తమానం ఆడపిల్లలతో కలుపుగోలుగా మాట్లాడకు! ఈ రోజుల్లో ఆడపిల్లలు అసాధ్యులు!" అంది సీతమ్మ.

"ఆడపిల్లలతో మాట్లాడవద్దంటావు! పెళ్లయినవారితో మాట్లాడవద్దంటావు. మగపిల్లలతో మాట్లాడితే చెడు అలవాట్లు నేర్పిస్తారంటావు. నీ ఒక్కదానితో మాత్రం మాట్లాడాలి. చంపేస్తున్నావుకదే. తాతయ్య సన్నాసుల్లో కలిసిపోయాడంటే ఎందుకో అనుకున్నా! ఆయన్ని కూడా దారుణంగా వేపుకు తిని ఉంటావు. కమండలం పుచ్చుకుని హిమాలయాలకు పారిపోయి ఉంటాడు" అన్నాడు ఆనందరావు.

"చాల్లే! నోర్ముయ్! పెద్దా చిన్నా లేకుండా తయారవుతున్నావు. పెద్దదాన్ని ఎందుకు చెబుతున్నానో అర్థం చేసుకో!" అంటూ కసిరింది సీతమ్మ. నోటిమీద వేలేసుకుని లోపలికెళ్ళిపోయాడు ఆనందరావు.

"ఏమిటి తల్లీ అరవింద దళాయతాక్షీ. బాగున్నావా?" అంది సరోజ! అరవింద చేతిలో పాపను తీసుకుంటూ.

"నువ్వెప్పుడొచ్చావు? లీల దగ్గరికైతే 'ఆఫ్' దొరగ్గానే వస్తావు. మా ఇంటికి మాత్రం ఎవ్వరూ రారు" అంది మొహం ముడుచుకుంటూ అరవింద.

"అదేమిటి అరవిందా అలాగంటావు? ఎందుకు రాము? ఈరోజు ఇదిగో ఇప్పుడే నీ గురించి మాట్లాడుకున్నాం. మీ ఇంటికి రావాలని కూడా అనుకున్నాం. ఇంతలో నీవే వచ్చావు!" అంది లీల అనునయంగా అరవింద భుజంమీద స్నేహపూర్వకంగా స్పృశిస్తూ!

"మీ ఇంటికి రావాలనే ఉంటుంది. మీ అత్తగారు మమ్మల్ని చూడగానే నొసలు చిట్లించి ఎందుకొచ్చారు? ఎప్పుడెళతారు? అన్నట్టు ప్రశ్నార్థకపు చూపులు చూస్తుంది. ఏమిటో ఇబ్బందిగా అనిపిస్తుంది" అంది సరోజ.

"పెద్దవాళ్ల తీరే అంత! నీకన్ని విడ్డూరమే! అందరూ ఒకే మనస్తత్వంతో ఉంటారా? సర్దుకుపోవాలి" అంది లీల.

"దానికీ పెళ్లయి ఓ సతాయించే అత్త. చంపుకుతినే మొగుడూ దొరికేదాకా సర్దుకుపోయే గుణం రాదు" అంది అరవింద నవ్వుతూ.



"సరేలే! చెప్పొచ్చావు పద. పద. షాపింగ్ చేద్దాం" అంది సరోజ.

"నెలాఖరులో షాపింగేమిటే? " అంది అరవింద.

"ఏ చీరకొన్నా వంద రూపాయలేనట? అదేదో లాడ్జిలో రెండు రోజులు మాత్రమే బసచేశారట. ఎలా ఉన్నాయో చూసివద్దాం!" అంది సరోజ.

"నాకంత ఓపిక, తీరిక, డబ్బూ లేవుకానీ, మీరు వెళ్లిరండి. తిరిగి వచ్చేటప్పుడు మా ఇంటికి రండి. బజ్జీలు చేసి పెడతాను. తిని వెడుదురుగాని" అంది అరవింద.

"హమ్మో! ఏమిటే లీలా సూర్యుడు దిశ గాని మార్చుకున్నాడా? అరవింద మనకు బజ్జీలు చేసి పెడతానంటోంది? "

"మా అత్తగారు ఊళ్లో లేదు. ఇప్పుడప్పుడే రాదు సరేనా? ఇంక సంభాషణ పొడిగించ కుండా నోరు మూసుకుని రండి!" అంది అరవింద.

"అది సర్లేగానీ, లీలా నువ్వు గమనిం చావా? ఈమధ్య అరవింద మొహంలో కళ వచ్చిందికదూ! కేవలం అత్తగారు ఊరికి వెళ్లటమే ఇందుకు కారణమంటావా? " అంది సరోజ ఎకసక్కెంగా.

"అదేంకాదు. మావారికి ఓ చిన్న ఉద్యోగం దొరికింది లీలా" అంది.

"అవునా? ఎప్పుడు? ఎక్కడ? ఎలా? " సరోజ రాగయుక్తంగా ప్రశ్నించింది.

"ఓ వారం కిందట బస్సులో ఓ 'జిప్ బ్యాగ్' నాకు దొరికింది. అందులో పదివేల రూపాయలు, ఏవో సర్టిఫికెట్లు, పాలసీలు కూడా ఉన్నాయి. అడ్రసు కూడా ఉండ టంతో డ్యూటీ దిగగానే వెళ్లాను. అడ్రసుగ లాయన చాలా పెద్దాయన. ఓ పెద్ద ఫ్యాక్టరీ నడుపుతున్నాడుట. ఆయన నేనలా డబ్బున్న బ్యాగు తెచ్చివ్వటం, నమ్మశక్యం కానట్టు, ఆశ్చర్యంగానూ చూశాడు.

"డబ్బుకంటే విలువైన పాలసీలు, సర్టిఫి కెట్లు తెచ్చిచ్చావు? నీ రుణం ఎలా తీర్చుకో వాలి తల్లీ!" అంటూ ఆప్యాయంగా మాట్లాడి నా గురించి తెలుసుకున్నాడు. నేను మావారి ఉద్యోగం గురించి చెప్పాను.

"ఆయనకభ్యంతరం లేకపోతే మా ఫ్యాక్ట రీలో చేరమను. మొదట మాత్రం పన్నెండు వందలు ఇస్తాం. తర్వాత తర్వాత జీతం పెరుగుతుంది" అని చెప్పారు.

నేను వారికి కృతజ్ఞతలు తెలిపి మా వారి కీవిషయం చెప్పి ఒప్పించాను. ఆయన ఉద్యోగంలో చేరిపోయారు. అస్తమానం తనను తాను కించపరుచుకుంటూ, లేని పోని ఆలోచనలతో గడిపేవారికి ఇప్పుడొక వ్యాపకం దొరికింది. నా ప్రాణానికీ హాయిగా ఉంది. కాకపోతే అప్పుడప్పుడూ అడ్డుపుల్లలు వేసి పోట్లాట పెట్టే అత్తగారి బాధ ఉందనుకో" అంది అరవింద.

"ఉద్యోగం చేసి డబ్బు సంపాదిస్తున్న ఆడవాళ్లను భర్తలు ప్రేమగా చూసుకుంటా రటకదా? నీ కథేమిటో... అన్నీ రివర్స్" అంది సరోజ నవ్వుతూ.

"పురుషుడి ఆధిక్యత అనే మెట్ల వరుసలో స్త్రీ ఎప్పుడూ అతనికంటే ఓ మెట్టుకిందే ఉండాలి. జీతం విషయమైతేనేమి, హోదా విషయమైతేనేమి, చదువు విషయమైతే నేమి. తనకంటే అధికురాలయిన భార్యను భర్త అహం అంగీకరించదు. బసవన్నలాగా అతను చెప్పేవన్నిటికీ తల ఊపే భార్య లంటే భర్తలకు ఇష్టం! నాలాగా ఏ ఉద్యోగం సద్యోగం లేని స్త్రీ అయితే ఎందు కొచ్చిన గొడవ. తల ఊపితే పోలా అను కుంటూ రోజులు గడిపేస్తాను. అదే మీలాగా ఉద్యోగం చేసే స్త్రీలు తల ఊపటా నికి ఒప్పుకోరు. గొడవలైపోతాయి. అంతే గదా అరవిందా? " అంటూ కావేరి ప్రవేశిం చింది.





"కరెక్టుగా చెప్పావక్కా! వీళ్లిద్దరూ తాడూ పేడూ లేనివాళ్లు. ప్రతిదానికీ నన్ను ఆక్షేపిస్తుంటారు. సంసారం చేసి అనుభవించేవాళ్లకు తెలుస్తుంది" అంది అరవింద.

"ఓయబ్బో! భలే సంసారం చేస్తున్నావులే! మగడిని కొంగుకు కట్టేసుకోవటం చేతకాదు కానీ... ఓ మూర మల్లెపూలు తీసికొస్తే హా! ప్రియా! ప్రాణనాథా! నీవే నా సర్వస్వము. నీ పాదాల దగ్గరే నా చోటు అంటూ ధబ్బున పడిపోతావు! తెల్లారి లేచి ఆయనగారు తల్లిమాట విని జుట్టు పట్టుకుని ఈడ్చికొడితే బయటికి వినిపించకుండా ఏడుస్తావు. అంతేగానీ వాళ్ల మనస్తత్వాల గురించి, నీవేమిటో నీ వ్యక్తిత్వం గురించి కానీ ఆలోచించటం, ప్రశ్నించటం అంటూ ఉందా? ఇదేగా నీవు చేసే సంసారం? " అంది సరోజ.

"ప్రశ్నించే స్త్రీ భర్తకే కాదు, లోకానికి కూడా విరోధి" అంది అరవింద.

"ఆ రోజులు పోయాయి. ఇప్పుడు ప్రశ్నించే స్త్రీలదే పైచేయి" అంది సరోజ.

"అమ్మా! తల్లీ! నీకెలాంటి మొగుడొస్తాడో... అపూర్వ చింతామణిలాగా ప్రశ్నలు వేస్తావో... తలలు నరికేస్తావో... చూస్తాంకదా! ఏదో నా బ్రతుకిలా తెల్లారుతోంది. ఇలాగే ఉండనీ... నాలాంటివారు ఈ దేశంలో డెబ్బయిశాతం ఉన్నారు. వారిలో నేనూ ఒకదాన్ని. నాకు టైం అవుతోంది వెళ్లొస్తాను. మీరు మా ఇంటికి రావటం మర్చిపోకండి" అంటూ బిడ్డను చంకనేసుకుని వెళ్లిపోయింది అరవింద!

"పిచ్చి మొహం! ఎలా బతుకుతుందో ఏమో" అంది సరోజ ఆరిందాలాగా కావేరి వైపు చూస్తూ!

"ఏమిటి లీలా! అప్పటినించి చూస్తున్నాను. కేవలం శ్రోతలాగా అలా ఉండిపోయావు, ఏమీ మాట్లాడకుండా" అంది కావేరి.

"అనుభవం లేని విషయాలు గురించి ఏం మాట్లాడమంటారు? " అంది లీల.

"అంటే నాకు అనుభవముందా? మొగుడితో పదేళ్లు కాపురం చేసి విడాకులిచ్చి వచ్చానా? ఏమిటే నువ్వనేది? " గయ్యిన లేచింది సరోజ.

"అబ్బబ్బ! అనుభవం అంటే సంసారం, మొగుడు ఉంటేనేనా? ప్రతి ఒక్కరినీ పరిశీలించటం, అర్థం చేసుకోవటం కూడా అనుభవమే! నీలాగా నేనందరినీ పరిశీలించటం... వారిని గురించి ఆలోచించటం చెయ్యను. అందుకే నాకనుభవం లేదన్నాను. గుమ్మడికాయల దొంగ అంటే భుజాలు తడుముకున్నట్టు నేనేదో అంటే నీకు రోషం వస్తుందెందుకు? " అంది లీల మందలింపుగా.

"అంతేనా? సరే అయితే క్షమించేస్తున్నాను పద... పద. షాపింగ్ కెడదాం. మీరూ రండి అక్కయ్యా!" అంది కావేరినుద్దేశించి. సరోజ.

"నా దగ్గర ఈడ్చితంతే పది రూపాయలు లేవు. నేను రాను మీరు వెళ్లండి" అంది కావేరి!

"అదేమిటండీ! మీవారి జీతం దాదాపు అయిదువేలు... బాదర బందీలేదు. మీ దగ్గర డబ్బు లేకపోవటమేమిటి? " అంది సరోజ.

"రెడ్డొచ్చె మొదలుపెట్టు అన్నట్టు నీకు మళ్ళీ మళ్ళీ చెప్పాలంటే నాకు కుదరదు, కానీ మీరు వెళ్ళండి" అంది కావేరి వెళ్లబోతూ.

"ఏమిటో ఈ దేశంలో స్త్రీ లెవ్వరూ అర్థం అయ్యేట్టు మాట్లాడరు" అంటూ బ్యాగు సర్దుకుని లేచి నిలబడింది.

"అప్పటికేదో నీవు మగరాయుడివైనట్టు. నోరు మూసుకుని పద" అంటూ గదికి

తాళం వేసింది లీల.

"ఎక్కడికండీ బయల్దేరారు?" అంటూ ఆనందరావు అడిగాడు.

"ఎవరైనా బయల్దేరి వెళ్లేటప్పుడు ఎక్కడి కని అడక్కూడదురా ఉమ్మీ" అంది గట్టిగా సీతమ్మ వరండాలో కూర్చుని వత్తులు చేసు కుంటూ.

ఆనందరావు బామ్మవేపు చూసి పళ్లు పట పటలాడించాడు. మళ్లీ అంతలోనే మొహం ప్రసన్నంగా పెట్టుకుని "పిక్చరుకా?" అన్నాడు సరోజ కళ్లల్లోకి చూస్తూ.

"కాదు షాపింగ్‌కు. ఏమిటి బామ్మా మీ మనవడిపేరు ఆనందరావుకదా. మీరేదో కొత్త పేరు పెట్టినట్టున్నారు" అంది ఆసక్తిగా సరోజ.

"నీకెందుకు?" అన్నట్టు లీల సరోజను ఆనందరావు చూడకుండా గిల్లింది.

"అబ్బే! ఏంలేదులెండి. బామ్మకు నోట్లో పళ్లూడిపోయాయికదా ఒకటి మాట్లాడితే ఇంకోలా వినిపిస్తుంది. మీకు టైమవుతున్న ట్టుంది వెళ్లిరండి" కంగారు కంగారుగా అన్నాడు ఆనందరావు.

"అదేమిటి బామ్మా! మీకు పళ్లూడిపోయా యంటున్నారు మీ మనవడు. మొన్నారోజు మొక్కజొన్నకండెలు పీక్కుతినటం స్పష్టంగా చూస్తేనూ!"

"వాడి మొహంలేవే! వాడి జన్మరహస్యం తెలిసిపోతుందని కంగారు"

"బామ్మా! నీకీమధ్య చాదస్తం ఎక్కువైపో తోంది. నాకు వళ్లు మండిందంటే ఏం చేస్తానో నాకే తెలీదు" అంటూ లోపలికెళ్ళి పోయాడు ఆనందరావు.

"నీ మొహం నువ్వేమీ చెయ్యలేవు" అన్నట్టు లోపలికెళుతున్న ఆనందరావు వేపొకసారి చూసి, "అది కాదమ్మాయ్! మా కూతురికి అదే వీళ్లమ్మకు పుట్టిన పిల్లలంతా పురిట్లోనే చచ్చిపోతూ ఉంటే వీడిని పుట్ట గానే దిబ్బలో పడ్డ ఎంగిలిస్తరాకులమీద పొర్లించాకే బారసాల చేశారు. అలా పొర్లిం చాక వాడి పేరు 'దిబ్బ' అనో, పుల్లన్న అనో పేరు పెట్టాలిట. తప్పనిసరిగా అలాంటి పేరు పెడితేనే బతుకుతారట పిల్లలు. మరీ దిబ్బ పుల్లన్న పేర్లు బాగుండవని 'ఉమ్మి' అని పేరు పెట్టాం. అదే పేరు స్థిరపడిపో యింది. స్కూల్లో చేరేముందు మాత్రం వాళ్ల నాన్న ఆనందరావు అని రాయిం చాడు. ఆనందరావు అంటే మొత్తం నాలుగు జిల్లాల్లో ఉన్న మా బంధువులెవ్వ రికీ తెలియదు, అర్థం కాదు. ఉమ్మిగాడు అంటే ఠకీమని అర్థమైపోతుంది. కానీ వాడి కాపేరంటే గిట్టదు. అందుకే నస" అంది రహస్యం చెబుతున్న ధోరణిలో.

సీతమ్మ చెబుతున్నదంతా లోపలిగదిలో తచ్చాడుతూ వింటూ, పచార్లు చేస్తూ బి.పి. పెంచుకున్నాడు ఆనందరావు. ఛీ! ఛీ! ఈ రోజుతో ఆ రహస్యం కాస్తా బద్దలైంది. ఇంక సరోజ మొహం కూడా చూడదు అను కుని పిడికిలి బిగించి గోడకు కొట్టాడు.

"అయిందా విన్నావుగా ఇక పద" అంది లీల.

నవ్వు ఆపుకోలేకపోయింది సరోజ. అప్ప టికప్పుడు ఆనందరావును చూడాలనుకుంది కానీ అతను బయటకు రాలేదు.

"ఆనందరావును ఆటపట్టించటానికి కొత్త పాయింటు దొరికింది" అంది సరోజ లీలతో.

"చూడూ! పిచ్చి పిచ్చి చేష్టలు చెయ్యకు! బామ్మగారు చూడటానికి ముసలావిడ చాద స్తంలా అనిపించినా ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగలదు. అసలెందుకే అతనంటే నీకంత ఇంట్రస్టు" అంది లీల కోపంగా.

"అదే నాకర్థం కావటంలేదు. బహుశ నేను ఆయన్ని ప్రేమిస్తున్నానేమో! అబ్బ!




మింగేసేలా ఆ చూపేమిటీ? ప్రేమిస్తే తప్పా. అతను కూడా నన్ను ప్రేమిస్తున్నట్టు న్నాడు. ఇందాక పక్కపక్కనే ఉన్నాంకదా. ఆయన నీతో మాట్లాడాడా? నాతోనేకదా మాట్లాడాడు. అంటే అతనికీ నామీద ఇంట్ర స్టున్నట్టేకదా! పాపం! మంచాడు. అమాయ కుడు. ఏమిటి మొహం అలా భయంగా పెట్టావు. తెలుగు సినిమాల్లోలా త్వరపడి కాలుజారి కడుపు తెచ్చుకోనుగానీ నీవేం వర్రీ అవకు" అంటున్న సరోజను కోపంగా చూసింది లీల.



అందరికీ టికెట్లిచ్చేసి ప్యాసింజర్లను లెక్క పెట్టి 'ఎస్సార్' ముందేసుకుని తన సీట్లో కూర్చుంది అరవింద! ఒకస్టేజి దాటిపో యింది! మరోస్టేజి ఇంకో మూడు కిలోమీట ర్లలో ఉంది! ఇంతలో బస్సులో కెవ్వున కేక వినిపించింది! ఉలిక్కిపడ్డారందరూ! అర వింద కూడా ఉలిక్కిపడి బస్సు అంతా ఓసారి చూసింది! నెలలు నిండిన ఓ గర్భ వతి మెలికలు తిరిగిపోతోంది! ఆమెకు ఇంతకుముందు టికెట్టు ఇస్తూ "నిండా నెల లయినట్టున్నాయి! ఇలాంటి సమయంలో ప్రయాణం ఎందుకు చేస్తారో" అని కూడా అనుకుంది! ఆమె పక్కన తల్లి కాబోలు కంగారుపడుతోంది!

"నొప్పులెక్కువయినట్టున్నాయి ఆస్పత్రికా పొయ్యేది!" ఎవరో అడుగుతున్నారు!

"అవును నాయనా టౌను చేరాలంటే ఇంకా ఎంతసేపవుతుంది? " గర్భవతి తల్లి అడిగింది.

"ఇంకా ముప్పావుగంటవుతుంది"

"ఓయమ్మో! నాచేత కావటంలేదు తల్లీ!" అంటూ గర్భవతి గట్టిగా అరుస్తోంది! కడుపు పట్టుకుని మెలికలు తిరిగిపోతోంది!

బస్సులో అందరూ "అయ్యో! అయ్యో!" అంటున్నారే తప్ప ఏం చెయ్యటానికి ఎవ రికీ పాలుపోవటం లేదు!

అరవిందకు ఆమె పరిస్థితి చూస్తుంటే భయమేసింది! బాధపడింది! డ్రయివరు దగ్గరికెళ్ళి "అన్నా కొంచెం స్పీడుగా పోనియి! ఆమె నెప్పులు తింటోంది! ఏదైనా ప్రమాదం జరుగుతుందేమోనని భయంగా ఉంది!" అంది

"నీకెందుకమ్మా భయం! ఇంత ముంచు కొచ్చేవరకు ఎవడుండమన్నాడు! మొరటు మొఖాలు! బస్సుల్లో చచ్చేవాళ్ళకు మనమెం దుకు బాధ్యులవుతాము. నువ్వేం భయప డద్దు! ఈ రోడ్డు చూస్తే ఇంత అధ్వానంగా ఉంది! స్పీడుగా ఎట్లాపోతుంది" డ్రైవరు కోపంగా అన్నాడు!

"అంత కోపమెందుకన్నా! వాళ్ళ టైం అట్లాంటిది! ఆ పరిస్థితుల్లో మా వదిన అదే మీ భార్యగానీ, నీ చెల్లినయిన నేనుగానీ ఉంటే నీ మనసెలా ఉంటుంది చెప్పు! మనకు చేతనయిన సహాయం మనం చేద్దాం! ఆపైన దేవుడున్నాడు!" అంది అర వింద. అరవింద మాటలతో డ్రయివరు కోపం తగ్గించుకుని "సరేనమ్మా! ఈ బస్సు ఈ రూట్లో ఎంత స్పీడుగా తోలినా టౌను చేరేసరికి ఇంకా అరగంటకుపైగా పడు తుంది! పైగా ఈ గతుకులరోడ్డుమీద ఆ గర్భవతికి ప్రయాణం చాలా కష్టంగా ఉంటుంది! ఏం చేద్దామో చెప్పు! నీవెలా చెబితే అలా చేస్తాను" అన్నాడు డ్రయివరు! సౌమ్యంగా!

అరవింద ఏదో చెప్పాలనుకునేలోగానే గర్భవతి గావుకేకలు వేయసాగింది! బస్సులో సీటు, ఆమె చీర తడిసి పోసా గాయి! అరవిందకు పరిస్థితి అర్థమైపో యింది! బస్సులోంచి బయటకు చూసింది! వరికోతలు పూర్తయిన రోజులేమో వరిగడ్డి వాములుగా తయారుచేస్తున్నారు! అక్కడ ఒకరు ఇద్దరు చేలల్లో ఏవో పనులు చేసు



కుంటున్నారు! ఓ చెట్టుకింద ఓ నలుగుర యిదుగురు స్త్రీలు, ఇద్దరు మగవాళ్ళు చద్ది మూటలు విప్పుకుని అన్నం తింటున్నారు!

అరుంధతి ఠక్కున "అన్నా! బస్సు ఆపు" అంది! బస్సు ఆగింది!

అరుంధతి గర్భవతి తల్లితో "అమ్మా బస్సు దిగండి పురుడు వచ్చేట్లుంది! ఇలాగే బస్సులో ఉంటే ప్రమాదం" అంది ఆత్రుతగా!

"నేనూ అదే చెబుదామనుకున్నాను తల్లీ!" అంటూ ఆమె కూతురిని లేవనెత్తింది!

బస్సులో ఉన్న మిగతా స్త్రీలు పురుషులు ఆమెను జాగ్రత్తగా బస్సు దింపారు!

చెట్టుకింద అన్నం తింటున్న వారిదగ్గరికి అరవింద పరిగెత్తుకెళ్ళి విషయం చెప్పింది!

అయ్యో! అయ్యో! అంటూనే గడ్డివాము పక్కన మరుగుచేసి వరిగడ్డిపరచి దానిమీద దుప్పటివేసి గర్భవతిని పడుకోబెట్టారు!

ఓ పది నిమిషాలు ప్రసవవేదన పడింది! అరవిందకు టెన్షన్ ఎక్కువైంది! ఆ పక్కనున్న పల్లెల్లో ఎవరో మంత్రసాని ఉందన్నారు! డ్రయివరు బస్సు తీసికెళ్ళి మంత్రసానిని పిలుచుకువచ్చాడు. మంత్రసాని రాకముందే ఆమె మగబిడ్డను ప్రసవించింది! మంత్రసాని వచ్చి మిగతా కార్యక్రమాలన్నీ చేసింది! ఇదంతా జరిగేసరికి దాదాపు గంటన్నర పైగా అయింది! అప్పటిదాకా అందరూ టెన్షన్ భరించారేమో ఆమె ప్రసవించగానే! వారి వారి ప్రయాణాలు గుర్తుకువచ్చి "అయ్యో! లేటవుతోంది అంటూ డ్రయివరును, కండక్టరును తొందర చేయసాగారు! తల్లిని, కూతురును, పసికందును తీసికొని బస్సెక్కించి మళ్ళీ ప్రయాణం చేశారు! వారిని హాస్పిటల్ దగ్గర దింపి, హాస్పిటల్‌లో చేర్పించి సహాయపడ్డానికి ఓ యువకుడిని ఏర్పాటుచేసి, డిపో చేరేసరికి రాత్రి ఎనిమిదిన్నర దాటింది!

మనసులో బితుకు బితుకుమనుకుంటూనే ఇల్లు చేరింది అరవింద. అరవింద అత్తగారు ఊరు వెళ్ళింది. ఈ పదిరోజులుగా చాలా నిశ్చింతగా అనిపించసాగింది. కరుణాకర్ కూడా అరవిందను పల్లెత్తు మాట అనకపోగా, ఇంటికి వచ్చేముందు మల్లెపూలు, స్వీట్లు తెచ్చేవాడు! ఒకోరోజు అరవింద డ్యూటీనించి వచ్చి వంటచేయటానికుపక్రమిస్తే, "ఏం వంటలెద్దూ! ఏదైనా టిఫిన్ చెయ్యి. తినేసి పాలు త్రాగి పడుకుందాం!" అనేవాడు! ఇద్దరూ కలిసి పాపతో ఆడుకునేవారు! మళ్ళీ ఉదయాన్నే లేచి కరుణాకర్ నీళ్ళు పట్టేవాడు! పాప పనుల్లో సాయం చేసేవాడు! అరవిందకు ఉదయం 6 గంటలకే డ్యూటీ ఉంటే, ఆమె వెళ్ళిపోగానే ఇల్లు శుభ్రంచేసి, పాపకు పాలుపట్టి, పక్కింటి పిన్నిగారి సహాయంతో స్నానంచేయించి ముస్తాబుచేసి ఆమెకు పాపను అప్పచెప్పేవాడు! పనిపిల్ల సాయంతో కూరలు తరిగించి ఓ కూర, అన్నం చేసి తిని తను డ్యూటీకెళ్ళిపోయేవాడు! రోజూ తన భర్త ఇలాగే ఉంటే ఎంత బావుండు అనుకునేది అరవింద!

ఆరోజు ఉదయమే అరవింద తల్లి, చెల్లి ఊరినించి దిగారు! వారిని చూడగానే అరవిందకు చాలా సంతోషమనిపించింది! అత్తగారు ఊళ్ళో లేదు! ఓ రెండు రోజులైనా తల్లితో, చెల్లితో మనసారా మాట్లాడి, ఏదైనా తీపివంట చేసిపెట్టి, వెళ్ళేప్పుడు, ఓ రవిక ముక్క ఇచ్చి పంపాలి అనుకుంది!

"ఈరోజు డ్యూటీ కెళ్ళకపోతేనేం సెలవు పెట్టరాదూ" అంది అరవింద తల్లి శేషమ్మ.

"ఇప్పటికిప్పుడు కుదరదులే అమ్మా! ఎంతసేపు సాయంత్రం ఆరింటికంతా వచ్చేయనూ! సరుకులు అన్నీ ఉన్నాయి! నేను వచ్చేలోగా లడ్డూలు చేసి, కాసిని జంతికలు చెయ్యవే అమ్మా! తినాలని ఉంది!"




"మీ అత్తగారు ఎప్పుడొస్తారు? ఆవిడ లేనపుడు మేమిలా నీయింట్లో పిండి వంటలూ అవీ చేసుకుతింటూ ఉంటే అల్లుడుగారు ఏమైనా అనుకుంటారు! మేమె లాగూ కారప్పూస, కజ్జికాయలు తెచ్చాంకదా వాటితో సర్దుకోవచ్చులేవే ఏం తీపి? మొహం మొత్తుతుంది? " అందామె.

"బలేదానివే! ఆయనేమనుకోరు! అత్తగారు ఆడబిడ్డకు పురుడు పోయటానికి వెళ్ళింది! నిన్నటికింకా పదహారు రోజులయింది! ఇప్పుడప్పుడే రానంటూ నిన్ననే ఉత్తరం కూడా వచ్చింది! స్వీట్సు నీవు తెస్తే సరా? మా ఇంటివంట మీరు తినక్కర్లేదేమిటి? " అంది నిష్ఠూరంగా అరవింద!

"సరేలే! ఏవి ఎక్కడున్నాయో చెప్పి వెళ్లు! సాయంత్రం త్వరగారా! రేపు సెలవు పెట్టిరా? అందరం కలిసి ఏదైనా సినిమాకి వెడదాం!" అంది శేషమ్మ!

"అలాగేలే!" అంటూ ఉత్సాహంగా డ్యూటీ కెళ్ళింది అరవింద!

ఉదయం ఎంత ఉత్సాహంగా వెళ్ళిందో ఇంటి ముంగిటకు రాగానే నీరుగారిపోయింది అరవింద! అరవింద అత్తగారు ఊరి నించి దిగింది! అరవింద ఇంట్లోకెళ్ళగానే "ఏమమ్మా! తల్లికీ, చెల్లికీ, కొంప కొల్లేరు చెయ్యమని అప్పచెప్పి నువ్వు బలాదూరు తిరిగి వస్తున్నావా? అసలు నీకు సంసారి లక్షణాలున్నాయా? " అంటూ నోరు పెద్దగా చేసి అరవసాగింది! శేషమ్మ, ఆమె పధ్నాలుగేళ్ళ కూతురు ఆమె అరుపులకు బిక్కచచ్చిపోయి ఓ మూల కూర్చున్నారు! కరుణాకర్ ఓ పుస్తకం మొహానికడ్డం పెట్టుకుని ఓ కుర్చీలో కూర్చునాడు.

అరవింద మానసికంగా, శారీరకంగా బాగా అలసిపోయి ఉంది! ఆమె మాటలతోనూ, ఊహించని ఆమె రాకతో, ఇప్పుడప్పుడే రానని నిన్న ఉత్తరం రాసి, ఈరోజు ఉన్నట్టుండి దిగటంలో ఆమె ఆంతర్యమూ బోధపడక అలా నిల్చుండిపోయింది. ధైర్యం తెచ్చుకుని కొద్దిసేపటికి తేరుకుని, భర్త తనకు సపోర్టు ఉన్నాడు గదాని, ఆమె మాటలు పట్టించుకోక భర్త దగ్గరికెళ్ళి "ఏమండీ! ఈరోజు బస్సులో ఒకావిడ ప్రసవం కాబోయింది! అలా జరక్కుండా ఆమెను బస్సుదింపి, చేలో గడ్డివాము పక్కన ఏర్పాటుచేసి, ప్రసవమయ్యాక అదే బస్సులో ఆమెను హాస్పిటల్‌లో చేర్పించి వచ్చేసరికి లేటయింది" అంది నెమ్మదిగా.

కరుణాకర్ ముఖానికడ్డం ఉన్న పేపరు పక్కకు తీసి భార్యవైపు తీక్షణంగా చూస్తూ "నువ్వు చేస్తున్నది కండక్టరు ఉద్యోగమా? మంత్రసాని ఉద్యోగమా? " అన్నాడు.

నివ్వెరపోయింది అరవింద. నిన్నటిదాకా ఎంతో సౌమ్యంగా, ఆప్యాయతతో మాట్లాడిన భర్త ఇలా ఉన్నట్టుండి ఇంత కఠినంగా మాట్లాడటంతో ఏం జవాబివ్వాలో తోచ లేదు. "అదికాదండీ! మీరా పరిస్థితి చూస్తే ఇలా మాట్లాడరు" అంది.

"నోర్ముయ్! నీ కట్టుకథలు నాకు చెప్పకు! ఇంటిదగ్గర మొగుడు, పసిపిల్ల ఉందన్న జ్ఞాపకమైనా ఉంటుందా నీకు. ఆ ఉద్యోగంలో అంత మైమరపు ఉందా? "

"మరీ అర్థంలేని మాటలు మాట్లాడకండి!" అంది రోషంగా అరవింద. తల్లి, చెల్లి ముందర భర్త తనను అవమానంగా మాట్లాడటం సహించలేకపోతోంది అరవింద.

"చూశావా! చూశావా! మొగుడంటే ఎంత లెక్కాజమాలేకుండా మాట్లాడుతుందో, ఏమ్మా వియ్యపురాలా ఇదేనటమ్మా నీ పెంపకం? ఏమేపిల్లాచూడు చూడు బాగా విను. మీ అక్కను చూసి నేర్చుకో. పెళ్ళయ్యాక నీవూ ఇలాగే ప్రవర్తించాలిగద" అంటూ అరవింద తల్లివేపు, చెల్లివేపు చూస్తూ ఒకదానికొకటి పొంతనలేకుండా

మాట్లాడసాగింది.

"ఏమిటి వదినా! మరీ ఇంత రాద్ధాంతం చేస్తున్నారు. అమ్మాయి, ఇపుడంత కానిపని ఏం చేసిందని?" సహనం చచ్చిపోయి అడిగింది శేషమ్మ.

"ఇంకా ఏం చేయాలనుకున్నావు! మొన్నో రోజు డ్రయివరు, నీ కూతురు హోటల్లో ఎదురెదురు సీట్లలో కూర్చుని టిఫిన్ తింటూ ఒకటే ఇకఇకలు పకపకలూనట! మా అల్లుడి స్నేహితుడు చూసివచ్చి చెబుతుంటే, రైలుకింద తలపెట్టాలనిపించింది" అంది.

"ఉదయం ఆరుగంటలకే కాఫీ కూడా తాగకుండా డ్యూటీ కెళతాను. తిరిగి వచ్చేసరికి మూడవుతుంది. అంతదాకా టిఫిన్ తినకుండా కాఫీ తాగకుండా ఎలా ఉంటాను? ఒకే బస్సులో ప్రయాణం చేస్తున్న సహ ఉద్యోగులం, ఒకే డ్యూటీ చేస్తున్నాం. ఇద్దరం కలిసి టిఫిన్ తినటం తప్పా? డ్రయివర్లు నన్ను చెల్లిలాగా చూసుకుంటారు. ఎవడో పనికిమాలిన వాడు, మనకు పోట్లాటపెట్టాలని ఏదో వాగితే, అది విని మీరిలా అసహ్యంగా మాట్లాడటం ఏం బాగాలేదు" అంది అరవింద కోపంగా.

"ఏమిటే వాగుతున్నావు! చేసిన నిర్వాకం చాలక, మా అమ్మ మాటలకు బదులిచ్చేదానివయ్యావా?" అంటూ కరుణాకర్ ఆవేశంగా అరవింద చెంపమీద చెళ్ళున కొట్టాడు!

"ఏమిటండీ అల్లుడుగారూ! అసలు మీరు మనిషేనా? మీకు నచ్చకపోతే దాన్ని ఉద్యోగం మానెయ్యమనచ్చుగా? ఇంట్లో అందర్ని పోషిస్తూ కూడా నీ తలరాత ఏమిటే ఇలా తయారయ్యింది" అంటూ భోరున విలపించింది శేషమ్మ!

"చూశావట్రా మీ అత్తగారు ఏం సెలవిచ్చిందో? తన కూతురు సంపాదిస్తుందనేగా, ఈవిడ ఇంత పొగరు మాటలు మాట్లాడేది. నువ్వు చేతకానివాడివి, పెళ్ళాం సంపాదన తప్ప మరో గతి లేని ముండావాడివి! అదేదో ఉద్యోగమూ ఆవిడగారే చూపించిందిగా, ఎవడిదగ్గర ఏ వగలుపడి ఇప్పించిందో, ఏదీ కనుక్కోలేని చచ్చుదద్దమ్మవి! నల్లనివన్ని నీళ్ళు, తెల్లనివన్ని పాలు అనుకున్నావు కాబట్టే నీ, సంసారం ఇలా రచ్చకెక్కింది" అంటూ నాలుగిళ్ళకి వినపడేలాగా గట్టిగా అరిచింది.

పరిస్థితి, ఆమె నోరు శృతిమించుతోందని గ్రహించిన అరవింద తల్లివైపు తిరిగి "అమ్మా! ఈ కొంపలో నాకాపురం ఎప్పుడూ ఇలాగే ఏడుస్తుంటుంది! చెల్లిని తీసికొని నువ్వు బయల్దేరు. ఈ రాత్రికి మామయ్యగారింట్లో పడుకొని తెల్లారి ఊరు వెళ్ళిపొండి!" అంటూ వారి సూట్‌కేసు తీసుకుని బయటకు నడిచింది! పక్కింటి కుర్రాడితో ఆటో తెప్పించి వారినందులో ఎక్కించి "అమ్మా! ఇక్కడ జరిగినవేవీ నాన్నగారితో చెప్పకు! బాధపడతారు. ఆయన మంచివారే! వాళ్ళమ్మముందు... ఆమె నోటికి భయపడి అలా ప్రవర్తించారు. నువ్వు కూడా ఇవన్ని ఆలోచించకు. అన్నీ సర్దుకుంటాయి. ఓ నెలరోజులు పోయాక నేను మన ఊరువస్తాగా!" అంటూ అనునయంగా చెప్పింది అరవింద.

శేషమ్మ గుడ్లనీరు కుక్కుకుంటూనే ఉంది! "ఉద్యోగం చేస్తున్నావు, అత్త, భర్త నిన్నెంతో గౌరవంగా చూసుకుంటూ ఉంటారని ఏవేవో గొప్పగా ఊహించుకుని మురిసిపోయేదాన్ని. వీళ్లింత అధ్వాన్నపు మనుషులేమిటే అమ్మా! ఎలా వేగుతావే తల్లీ!" అంటూ బావురుమంది. అరవింద చెల్లి కూడా "అక్కా! పాపను తీసికొని మన ఊరు వచ్చెయ్యవే! ఇక్కడే ఉంటే వీళ్ళు పీక్కుతింటారు!" అంటూ ఏడ్చేసింది!

"ఛ! అలాంటిదేం లేదు. ఇవన్ని




మామూలే! మీరు వెళ్ళండి" అంటూ ఆటోను వెళ్ళమంది అరవింద. ఆటో వెళ్ళి పోయింది. ఇంటిముందు చీకట్లో అలాగే నిల్చుండిపోయింది. మనసంతా భార మైంది. తల్లి, చెల్లి ఎంతో సంతోషంగా తన ఇంటికి వస్తే, ఒక్కపూట కూడా వారికి ప్రియంగా భోజనం పెట్టటానికి కూడా నోచుకోలేదు. ఆ మాత్రం స్వతంత్రం కూడా తనకులేదు. జీతం మొత్తం అణాపైసలతో సహా తెచ్చి అత్తగారి దోసిట్లో పోస్తుంది. పాప ఖర్చులకు, తన ఖర్చులకు మళ్ళీ ఆవి డనే దేబిరించాలి. అలా డబ్బు అడిగినపు డంతా ఓ పోట్లాట. మూడునెలలకోసారి, కూతురికి గుడ్డలు కొనాలనో, ఆమె ఆరోగ్యా నికి గురించో, ప్రయాణాల గురించో అత్త గారు విచ్చలవిడిగా ఖర్చుచేస్తుంది.

అయినప్పటికీ, తను వాటిగురించి పట్టిం చుకోవటం మానేసింది. పట్టించుకొని చేసేదేం లేదు. ఏదైనా అడగబోతే అత్తగారి రాద్ధాంతం! భర్తకు కోపం, పోట్లాట, మన శ్శాంతి లేకపోవటం. అరవింద విసిగిపో యింది. చివరికి ఏదెలా ఖర్చవుతే నాకెందు కన్నట్టు యంత్రంలా ఉద్యోగం చేయటం, పాపను చూసుకుని కాస్త మనశ్శాంతి పొందటం అలవాటుచేసుకుంది. ఏరోజు కారోజు హమ్మయ్య! ఈరోజు పోట్లాటలే కుండా రోజుగడిచిపోయింది అనుకునేలా మారిపోయింది ఇంటివాతావరణం! బరువె క్కిన మనసుతో ఇంట్లోకొచ్చి, కాలేకడుపుతో మంచినీళ్ళు త్రాగి, పాపను పక్కలో వేసు కుని కళ్ళు మూసుకుని పడుకుంది రేపటి ప్రయాణం గురించి ఆలోచిస్తూ అరవింద!

★ ★ ★

"ఇదిగో లీలా! స్నానంచేసి వచ్చెయ్యి మా యింట్లోనే భోంచేద్దువుగాని" కావేరి కేకే సింది తాళం తీస్తున్న లీలను చూసి.

"ఏమిటండీ! విశేషం! ఈరోజేదైనా పండగా? " అంది లీల.

"హయ్యో! రామ మీ ఎర్రబస్సులవాళ్ళకు పండగేదో, పబ్బమేదో తెలీకుండా అలా ప్రయాణం చేస్తూనే ఉంటారు కదా. ఈ రోజు క్రిష్ణాష్టమి తల్లీ. త్వరగా రా నేను నీకోసమే కాచుక్కూర్చున్నాను" అంది కావేరి.

"అయిదు నిమిషాల్లో వచ్చేస్తా... ఇంటి కెళ్ళి వంట చేసుకునే ఓపిక లేదు. ఎవరైనా ఇంత ముద్ద పడేస్తే బావుండు అని దార్లో అనుకున్నాను. మనసు గ్రహించిన దేవత లాగా మీరు పిలిచారు సుమండీ!" అంటూ కంచంముందు కూర్చుంది లీల.

ఇద్దరికీ వడ్డించింది కావేరి. "అన్నయ్యగా రెక్కడికెళ్ళారు" అనడిగింది లీల!

"ఎక్కడికెళ్లారో తెలీదు. ఉదయంనించి మాయిద్దరికీ పోట్లాట. కోపంగా ఎక్కడికో వెళ్ళారు" అంది కావేరి.

"ఉన్నది ఇద్దరే ఇద్దరు. మీ మధ్య పోట్లా టలెందుకొస్తాయండీ!" ఇద్దరం కాబట్టే తిన్న దరక్క పోట్లాటలు. మామధ్య ఓ పిల్లో పిల్లాడో, లేకుంటే, ముసలి అత్తగారో, మామ గారో ఉన్నా పోట్లాటకు వీలుండేది కాదు" అంది కావేరి. "ఇంతకీ పోట్లాట ఎందుకొ చ్చిందని అడగవేం? "

"ఎలాగూ మీరే చెబుతారుగదాని" నవ్వింది లీల.

"నిన్న జీతం వచ్చింది గదా ఓ యాభై రూపాయలడిగాను. ఇవ్వనన్నారు అందుకే పోట్లాట"

"అదేమిటి ఎందుకివ్వరు? " ఆశ్చర్యంగా అడిగింది లీల.

"ఆడవాళ్ళకు డబ్బు పెత్తనం కూడదుట. నీకేం కావాలో చెప్పు కొనిపెడతాను. డబ్బు మాత్రం చేతికివ్వను అంటారు. నాకేమో ఓ యాభై రూపాయలయినా నా దగ్గరలేకుంటే పిచ్చెక్కుతుంది. అక్కడికీ మా పుట్టింటి కెళ్ళి

నపుడు నాన్ననడిగి వందో, రెండువందలో తెచ్చుకుంటాను. అది ఉన్నన్నాళ్ళు బావుం టుంది. ఏదైనా వస్తువులో, తినుబండా రాలో, ఇంటిముందు కొస్తే కొనేస్తాను అయి పోతాయి. మళ్ళీ మామూలే" అంది కావేరి బాధగా!

"మీరెలాగూ చదువుకున్నారు కదా! ఏదైనా ఉద్యోగం చెయ్యకూడదా? మీ ఖర్చు లకు పనికొస్తుంది కదా!"

"సగేలే! అదీ అయింది. ఈ యింట్లోకి రాకముందు ఓకాన్వెంటులో పనిచేసేదాన్ని. నెలకు అయిదు వందలిచ్చేవారు. హ్యాపీగా ఉండేది. ఓ ఆరునెలలు పనిచేశాను. నాక్కా వలసిన కాస్మటిక్స్ అన్నీ నా డబ్బుతో కొనే దాన్ని. తృప్తిగా ఉండేది. కానీ ఆరు నెలలు మాత్రం చేసి మానేశాను"

"అదేం? ఎందుకని? "

"ఉద్యోగానికి వెళ్లేలోగా ఆయనక్కావలసిన వన్నీ అమర్చిపెట్టి వెళ్ళేదాన్ని! సాయంత్రం ఆయనకంటే ముందుగా వచ్చేదాన్ని. టిఫిన్ రెడీచేసి, ఆయనకోసం ఎదురుచూసేదాన్ని. అదేమిటో ఓ నెలరోజులు ఏం మాట్లాడ లేదు. ఆయన్ని నాకోసమంటూ డబ్బు అడ గలేదు. మగవాడెప్పుడూ తన చేయి ఇచ్చే చెయ్యిగానూ, భార్య చేయి పుచ్చుకునే చెయ్యి గానూ ఉండాలని కోరుకుంటాడు. ఆయన్ని డబ్బు అడక్కుండా, నా ఖర్చులకు నా డబ్బు వాడుకుంటున్నానని, ఆయనకు మండిపోసా గింది. ఆ మంట రోజుకోవిధంగా చూపసా గాడు.

ఖర్మచాలక కూరలో కాస్త ఉప్పు ఎక్కు వైనా, కారం తక్కువైనా, అన్నం కాస్త చిమి డినా, "మనసెక్కడ పెట్టుకున్నావు? ఓ వంటమనిషిని కుదుర్చు! సంపాదిస్తున్నానని పొగరా? " అనేవాడు. బట్టలు మురికి వద లేదనే వాడు. ఇస్త్రీ సరిగా చేయలేదనే వాడు. అమ్మో! వద్దులే ఆ చిత్రహింసలు. ఛ! ఎందుకొచ్చిన గొడవ అని మానేశాను! అయినా నేను సంపాదించకపోతే సంసారం జరగదని కాదు. ఆ మాటకొస్తే మా ఇద్ద రికీ ఖర్చెంత అవుతుంది. ఇంకా మిగిలి బ్యాంకులో వేస్తారు. నాకూ ఆర్థికస్వా తంత్రం ఉండాలని నా తపన! మొన్నామధ్య మా అమ్మ, నాన్నవచ్చారు. ఆటో దిగి ఓ పదిరూపాయలుంటే ఇవ్వమ్మా నాదగ్గర వందనోటుంది. అతని దగ్గర చిల్లర లేదుట అన్నారు నాన్నగారు. నా దగ్గర పదిపైసలు కూడా లేదు. ఆయన ఇంట్లో లేరు. నాకేం తోచక చివరికి అయ్యో! నా దగ్గరా వంద నోటే ఉందినాన్నా ఇలా ఇవ్వండి చిల్లర చేసుకొస్తానంటూ నాన్నదగ్గరి వందనోటు తీసుకుని వీధిచివరి నున్న కొట్టుకెళ్ళి తీసు కొచ్చి ఇచ్చాను. అంతకుముందోసారి మధ్యాహ్నం తలపగిలేంత నెప్పిగా ఉంది! అనాసిన్ మాత్రకు అర్థరూపాయలేదు. ఇలాంటి సంఘటనలు తలుచుకుంటే సంసారం మీదే విరక్తి పుడుతుంది. దేముడిదయవల్ల మాకు పిల్లల్లేరు. పిల్ల లుంటే ఇంకా ఎంత ఖర్చు ఎప్పుడే అవస రమొస్తుందో తెలీదు. లేనిదే మేలయిందని ఎన్నిసార్లనుకుంటానో తెలుసా? " అంది కావేరి ముగిస్తూ!

"పోనీ ఇంటిదగ్గర ట్యూషన్స్ చెప్పవ చ్చుగా? " లీల అంది.

"వద్దులే! పిల్లలగోల అంటూ వాళ్ళ ముందరే నన్ను తిట్టినా తిడతారు. అదొక అవమానం ఎందుకు? " అంది కావేరి.

ఆలోచిస్తూ ఉండిపోయింది లీల!

"ఏమిటి భోజనానికి పిలిచి నీ మెదడు చెడగొట్టేశానా" అంది కావేరి!

"ఛ! ఛ! అలాంటిదేం లేదు. తోడబుట్టిన వాళ్ళలా ఉంటున్నాం. ఒకరి సమ స్యలొకరికి చెప్పుకుంటే తప్పేంలేదు"

"వెళ్లు! వెళ్ళి రెస్ట్ తీసుకో! నా భాగవతం ఎప్పుడూ ఉండేదే. అన్నట్టు నీకు ఉత్తరాలు




రెండు వచ్చాయి. ఫ్రం అడ్రసు చూశాను. ఒకటి సారథినించి, ఒకటి మీ నాన్నగారి దగ్గరినించి" అంటూ తెచ్చి ఇచ్చింది కావేరి.

"అలాగా! సారథి ఉత్తరం బోర్ కొట్టిన ప్పుడో, తిరగెయ్యటానికి ఏ మ్యాగజైన్ లేన ప్పుడో చదువుకోవచ్చు అందులో విశేషాలేం ఉండవు. పోతే నాన్నగారి ఉత్తరం చదవలే కపోయారా ఏం రాశారో" అంది లీల.

"భలేదానివే, ఫ్రం అడ్రసు చూశానుక దాని, పూర్తిగా చదివెయ్యకూడదా అంటు న్నావా? " అంది చిరుకోపంగా కావేరి.

"అదేంకాదు. అలసిపోయాను. నిద్రపోవ టానికి ఏ కాస్త టైం మిగిలినా మిగిలినట్టే కదా. ఉత్తరం కూడా చదివిపెట్టి పని తగ్గిం చండి. అని నా ఉద్దేశం. సరే నేను వెళుతు న్నాను. అయిదుగంటలకు నిద్రలేపండి. రేపటి డ్యూటీటైం తెలుసుకుని రావాలి. ఈ ఉత్తరాలు రాత్రిదాకా చదవను" అంటూ ఆవలిస్తూ గదికెళ్ళిపోయింది లీల.

"చిరంజీవి లీలావతికి మీ తండ్రి పరంధా మయ్య వ్రాయు జాబు- నీవు క్షేమమని తలుస్తాను. ముఖ్యంగా వ్రాయడమేమంటే నీ చిన్న చెల్లి భర్త, 'వెహికల్' దసరా కాను కగా ఇవ్వాలని పోరుపెడుతున్నాడట. అమ్మాయి ఉత్తరం వ్రాసింది. ఓరోజు దాని గురించి గొడవ జరిగి అమ్మాయి దెబ్బలు కూడా తిందిట. నాకు చాలా బాధనిపిం చింది. తమ్ముడు గంగాధర్ దగ్గరికెళ్లి విషయం వివరించాను. వాడి పెళ్ళాం పోట్లాటకొచ్చింది. అంతమంది కూతుళ్లనె వడు కనమన్నాడు. అనుభవించండి. మాకు పిల్లలు లేరా, సంసారం లేదా? అంటూ పెద్ద నోరు చేసింది.

వాడసలు ఏం మాట్లాడలేదు. "చివరగా అక్క సంపాదిస్తోందికదా! డబ్బంతా ఏం చేసుకుంటుంది. పెళ్ళా? పెటాకులా? ? వెళ్ళి తెచ్చుకోండి" అంటూ నిర్మొహమా టంగా అన్నాడు.

నాకు చాలా బాధనిపించింది. మీ అమ్మ ఆరోగ్యం ఏం బాగాలేదు. ఈ నెల ఆమె మందుల ఖర్చు అయిదువందలు దాటింది. అవన్నీ ఎలాగో చూసుకోవచ్చు కానీ, ఆల్లు డిగారి కోరిక తీరకుంటే అమ్మాయికి బాధ తప్పదు. నీకు ఏదైనా లోను రూపంలోగానీ, ఎవరి దగ్గరయినా అప్పు రూపంగా కానీ పదివేలు సర్దుబాటు అవుతుందా? అవు తుందా కాదు అయితీరాలి. లేకపోతే మాకు మనశ్శాంతి ఉండదు. ఈనెల నీ జీతం... అంటే నీవు మాకు పంపే పైకంతోపాటు ఇంకో అయిదొందలు ఎక్కువ పంపించు.

ఇట్లు మీ నాన్న!"

ఉత్తరం చదివి నిట్టూర్చింది లీల. ఆ ఉత్తరం నిండా వారి సమస్యలు... డబ్బు ఇబ్బందులు. కోరికలు... చివర్లో డబ్బు పంపించు. ఇంతేకానీ. ఒంటరిగా ఊరు కొత్త... ఉద్యోగం ఎలా ఉంది? నీ సమస్య లేమిటి? తన గురించి ఒక్క పరామర్శ లేదు. వారి దృష్టిలో తనో డబ్బు సంపా దించే యంత్రమైపోయింది. అసలెందుకు వారిమీద తను జాలిపడి డబ్బు పంపాలి.

అబ్బ! తల వేడెక్కిపోతోంది. ఛీ! ఛీ! మెదడంతా పాడయిపోయింది. ఈ ఒకటో తేదీ ఎందుకొస్తుందో? ప్రతినెలా బీదఅరు పులు అరుస్తూ నాన్న దగ్గరినుంచి ఉత్తరం రావటం తను బాధపడటం అలవాటయిపో యింది. అనుకుంటూ తండ్రి వ్రాసిన ఉత్తరం పక్కన పడేసింది. సారథి ఉత్తరం చేతిలోకి తీసుకుంది. కవరు చింపి ఉత్తరం చదవసాగింది. క్రమంగా ఆమె మొహం ప్రసన్నంగా మారిపోయి పెదవులమీద దర హాసం కదలాడింది.

"లీలగారికి సారథి వ్రాయు ఉత్తరం!

మీ ఉత్తరం చేరింది. అబ్బ! ఎన్నాళ్లకు మీనించి ఓ సుదీర్ఘ లేక అందుకున్నానండి బాబూ! మీ చిన్ననాటి సంఘటనలు చదు

వుతుంటే ఓ పెద్ద రచయిత, ఓ ఇరవై ఏళ్ల కింద వ్రాసిన కథ చదువుతున్న ఫీలింగు కలిగిందంటే నమ్మండి. ఏమిటండీ అలా చూస్తున్నారు, సినిమాలో బ్రహ్మానందం చూసినట్టూ. ముఖస్తుతి కాదండీ బాబూ! మీకింత బాగా ఉత్తరాలు వ్రాయటం వచ్చి ఉండి కూడా మొదట్లో అంత నిర్లిప్తంగా వ్రాసేవారు ఎందుకని? క్రితంసారి నా ఉత్తరంలో నా పెళ్లికి మా నాన్నే విలన్ అని వ్రాసి కారణాలు కనుక్కోమని మీకు వ్రాస్తే మీ రిప్లైలో మామూలు కట్నం విషయమే వ్రాశారు. అంటే మీకు అంతుబట్టలేదన్న మాట. కొడుకు పెళ్లికి తండ్రి ఎలా విలన్ అయ్యాడో వివరిస్తాను. చదివి ఆనంది స్తారో "అయ్యో పాపం!" అంటూ బాధపడ తారో చూడండి.

ఆమధ్య అనంతపురంలో ఓ అమ్మాయి ఉంది. ఒక్కతే కూతురు. ఆస్థి ఉంది. అందం ఉంది. అంటూ పెళ్లిళ్ల పేరయ్య ఓ సంబంధం తెచ్చాడు.

"ముందు నేను వెళ్లి చూసివస్తాను" అన్నాను మా నాన్నతో. అంతే. ఇంతెత్తున ఎగిరాడు. "పెద్దవాళ్లం మేం ఉండగా ముందు నువ్వు చూసివస్తానంటావా? ఆ మాటకొస్తే మీ అమ్మను నేను కన్నెత్తి చూడకుండానే తాళికట్టి ఏకంగా శోభనం గదిలోనే చూశాను. కాకపోతే అప్పుడు నేను వేసిన కేకకి పెళ్లింట్లో అందరూ ఝడుసుకు న్నారనుకో అది వేరే సంగతి".

నాన్న ఆ మాట అంటుండగానే వంటిం ట్లోంచి నిరసన వ్యక్తం చేస్తూ ఓ గోదావరి పాత్ర బుగ్గ సొట్టపడి దొర్లుకుంటూ హాల్లోకి వచ్చింది.

"నాన్నా! నేను నీ కొడుకుని. మరీ అంత అధ్వాన్నంగా నీ శోభనం కబుర్లు నాతో చెప్పకూడదు. అమ్మకి మీ మాటలు నచ్చి నట్టు లేదు. టాపిక్ మార్చు" అన్నాను రహస్యం చెబుతున్నట్టు.

"దాని మొహం. దానికి నచ్చని పనులు చేయటమే నా జీవితధ్యేయం. అది సరే. అమ్మాయిని ముందు నేను చూసివస్తాను. నాకు నచ్చిందంటే నీకు నచ్చినట్టే. తాళి కట్టే ద్దువుగాని" అన్నాడు.

"ఒరే చంటీ! ఇలారా" అంది అమ్మ వంటింట్లోంచి.

అమ్మ కూడా ఏదో ప్రతిపాదిస్తోందని ఊహించి "ఏమిటమ్మా" అంటూ వెళ్లాను.

"ఆడవాళ్ల సంగతులు ఆడవాళ్లకే తెలుస్తాయి. మగవెధవలకేం తెలుస్తాయి. నా కాబోయే కోడల్ని ముందు నేను చూసివస్తాను. నాతోపాటు నువ్వూ వద్దువుగాని" అంది.

నేనింకా నోరు విప్పకనే మా నాన్న "ఒరే చంటీ" అని పిలిచాడు.

"చూడూ! ఈ ఇంటికోడలి సెలక్షన్ నా ఆధ్వర్యాన జరుగుతుంది. ఆడపెత్తనం అసలు జరగదు. అది గుర్తుంచుకోండి" అంటూ ఎగిరాడు.

నాకు వళ్లు మండిపోయింది. అసలు వీళ్లు నా తల్లితండ్రులా? లేక ఏ ముళ్లపొదల మధ్యనో దొరికితే పెంచుకుంటున్నారా అన్న అనుమానం వస్తూ ఉంటుంది. "అసలు నాకు పెళ్లి వద్దు" గట్టిగా అరచి బయటకెళ్లిపోయాను. మరో మూడు రోజులు అలాంటి వాగ్వివాదాలు జరిగాక అమ్మా, నాన్న, నేను ముగ్గురం... ముగ్గురు వెళ్లకూడదు కాబట్టి పెళ్లిళ్ల పేరయ్యతో నలుగురం కలిసి అమ్మాయిని చూడ్డానికి వెళ్లాం. చాలా పెద్ద ఇల్లు. ఇంటిముందు తోట. మంచి సంప్రదాయకమైన కుటుంబంలా అనిపించింది. ముందుగా అందరికీ ఫలహారాలు అందించారు. అవి తినటం పూర్త య్యాక టీ సప్లయిచేసి అమ్మాయిని మా ఎదురుగా సోఫాలో కూర్చోబెట్టారు. అమ్మాయి అందంగా ఉంది. మొదటి చూపులోనే నాకు నచ్చింది. నేను కూడా




వారికి నచ్చినట్టు వారి చూపుల ద్వారా గ్రహించాను. కాకపోతే అక్కడినించి త్వరగా బయటపడి ఉంటే, కథ సుఖాంత మయ్యేదేమో. మా నాన్నగారు, అమ్మాయి నాన్నగారు మాటల్లోదిగి... ఎక్కడినుంచో చుట్టుకువచ్చిన... ఏఏ ఊళ్లలో ఉన్న బంధుత్వాల గురించో చర్చించుకోసాగారు. అమ్మాయి అమ్మగారు మా అమ్మగారు కూడా మాటల్లో దిగారు. అమ్మాయి తాత గారు దాదాపు డబ్బాయిఏళ్ల ముసలాయన కూడా ఇటువైపు అటువైపు సంభాషణలో పాల్గొంటున్నాడు. నేను వారి సంభాషణ వింటున్నట్టు నటిస్తూ అమ్మాయివైపు దొంగ చూపులు చూడసాగాను.

ఇంతలో మా నాన్నగారు "అన్నట్టు కళ్యాణదుర్గం ప్రసాదరావు చనిపోయాడట తెలుసా? " అన్నాడు.

"ఆ! తెలుసు. ఇప్పుడెందుకులెండి ఆ ప్రస్తావన" అన్నాడు అమ్మాయి తండ్రి. "శుభమా" అంటూ పెళ్లిచూపుల తతంగంలో 'చావుకబుర్లు' ఎందుకు? అన్న భావం వ్యక్తం చేస్తూ.

నాన్న అతన్ని పట్టించుకోనట్టుగా "రక్తం కక్కుకుంటుంటే బెంగుళూరు తీసికెళ్లారట. అక్కడ వారంరోజులు నరకయాతన పడి చనిపోయాడట పాపం! మరీ అంత చాదస్తమేమిటయ్యా. అతనికేం రోగముందో పెళ్లానిక్కూడా తెలియదుట"

"అవునవును. పోయినవాడి గురించి వది లెయ్యండి. ఇంకోసారి టీ తాగలేరా? " అన్నాడు అమ్మాయి తండ్రి సహనం నశిస్తుండగా.

"అబ్బ! మధ్యలో నన్నాపకయ్యా! అతని రోగానికి యాభైవేలు ఖర్చయిందిట. రోజూ రహస్యంగా మందులు మింగేవాడుట. పెళ్లాం పిల్లలకు నిలువనీడ లేకుండా చేసి వెళ్ళిపోయాడు... నాన్న ఏకధాటిగా చెప్ప సాగాడు."

అమ్మాయి తండ్రి భయం భయంగా తండ్రివైపు చూశాడు. ముసలాయన చూపు లకర్థమేమిటో మరి, లేచి లోపలికెళ్లిపోయాడు.

ఆ తరువాత ముసలాయన లేచి నిలబడి మీ అడ్రసు ఇవ్వండి. ఉత్తరం వ్రాస్తాము అన్నాడు. "మళ్లీ ఉత్తరం దేనికీ?

అన్ని విషయాలు ఇప్పుడే మాట్లాడుకుంటే పోలా? " అన్నాడు నాన్న.

"అలా కాదు. ఇప్పుడు వర్జ్యం వచ్చేసింది. మేం ఉత్తరం వ్రాస్తాం" అన్నాడు ఖండిస్తున్నట్టు. ఇహ మీరు వెళ్ళండి అన్న ధోరణిలో, మేం వచ్చేశాం. మూడు రోజులకు వారినించి ఉత్తరం వచ్చింది.

"మీ అబ్బాయి మాకు నచ్చాడు. కానీ మీ అపశకున మాటలు ఆ ధోరణి మాకు నచ్చలేదు. అందుకే ఈ సంబంధం వదులుకుంటున్నాం." అని రాశారు, నిర్మొహమాటంగా.

ఆ విషయమై ఇంట్లో నేను చాలా గొడవ చేశాను. నాన్నలో తప్పులెంచాను. ఆయన మాత్రం తన తప్పును ఒప్పుకోలేదు.

"ఏమిట్రా? దేశం గొడ్డుపోయిందా? ఎక్కడ చూసినా ఆడపిల్లలున్నారు. ఇది కాకుంటే దీని జేజెమ్మలాంటి సంబంధం రాదూ" అంటూ నన్నే తిట్టిపోశాడు.

అలా ఆ పెళ్లిచూపుల కథ తెల్లారిపోయింది. ఇంకా ఇలాంటి సంఘటనలు చాలా ఉన్నాయి. మచ్చుకి ఇంకొకటి రాసి ముగిస్తాను. "పెళ్లిచూపుల పేరుతో మనం అమ్మాయి ఇంటికి వెళ్లి తినుబండారాలు మింగి చెడామడా వాగి భ్రష్టుపట్టడం వద్దు. సంప్రదాయానికి విరుద్ధమైనాసరే, అమ్మాయి తల్లిదండ్రులను మన ఇంటికి వచ్చి నన్ను చూసి వెళ్లమను. వాళ్లకు నేను నచ్చితే, అమ్మాయి ఫోటో చూడటమో, లేక, నేను వెళ్లటమో తర్వాత ఆలోచించుకోవచ్చు'" అన్నాను. ఎలాగో బలవంతాన

నాన్న ఒప్పుకున్నాడు. మధ్యవర్తి ద్వారా అన్నీ జరిగిపోయాయి.

అమ్మాయి తల్లిదండ్రులు, అమ్మాయి మేనమామ, ఆయన భార్య మొత్తం నలుగురు వచ్చారు. ఈ సంబంధం తప్పకుండా కుదురుతుందని పూర్తి నమ్మకం కుదిరింది నాకు. ముఖ్యంగా అమ్మాయి మేనమామ చిన్న వయసువాడవటంతో నాతో కలిసిపోయి ఫ్రీగా, 'ఫ్రెండ్లీ'గా మాట్లాడటంతో నాకు కొత్తవారన్న జంకుపోయింది. మేమంతా మాట్లాడుకుంటుండగానే పేపరు బిల్లు కట్టాలంటూ పేపరు కుర్రాడు వచ్చాడు. అతనికి ఓ ఇరవైఏళ్లుంటాయి. నేను అతనికి డబ్బు కడదామని లేచాను. అంతలో నాన్న 'నువ్వాగరా' అంటూ అరిచినంత పనిచేశాడు. "ఏమయ్యా! మీ పేపర్లో వార్తలు సరిగా ఉండవు. బిల్లుకు మాత్రం ఠంచనుగా వస్తావేం? అసలేముందయ్యా పేపర్లో? మొన్న ఓరోజు ఈ ఊళ్లో జరిగిన లారీ ప్రమాదం గురించి ఇంకో పేపరులో వేశారు. ఈ పేపర్లో మాత్రం వేయలేదెందుకు? " అనడిగాడు.

"ఆ పేపర్లో ఎలాగూ వేశారు అందరూ చదివే ఉంటారు. ఇంకెందుకు అనుకున్నారేమోనండి" అన్నాడా కుర్రాడు నవ్వు దాచుకుంటూ. గదిలో కూర్చున్న నలుగురూ కిసుక్కుమన్నారు.

"ఏం జోకులేస్తున్నావా? తమాషాగా ఉందా? అంతకుముందోరోజు లాటరీ టికెట్టు బంపరు బహుమతి ఫలానా నంబరుకని వేసి, మరుసటిరోజు ఆ నంబరు కాదు, ఈ నంబరు అని రాస్తాడా? అంటే టికెట్టు కొన్నవాడు ఏమయిపోవాలి చెప్పు! ఇక ఉష్ణోగ్రత వివరాలలో ఈ ఊరి ఉష్ణోగ్రత రాయరు. అంతకుముందోరోజు ఒకే ఊళ్లో జరిగిన ఒక హత్య గురించి తల నరేకేశారు అంటూ వేశారు. ఇంకో పేపర్లోనేమో బుర్రబద్దలు కొట్టారు అని రాశారు. ఎవరినని నమ్మాలి? ఏది నిజమనుకోవాలి? ఆc...? " అరిచాడు నాన్న.

"చచ్చింది మాత్రం నిజమేకదాండి" అన్నాడా కుర్రాడు అసహనంగా.

"ఈ నెల పేపరు బిల్లు కట్టను. మీ ఎడిటర్‌కు చెప్పుకో పో! వార్తలు సంతృప్తికరంగా ఉంటే తప్ప కట్టనుగాక కట్టను"

"సార్! పేపర్లో వార్తలకు, నాకూ ఏం సంబంధం లేదండి. నేనూ మీలాగా రోజూ పేపరు చదువుతానే తప్ప విలేఖరినిగానండి. ఇంటింటికి పేపరు వేస్తే నాకు జీతం వస్తుంది తప్ప మిగతా విషయాలేవీ నాకు తెలియవండి. మీరిప్పుడు బిల్లు ఇవ్వకపోతే, నాకు జీతం కట్ అవుతుంది సార్" అన్నాడా కుర్రాడు దీనంగా.

మా నాన్నకు నచ్చచెప్పి శాంతింపచేసి బిల్లు కట్టించేసరికి తలప్రాణం తోకకొచ్చిందనుకోండి. అంతే! ఆరోజు వెళ్లిన పెళ్లివారు మళ్లీ ఇటువైపు చూడలేదు. మధ్యవర్తి వచ్చి మీ సంబంధం వారికిష్టంలేదట. కారణమేమిటంటే సంబంధం లేని పేపరు కుర్రాడికే లేని తప్పులు ఆపాదించి అరగంట క్లాసు తీసుకున్నాడు. రేపు కోడలు వస్తే... అందులోనూ కొత్త కాపురం... ఏదైనా తప్పు చేస్తే ఈయన బతకనిస్తాడా? వద్దు బాబూ" అన్నారుట.

ఏమిటండీ లీలగారూ! విపరీతంగా బోరు కొట్టిస్తున్నానా? ఇదండీ నా పెళ్లి పెళ్లిచూపుల భాగోతం. ఈ జీవితంలో నేను ఒడ్డున పడేట్టు లేనండి. ఉంటామరి. మీ జీవితచరిత్ర బాల్యందాటి యవ్వనంలోనికి ప్రవేశించాక సస్పెన్స్‌లో పెట్టి ముగించారు. కంటిన్యూ చేస్తారుకదూ! మీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ... సారథి."

నవ్వుకుంది లీల! టైం చూసింది. రాత్రి పదిదాటింది. ఇప్పుడప్పుడే నిద్ర వచ్చేలా లేదు. ఉత్తరం రాసి నిద్రపోతే పోలా?




అనుకుంటూ టేబిల్ ముందు కూర్చుని వ్రాయసాగింది.

"సారధిగారికి నమస్కారం. మీ ఉత్తరం అందింది. మీ నాన్నగారి గురించి రాశారు. పెద్దవాళ్లు ఏదో చాదస్తం. అంతమాత్రాన మీకిక పెళ్లే కానట్టు, ఒడ్డునపడలేనన్నట్టు, కొండలు గుట్టలు పట్టుకుని, శాలువా కప్పుకుని ఆకాశంవైపు చూస్తూ పాటలు పాడేస్తే ఎలాగండి.

మీరు వింటానంటే నాదో సలహా! మీనాన్నగారి వెంట పెళ్లిచూపులకు వెళ్లటం మానేసి ఎవరినైనా లవ్ చేయండి. ఈ అమ్మాయేమిటి బరితెగించి సలహాలిస్తున్నదని అనుకుంటున్నారా? మీ స్థితిలో ప్రేమ వివాహమే మంచిదని నా అభిప్రాయం. సరే! ఇకపోతే నా చరిత్రకు సంబంధించిన తాళపత్రగ్రంధాలు విప్పుతున్నాను చదవండి. మొన్నటి ఉత్తరంలో నాకు పెళ్లి కుదిరిందని రాశానుకదూ! అతికష్టంమీద నాకు పెళ్లి కుదిరింది. యాభైవేలు నగదు, 50 గ్రాముల బంగారం, ఆడపడుచులాంఛనాలు, పెళ్లి వైభవంగా జరగాలి. మంచి కళ్యాణమంటపంలో నాలుగురకాల స్వీట్లు, అయిదురకాల కూరలతో భోజనం, వెళ్లేటప్పుడు అందరికీ తాంబూలంలో రవిక ముక్క... ఇలా మొత్తం పెళ్లి ఎలా జరగవలసినది దాని గురించి డైరెక్షన్ అంతా చెప్పేశారు.

నాన్న ఒప్పుకున్నారు. అమ్మ కోపంతో చిందులు తొక్కింది. ఇంత కట్నం తీసుకుని వెధవ ఏ గవర్నమెంటాఫీసులోనైనా కాఫీలు అందించే ఉద్యోగం చేస్తేనన్నా సంతోషపడిపోదుము. ఏ ఉద్యోగమూ, సద్యోగమూ లేదు. మనమిచ్చే కట్నంతో భవిష్యత్తులో వ్యాపారం చేస్తాడట. కేవలం మగపుట్టుకకే ఈ కట్నం అంతానూ కూడబెట్టినంతా ఒక్కదానికే ఖర్చుపెడితే మిగతా ఇద్దరి మాటేమిటి? పిల్లాడి భవిష్యత్తు ఏమిటి? అంటూ అమ్మ ఒకటే నస.

పెళ్లి ఇంకా పదిరోజులుందనగా ఓరోజు రాత్రి నాన్న అమ్మను ఓదారుస్తూ "నువ్వు ఊరికే నసపెట్టక. దాని జాతకం చూపించాను. అది ఇల్లు వదిలితే తప్ప మనం బాగుపడమట. అత్తవారింటికి మేలు. పుట్టింటివారికి కీడూనట. అందుకే దాన్నెలాగైనా పంపించెయ్యాలని భారమైనా ఇంత కట్నానికి ఒప్పుకున్నాను" అంటున్నాడు.

నేను మ్రాన్పడిపోయాను. అసలు వీళ్లు నా తల్లిదండ్రులేనా? నేనింత భారంగా తయారయ్యానా వీరికి! కన్నీటితో దిండు తడిసిపోయింది. మనసు కకావికలమైపోయింది.

"అదేమిటి పెళ్లి దగ్గరపడుతున్నకొద్దీ మొహంలో కళ తగ్గిపోతోంది. అమ్మా నాన్నలను వదిలివెళ్లాల్సివస్తుందనా?" అంటున్నారు ఇంటికొచ్చిన బంధువులు.

నేను అమ్మా నాన్నల మొహాలవైపు చూశాను. వాళ్లు నా చూపులను తప్పించుకోటానికి అన్నట్టుగా ఏటో చూస్తూ ఏదోపని పురమాయించారు. మనసులో నవ్వుకున్నాను. తెల్లవారితే పెళ్లి. ఆ రాత్రి పెళ్లికొడుకు బాజాబజంత్రీలతో విడిదిల్లు చేరాడు. మర్యాదలు, వడ్డనలు ఘనంగా జరిగాయి. ఆ రాత్రి పన్నెండుగంటలకు పెళ్లికిముందు భాగంగా తాంబూలాల శాస్త్రం అనే పద్ధతి ఉందిట. ఆ పద్ధతిలో పెళ్లికొడుకువారు నా కోసం రెండు పట్టుచీరలు, అయిదు రవికలు, వక్కలు, ఆకులు, కొబ్బెర, పప్పులు అన్నీ తెస్తారుట. వాళ్లు తెచ్చిన పట్టుచీర నాకు కట్టించారు. వక్కలు, ఆకులు, పూలు, పండ్లు అన్నీ నా ముందు ప్లేట్లలో ఉంచారు. ముత్తయిదువలు ఒక్కొక్కరే వచ్చి నాకు పసుపురాసి బొట్టు పెట్టి వెళుతున్నారు. ఎవరో పాట కూడా పాడుతున్నారు. ఇంతలో ఏదో వాదన వినిపించింది. అది వాదన కాదు పోట్లాట అని రెండు నిమిషాల్లో తేలిపోయింది. వాళ్లు నా

కోసం తెచ్చిన పట్టుచీర ఖరీదు తక్కువ అంతకట్నం పుచ్చుకున్నారుకదా. ఓ పది వేల రూపాయలు పెట్టి తెచ్చి ఉండకూడదా? అని మా తరపువారు అన్నారట. అది పెళ్లికొడుకు తరపువారికి నచ్చలేదుట. మేం పెళ్లికొడుకువారం. పదిరూపాయల చీర తెచ్చినా నోరు మూసుకుపడుండాల్సిందే తప్ప పేర్లు పెట్టకూడదు అన్నారట. బోడి పెళ్లికొడుకు దమ్మిడీ సంపాదన లేనివాడు కట్నం చూస్తే బోలెడు అని మావాళ్లు అన్నారట. అంతే రోషాలు, కోపాలు, ఆవేశం, మగవాళ్లు కాలర్లు, ఆడవాళ్లు జుట్టు పట్టుకున్నారు. ఏవరో వచ్చి విడిపించారు. అమ్మా నాన్న బతిమిలాడినా ఈ సంబంధం మాకొద్దంటూ రాత్రికిరాత్రే విడిదిల్లు ఖాళీచేసి వెళ్లిపోయి మర్నాడు అదే ముహూర్తానికి వాళ్ల ఊరిలోనే అంతకు ముందు చూసివద్దన్న అమ్మాయిని తెచ్చి పెళ్లిచేశారుట.

అంత పోట్లాట జరిగినా, పెళ్లికొడుకు కథ సుఖాంతం అయింది. ఏటొచ్చీ నేను... నా కథ మళ్లీ మొదటికొచ్చి దుఃఖాంతమైంది. పెళ్లికి చేసిన తినుబండారాల ఖర్చు, తెచ్చిన వస్తువులు. అమ్మో... తలచుకుంటే ఇప్పటికీ భయమేస్తుంది. అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. నెలరోజులయినా జరిగిన సంఘటన గూర్చి మరచిపోలేకపోయాం.

అమ్మ నేను ఏదో నేరం చేసినట్టు నాతో మాట్లాడటం మానేసింది. ఈసడించుకునేది. నాన్న కూడా పొడిగా సమాధానం చెప్పేవాడు. "మన నెత్తిన శని వదలనంటోంది. ఇది ఎన్నేళ్లుంటుందో" అంటూ అమ్మ సూటిపోటి మాటలంటుంటే భరించలేకపోయేదాన్ని. నిజం చెప్పొద్దూ. ఓసారి నాకు చచ్చిపోవాలనిపించింది కూడా.

సరిగ్గా అప్పుడే నాకో అమ్మాయితో స్నేహం కుదిరింది. మా పక్కింట్లో అద్దెకు చేరారు.

ఆ అమ్మాయి కాన్వెంటులో టీచరు ఉద్యోగం చేస్తోంది. ఇంట్లో ఈ నస భరించటంకంటె ఏదో ఒక వ్యాపకంతో బయట గడిపేస్తే హాయిగా ఉంటుందనిపించి ఆ అమ్మాయి సహాయం కోరాను. వారంలోగానే నాకు ఉద్యోగం సంపాదించి పెట్టిందా అమ్మాయి. జీతం అయిదువందలు. నాన్న వెళ్లమన్నాడు. అమ్మ ముభావంగా ఉండిపోయింది. ఆరోజునించి నా ప్రపంచం మారిపోయిందనే చెప్పాలి. పగలంతా పిల్లల మధ్య టైం తెలిసేది కాదు. సాయంకాలం ఇంటికిచేరి ఏదో కాస్త పనులుచేసి తినిపడుకునేదాన్ని. ఆరు నెలలు గడిచిపోయాయి. ఓరోజు ఉదయంనించి ఇంట్లో హడావిడి మొదలయింది. అమ్మా నాన్నలనడిగినా సరైన సమాధానం రాదని తెలిసి చెల్లెళ్లనడిగాను. పెళ్లిచూపులకెవరో వస్తున్నారట.

"పెళ్లిచూపులకొస్తున్న సంగతి నాతో చెప్పక్కర్లేదా? స్కూలుకు సెలవు పడేసేదాన్ని కదా? ఉన్నట్టుండి ఇప్పుడు సెలవంటే కరస్పాండెంట్ ఒప్పుకోరు. అదేం గవర్నమెంటు ఉద్యోగమా?" అన్నాను కాస్త కోపంగా.

అక్కడే ఉన్న తమ్ముడు వెంటనే కలుగజేసుకున్నాడు.

"ఏం తల్లీ! అంతగా ఫీలయిపోతున్నావు. పెళ్లిచూపులు నీక్కాదు. చిన్నక్కకు. ఒకసారి పీటలమీది పెళ్లి చెడిపోయాక నిన్ను చేసుకోవటానికి ఏ తలమాసిన వెధవ వస్తాడు?" అన్నాడు రకీమని.

అమ్మా, నాన్న ఇద్దరూ వాడి మాటలు వింటున్నారు. ఎవ్వరూ మందలించలేదు. నాకు దుఃఖం తన్నుకొచ్చింది. కోపం కట్టలు తెంచుకుంది. "పీటలమీది పెళ్లి ఆగిపోవటానికి కారణం నేనట్రా పనికిమాలిన వెధవా? పిల్లముండావాడివి నోరు మూసుకు పడుండు లేకుంటే చెప్పుచ్చుకు కొడతాను.

 

అయినా పెళ్లికావాలని ఇక్కడెవరూ ఏడవ టంలేదు" అంటూ తిట్టిపోశాను.

అంతదాకా ఊరుకున్న అమ్మ, " ఏమిటే జెష్టముండా! మగపిల్లాడిని పట్టుకుని అంత లేసి మాటలంటావా? ఎద్దులాగా ఇంటి మీద పడి మేస్తున్నది చాలదా? ఏజన్మలో ఏంపాకీ చేశామో ఆడమేళంతో చస్తున్నాము"

అంటూ నన్ను జుట్టు పట్టుకుని ఈడ్చి కొట్టింది. చెల్లెళ్లు అడ్డుపడితే వారినీ కొట్టింది. నాన్న కూడా "పెద్దదాని వి. కాస్త ఓర్పుండక్కర్లేదా? చిన్నవాడు వాడేదో వాగితే వాగుతాడు" అంటూ నాకే బుద్ధిచెప్పబోయాడు. కోపం, అసహ్యం, జాలి, అసహనం, దుఃఖం ఏకకాలంలో మిళితమై జీవితం మీదే విరక్తి పుట్టింది. కన్నతల్లి తండ్రులు, ఇలా పరాయివాళ్లలా... వేరు చేసి మాట్లాడి బాధపెడితే ఏ కూతురి మనసు తట్టుకుంటుంది. చచ్చిపోతే...? చచ్చి ఏంసాధిస్తాను? బ్రతికి ఎవర్ని ఉద్ధరిస్తున్నాను? ఇలా... తర్జన భర్జన ఆలోచనలతో ఆరోజంతా స్కూల్లోనే ఉండిపోయి సాయంకాలం ఇల్లు చేరాను.

నేను వచ్చేసరికి ఇంటి వాతావరణమే మారిపోయింది. అందరి మొహాలు సంతోషంతో కళకళలాడుతున్నాయి. పెద్ద చెల్లికి తక్కువ కట్నంతో సంబంధం కుదిరిందిట. నెలలోపలే లగ్నాలు పెట్టుకుంటారుట. నా మనసు కూడా సంతోషించింది. కానీ, దాని పెళ్ళిలో... నన్ను చూసి అందరూ ప్రశ్నలెయ్యరా? వీళ్లేమని సమాధానం చెబుతారు? వీళ్లకెంత ధైర్యం. అప్పటి సంగతి సరే! ప్రస్తుతం నా మానసిక పరిస్థితి తల్లిదండ్రులుగా వీళ్లు ఆలోచించరా? వాళ్లు ఆలోచించరు. పిచ్చిదానిలా వాళ్లను గురించి నేను ఆలోచిస్తున్నాను. వాళ్ళు నన్ను ప్రేమించాలని... వాళ్లు నా గురించి ఆలోచించాలని... నా గురించి బాధపడాలనీ... నేను ఆలోచిస్తున్నాను. అసలు నేను వాళ్లకు పుట్టలేదన్నట్టు నామీద వారి నిర్లక్ష్య ప్రవర్తన నన్నెంతగా బాధించింది. నేనెంత బాధ పడినా చేసేదేంలేదు. అదే మగవాడినైతే ఇల్లు విడిచి పారిపోయి ఎక్కడో బ్రతికేద్దును. వయసులో ఉన్న ఆడపిల్లను, ఎక్కడికెళతాను? పెళ్లి బ్రతకలేను. ఉంటే బ్రతకనివ్వరు. నాకిపుడు ఓదార్పు కావాలి. ప్రేమకావాలి. లాలింపు కావాలి. నాకోసం బాధపడే మనిషి కావాలి. ఆ సమయంలో నేనుకాక మరో సగటు ఆడపిల్లయితే ఏంజరిగేదో మరి. నేను మాత్రం నన్ను నేను కంట్రోలు చేసుకున్నాను.

పెళ్లి ఇంకా పదిరోజులుందనగా నాకు కండక్టరు ఉద్యోగం వచ్చింది. ఉద్యోగం వస్తుందని ఇంట్లో వాళ్లెవ్వరూ ఊహించలేదు. పెళ్ళి సమయంలో నేనక్కడ ఉండకుండా ఏఊరికైనా పంపుదామని వాళ్లలో వాళ్లు గుసగుసలాడుకుంటున్న సమయంలో పెట్టే బేడా సర్దుకుని, ఉద్యోగం నెపంతో, తల్లిదండ్రులే శత్రువులయిన ఆ ఇంటిని వదలి... వచ్చేశాను. నేను వచ్చేస్తుంటే, పజిల్ పూర్తయినట్టు వారి మొహాల్లో సంతోషాన్ని ఆరోజు నేను చూశాను.

సారథిగారూ! నాజీవితంలో అలా ఓ అధ్యాయం ముగిసింది. మలుపు తిరిగిన ఈ జీవితం నాకెంతో తృప్తిగా ఉంది. ఇందాక అన్నాను చూడండి. నాకు ఓదార్పు కావాలి. ప్రేమకావాలి. లాలింపు కావాలి అని. అవన్నీ నాకీ ఉద్యోగంలో లభించాయి. నా ఈ ఉద్యోగాన్ని మనస్ఫూర్తిగా ప్రేమించాను. గౌరవిస్తున్నాను. ఈ ప్రయాణంలో ఎన్ని ఒడిదుడుకులున్నా, అన్నింటిని అధిగమించే శక్తి అలవర్చుకున్నాను. ఆలోచించటానికి కూడా వ్యవధిలేని ఈ ప్రయాణం నాకెంతో తృప్తినిస్తోంది. ఉత్తరం ముగిస్తున్నాను.



ఇట్లు: లీల



"ఈరోజు బంద్ అంటూ అనౌన్స్ చేస్తున్నారుకదండీ, డ్యూటీ వేశారేమిటీ?" అంటూ అడిగింది సరోజ సహోద్యోగినితో.

"ఏమిటో మరి, ఏ బంద్ అయినా ఉదయం పన్నెండు దాకానే స్ట్రిక్టుగా జరుగుతుంది. ఆ తర్వాత ఎవరి దారి వాళ్లదే. ప్రజలు ఇబ్బంది పడతారు. అసలే పల్లెటూళ్లకు సింగిల్ బస్సులాయె. మధ్యాన్నంనించి బస్సులు నడపాలంటూ యం.డిగారు కబురు పంపారుట" అందామె.

"అలాగా! ఎలాగూ బంద్ కదా! డ్యూటీ ఉండదు. రెస్ట్ తీసుకుందామనుకొంటిని సరే తప్పేదేముంది" అంటూ వ్యానిటీ బ్యాగు సర్దుకుని డిపోవైపు వెళ్లింది సరోజ నిరుత్సాహంగా.

బంద్ మూలంగా ప్రయాణికులు తక్కువగా ఉన్నారు.

ఒక ట్రిప్పు ఏ ఆటంకం లేకుండా వెళ్లివచ్చింది.

రెండో ట్రిప్పుకు, ఒక పల్లె దాటింతర్వాత అడవిమార్గంలో కొంతమంది దుండగులు బస్సు కడ్డం నిలిచి ఆపేశారు.

వారి చేతుల్లో పెట్రోలు డబ్బాలున్నాయి.

సరోజకు పరిస్థితి అర్థమైంది.

డ్రయివర్‌ను లాగి కిందకు దింపారు.

ప్రయాణికులందరిని దిగమని కేకలేస్తే అందరూ భయంతో దిగేశారు.

బస్సుపైన లోపల పెట్రోలు చల్లి అంటించేశారు.

డ్రయివరు, సరోజ వారిని అలాంటిపని చేయవద్దని, బస్సు నడిపినందుకు క్షమించమనీ ప్రాధేయపడ్డారు. వాళ్లు వినలేదు సరికదా "ఎక్కువ మాట్లాడారంటే మిమ్మల్ని కూడా మంటల్లోకి తోయాల్సి ఉంటుంది" అని బెదిరించారు.

చేసేదేంలేక నిస్సహాయంగా అలా చూస్తుండిపోయారు. బస్సు తగలబడగానే నినాదాలు చేస్తూ వెళ్లిపోయారు.

ఎర్రటి ఎండ. ప్రయాణికులు దాదాపు ముప్పై మందికి పైగా ఉన్నారు.

"అన్యాయంగా బస్సు తగలబడిపోయింది. బంద్ రోజున బస్సు లెందుకు నడపాలి"

"ఎంత నష్టం! వీళ్ల సొమ్మేం పోయింది. ఎవడో నష్టపోయేవాడు పోతాడు. బస్సు అన్యాయమైపోయింది"

"బస్సు అన్యాయమైపోతే పోయింది. ముందు ఈ ఎండలో మన న్యాయం చూసేదెవరు?"

"ఏమయ్యా డ్రయివరూ మా సంగతేమిటి? ఎక్కడా గాకుండా అడవిలో వదిలేస్తిరి. బస్సులేదంటే నోరు మూసుకుని ఉండేవాళ్లం. ఎవరు నడపమనిరి. ఈ కుక్కసావు ఎవరు పడమనిరి"

"ఏమమ్మో! కండక్టరమ్మా చెట్టుక్రింద పోయి అట్లకూసుంటివి! మాసంగతి సెప్పు"

ప్రయాణికులు తలోవిధంగా మాట్లాడుతుంటే చిర్రెత్తుకొచ్చింది సరోజకు.

"మమ్మల్నేం చెయ్యమంటారు. మేమూ





మీతోపాటే ఉన్నాంకదా! మిమ్మల్ని వదిలి మేము పుష్పక విమానం ఎక్కిపోతు న్నామా? " కసిరినట్టు అంది సరోజ. డ్రయి వరు సరోజ దగ్గరకొచ్చి "అలా విసుక్కోకూ డదమ్మా. కాస్త ఓర్పుండాలి. ప్రయాణీకు లను గమ్యం చేర్చాల్సిన బాధ్యత మనదే కదా" అన్నాడు మెల్లిగా ఆమెకు మాత్రమే వినిపించేలా.

"ఎలా చేరుస్తామన్నా, ఈ రూట్లో ఎద్దుల బండ్లు తప్ప ఇంకొకటి తిరగవు. ఇంకాసేప టికి చీకటి పడుతుంది. అప్పుడవి కూడా తిరగవు. ఈ కాస్త సేపు బస్సులు నడప కుంటే ఏంపోయింది. పెద్ద వాళ్లంటాము కానీ వాళ్లకసలు బుర్ర పనిచెయ్యదు. ఇమ్మీడియట్‌గా ఏ వైర్‌లెస్ ఫోనో చేసి ఈ పరిస్థితి తెలపటానికి మనం పోలీసు వారిమేం కాదాయె. బిక్షగాళ్ల మాదిరి రోడ్డున పడ్డాము" అంది కోపంగా సరోజ.

డ్రయివరు ఆమె కోపాన్ని అర్ధంచేసుకు న్నాడేమో. ఆమెను శాంతపరిచే ప్రయత్నం మానేసి ప్రక్కనున్న పల్లెకు వెళ్లి రెండు మూడు ఎడ్ల బండ్లను మాట్లాడి, ప్రయాణి కులను ప్రక్కన పల్లెకు చేరుకోమని చెప్పి, ఒక బండిలో తాను సరోజ టౌను చేరుకు న్నారు. అంతా జరిగేసరికి రాత్రి పది దాటింది.

బస్సు దగ్ధం గురించి డిపోలో తెలిపి, పోలీసు కంప్లయింటు, అన్ని హంగామాలు పూర్తయి సరోజ ఇల్లు చేరేసరికి రాత్రి పద కొండయింది. మధ్యాహ్నంనించి భోజనం లేక, ఎండలో టెన్షన్‌తోనూ, సరోజ బాగా అలసిపోయి జ్వరంతో మూడు రోజులు లేవలేకపోయింది. లీలకి సంగతి తెలిసి సరోజను పరామర్శించటానికి వెళ్లింది. బస్సు దగ్ధం గురించి అంతా వివరంగా చెప్పి "నేనీ ఉద్యోగం చెయ్యలేనుబాబూ, ఈ కండక్టరు ఉద్యోగం చెయ్యటం కన్నా నాలుగు రోడ్ల కూడలిలో బజ్జీలుచేసి అమ్మటం మేలు. అదీగాకుంటే ఏ కాన్వెంటు లోనో పిల్లలకు నాలుగు అక్షరం ముక్కలు నేర్పిస్తే పుణ్యమైనా వస్తుంది. వెధవ ఉద్యోగం వెధవ ఉద్యోగమాని, ఛీ,ఛీ! ఒక్క రికంటే ఒక్కరికి, కండక్టరంటే గౌరవంలేదు. మొరటు మొహాల మధ్య ఒక రోజా? రెండురోజులా? రోజూ ఎక్కేబస్సు దిగే బస్సు ఈ ప్రయాణంతో ప్రాణం సొమ్మసిల్లిపోతోంది. అయినా ఓర్చుకుని ఎలాగో రోజులు నెట్టుకొస్తున్నాను. వారంరో జులు ప్రయాణం సజావుగా సాగింది అంటే, ఒకరోజు ప్రయాణం చావగొడుతుంది. అదే మిటో ఆడపిల్ల కండక్టరుద్యోగానికి పనికిరా నట్టు ఎగతాళిమాటలు నిర్లక్ష్యపు చూపులు... గౌరవమే ఇవ్వరు..." అంటూ ఏకధాటిగా మాట్లాడుతున్న సరోజ నోటికి అడ్డుకట్టవేస్తూ... "కష్టపడి సంపాదించు కుని చేస్తున్న నీ ఉద్యోగం మీద నీకే గౌరవం లేదు. మిగతావాళ్లు గౌరవించరని ఏడుపెందుకు? " అంది లీల సీరియస్‌గా.

"ఓహ్! నాఉద్యోగాన్ని నేను గౌరవించటం అంటే ఏమిటి తల్లీ రోజూ ఈకోటుకు ఆ వ్యానిటీ బ్యాగుకు, ఆ ట్రేకు, ఈ ఐడెంటిటీ కార్డుకు కాస్త పసుపు కుంకుమ పెట్టి పూలు చల్లాలా? " అంది వెటకారంగా సరోజ.

"అదిగో ఆ వెటకారమే వద్దు! నీఉద్యో గాన్ని గౌరవించటం, ప్రేమించటం అంటే పూజ చేయటంకాదు. ఉద్యోగం అంటే కేవలం నీకు తిండి సంపాదిస్తున్న ఉపాధి మాత్రమే అనుకుంటే పొరపాటు. ఉద్యోగం వల్ల నీకు ఉపకారం జరిగినట్టే... నీవల్ల ప్రజలకు... సంస్థకు, దేశానికి కూడా మేలు జరగాలి. చదువుకున్న నీవు అది మరిచి పోయి ఒక నిరక్షరాస్య స్త్రీలాగా మాట్లాడు తున్నావు. మనం చేసే ఈ వృత్తిని గౌరవిం చాలి. ప్రేమించాలి. అప్పుడు ఎలాంటి సమస్యనయినా సులువుగా పరిష్కరించ



వచ్చు. అలా గాకుండా వృత్తినే దెయ్యం అని, అనుక్షణం ఈసడించుకుంటుంటే అది మనల్ని భూతంలా భయపెట్టకమానదు. నిలకడలేని మనస్తత్వం అలవర్చుకుంటే నువ్వు ఏ ఉద్యోగంలోనూ నిలబడలేవు. రాణించలేవు" అంది లీల.

"అమ్మా, లీలావతీ! ఉపన్యాసం ముగిసిందా? సోడా తెప్పించమంటారా? ఒక్కసారి నేను వెళ్లే రూటుకు వచ్చి ఓ రెండురోజులు తిరుగు... ఆ ప్రయాణీకుల మాటలకు తల తిరిగి పడిపోతావు"

"అలాగా! డి.యం.గారితో చెప్పి రూటు మార్చుకుందాం! ఎక్కడైనా అదే మనుషులే కదా! నారూట్లో నీవు తిరిగితే మూడోరోజు రిజైన్ చేస్తావు. మొన్నటికి మొన్న ఒక దగుల్బాజీ... చూడ్డానికి పెద్దమనిషిలాగా ఉన్నాడు. మానాన్న వయసుంటుంది. నాప్రక్కన కూర్చున్నాడు. పెద్దాయన కదా అని ఊరుకున్నాను. నాపని నేను చేసుకుంటూ టికెట్లు లెక్కపెట్టుకుంటున్నాను. "ఈ కండక్టరు ఉద్యోగం చేసే ఆడదాన్ని పెళ్లెవరు చేసుకుంటారు. నాపెళ్లాం అనారోగ్యం మనిషి.. నిన్ను పర్మనెంటుగా ఉంచుకుని తోట రాసిస్తాను. తోటలో ఓ పాకకూడా వేసిస్తాను. నాతో వచ్చెయ్యి" అన్నాడు. నాకు రక్తం ఉడికిపోయింది. నేను సమాధానం చెప్పేలోపునే "రేపు ఏ సంగతీ చెప్పు" అంటూ దిగిపోయాడు.

"పళ్లు రాలగొట్టలేకపోయావా? నేనయితే చెప్పుతో కొట్టేదాన్ని" అంది సరోజ.

"నాకాళ్లకీ చెప్పులున్నాయి. కొట్టటం చాలా సులభం. ఆ తర్వాత పరిణామాలను కూడా ఎదుర్కునే బలగం ఉండాలి కదా మనకు. ఇదేమయినా తెలుగు సినిమా కాదుకదా? పగ ప్రతీకారం అంటూ వీరనారి పోజుపెట్టి గొడ్డలితో నరికి శుభం పలకటానికి"

"ఇంతకీ ఏం జరిగింది? " ఉత్సుకతతో అడిగింది సరోజ.

"ఏం జరుగుతుంది. మరుసటిరోజు సింగారించుకుని బస్సెక్కి మళ్లీ పక్కన

కూర్చున్నాడు. నాకు వళ్లు మండిపోయింది. కోపాన్ని నిగ్రహించుకున్నాను.

"నేను చెప్పిన విషయం ఏ మాలోచించావు" అన్నాడు మీసాలు దువ్వుకుంటూ.

"నిన్న నేను మాట్లాడేలోపు మీరు బస్సు దిగిపోయారు బాబాయిగారూ. నెల క్రిందట నాకు పెళ్లయింది. రిజిస్టర్ మ్యారేజి. మావారు ఫలానా మంత్రిగారి పి.ఎ.కు వేలు విడిచిన మేనమామ కొడుకు. రిజిస్టరాఫీసులో సాక్షి సంతకాలు కూడా మంత్రిగారే పెట్టారు. అంటూ మొహం మీదికి బలవంతంగా నవ్వుతెచ్చుకుని ఆత్మ సంరక్షణార్థం నోటికొచ్చిన మంత్రి పేరు చెప్పేశాను. అంతే! మొహం, గంటు పెట్టుకుని లేచి వెళ్లి వేరే సీట్లో కూర్చున్నాడు. ఆ రోజునుంచి మళ్లీ రెండుమూడు సార్లు బస్సెక్కాడు. కానీ నోరెత్తితే ఒట్టు. అదీ సంగతి. రకరకాల మనుషులు, మనస్తత్వాలు మన ఈ ప్రయాణంలో తగులుతూనే ఉంటారు. ఎలాగో దాటుకుని వెళ్లాలి గానీ భయపడి పారిపోకూడదు. రెచ్చిపోయి, సమస్యలు సృష్టించుకోకూడదు" అంది లీల.

"సరేలే! అందరికీ నీలా ఓర్పు, సమయస్ఫూర్తి ఉండాలికదా! ఓ నెల క్రిందట నన్ను సాటి ఆడదని కూడా జ్ఞానం లేకుండా టికెట్టు తీసుకోటానికి చిల్లర ఇవ్వకపోగా, నేను "చిల్లర ఇవ్వకూడదా! మూడు రూపాయల టిక్కెట్టుకు ఇరవై రూపాయల నోటిస్తే ఎలాగ?" అన్నాను. నా మాట ఇంకా పూర్తికాకముందే "నాకదంతా తెలీదమ్మో! చిల్లరంతా చేతిలోపెట్టు. టికెట్టు ఎనకాల రాయద్దు. ఇంతకుముందొకసారి ఒక కండక్టరు రెండు రూపాయలు టికెట్టు వెనకాల రాసిచ్చి బస్సు దిగిపోయేముందు ఇస్తాను అన్నాడు. సరే కదాని అనుకుంటే బస్సు ఆగగానే ఎక్కడికెళ్లి, ఏ హోటల్లో దూరాడో పత్తాలేడు. తూ... కక్కుర్తి మొఖం నాయాలు" అంటూ నోటికొచ్చినట్టు

తిట్టిపోసింది. అలా నోరు పారేసుకోవద్దు. అతనేం పనిమీద వెళ్లాడో... ఏమిటో.. ఇంకా కాసేపాగితే అతను బస్సు దగ్గరికి రాకపోయాడా? అయినా ఆ కండక్టరు గురించి నాకెందుకు చెబుతున్నావు... ఇపుడు నా దగ్గర చిల్లరలేదు. టికెట్టుకు సరిపడ చిల్లర ఉంటే ఇవ్వు. లేదా నేనూ టిక్కెట్టు వెనకాల రాసిస్తాను. దిగేముందు తీసుకో!" అన్నాను సీరియస్‌గా.

"వాయమ్మో! వద్దులే..." అంటూ బొడ్లో ఉన్న మూడు రూపాయలు తీసిస్తుంటే వళ్లు మండిపోయి "చిల్లర ఉంచుకుని అవతారం పడతావా" అన్నాను కోపంగా.

"ఏందమ్మో! మాటలు మట్టసంగ మాట్లాడు" అంటూ పోట్లాటకు దిగింది. యాభై కేజీలకు పైగా ఉన్న ఓ బస్తా వెంట తెచ్చి నడవలో వేసింది. దానికి లగేజి టిక్కెట్టు ఇవ్వనంటుంది. "లగేజీ టిక్కెట్ల డబ్బులన్నీ కండక్టర్లే జేబులో వేసుకుంటా రంటగదా! యాభై పైసాలిత్తాలే!" అంది. అపుడు నా పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించు. ఆమెతో లగేజీ టిక్కెట్టుక డబ్బులు రాబట్టడానికి ప్రయాణీకులు కూడా కల్పించుకుంటే తప్ప రాలేదు. కండక్టర్లు ఎంత చులకనగా చూడబడుతున్నారో చూశావా? " అంది సరోజ.

"ఇవన్నీ మామూలే 'తిలా పాపం తలా పిడికెడు' అన్నట్టు ఎవరో ఒకరిద్దరు చిల్లర కక్కుర్తి పనులు చేస్తుంటారు. అది ప్రజల దృష్టిలో పడుతుంది. మొత్తం ఆ ఉద్యోగస్థు లందరినీ ఒకే గాటికి కట్టేసి మాట్లాడతారు. చులకనగా చూస్తారు. మన మట్టుకు మనం ఏ తప్పూ చెయ్యకుండా నిజాయితీగా ప్రయాణం చేస్తుంటే ఇలాంటి మాటలు.. చేతలు.. ఎన్ని భయపెట్టినా భయం ఉండదు" అంది లీల.

"కరెక్టుగా చెప్పారండి లీలగారూ! ఏదైనా వివరించి చెప్పాలంటే మీకు మీరే సాటి సుమండీ!!" అంటూ రంగప్రవేశం చేశాడు ఆనందరావు.

"మీరెప్పుడు వచ్చారు? ఎలా వచ్చారు? " అంది సరోజ.

"లీలగారి 'తిలా పాపం తలాపిడికెడు' స్టేజిలో వచ్చాను. భూలోకంలో యమలో కపు కబుర్లేమిటా అని ఓ క్షణం ఆగి విని వచ్చాను. ఏమిటలా చూస్తున్నారు. చాటుగా మాటలు వినటం ఏమిటా అనా? నేనేం తలుపు చాటున నక్కి వినలేదు. బార్లా తెరిచిన తలుపు దగ్గర నిలబడి విన్నాను. కాకపోతే మీరే నన్ను చూడలేదు" అన్నాడు ఆనందరావు.

"అయ్యో! మేమలా అన్నామా ఏమిటి? రండి కూర్చోండి!" అంది లీల కుర్చీ తెచ్చి వేస్తూ!

"కాస్త జ్యూస్ కలుపుతాను!" అంటూ లేవ బోయింది సరోజ.

"అయ్యయ్యో! మీరు రెస్టు తీసుకోండి. పడుకోండి! మీకు ఆరోగ్యం బాగా లేదంటే పరామర్శించి వెడదామని వచ్చాను" అన్నాడు ఆనందరావు.

"నాకేమయిందండీ! జ్వరం ఎప్పుడో తగ్గి పోయింది. ఎర్ర బస్సు మీదికోపంతో సెలవు పడేసి ఇంట్లో ఉంటున్నానంతే!"

"చూశారా! ఇదీ వరస. అస్తమానం చేస్తున్న ఉద్యోగం గురించి ఈసడింపు, అస హనం తప్ప అంకితభావం లేదు" అంది లీల.

"ఏ ఉద్యోగంలోనైనా రిస్కులు తప్పవండీ! రాజీపడిపోయి బతకటం తప్ప చేయగలిగిం దేమీలేదు. సరోజగారు ఇలా ఈసడిస్తూ మాట్లాడుతున్నారంటే ఆవిడ కేవలం కాల క్షేపం కోసం ఉద్యోగం చేస్తున్నారు కాబోలు. వెనకాల ఆస్తి పాస్తులు చాలా ఉండి ఉంటాయి. నా ఊహ కరెక్టేనా?




ఎందుకంటే కాలక్షేపం కోసం ఉద్యోగం చేసే వారంతా ఇలా తేలిగ్గా మాట్లాడటం, కుదురులేకపోవటం, నా కొలీగ్స్‌లో చాలామందిని చూశాను" అన్నాడు ఆనందరావు.

"అవునండీ! ఆస్తిపాస్తులున్నాయి. వెయ్యి ఎకరాల ఎస్టేటూ, బంగాళా, మా గుమాస్తా మోసం చేసి కాజేశాడు. కోర్టులో కేసు నడుస్తోంది. వాయిదా గెలిస్తే పది కోట్లకు ఏకైక వారసురాలిని నేనే. అపుడు స్వయంవరం ప్రకటించి దండ చేత బట్టుకుని వస్తాను. మీరూ క్యూలో నిలబడుదురు గానీ!" అంది సరోజ ఎకసెక్కెంగా.

"అలాగా! కేసు ఎప్పటికి గెలుస్తారు"

"ఇపుడు నా వయసు ఇరవై అయిదు. మరో నలభై ఏళ్లకు గెలవచ్చు" అంది సరోజ కళ్లు తిప్పుతూ.

ఫక్కున నవ్వారు లీల, ఆనందరావు.

"సరోజా! నేను వెళతాను. సరుకులు నిండుకున్నాయి. తీసుకుని వెళ్లాలి" అంటూ వెళ్లిపోయింది లీల.

"ఇంట్లో మీ వాళ్లెవరూ లేరేమిటండీ?" అన్నాడు ఆనందరావు.

"మా వాళ్లంతా అంటే? ఎంతమంది ఉన్నాము. ఉన్నది నేను, మా అక్కయ్యే కదా?"

"అదేమిటి? మీ నాన్నమ్మ ఉందన్నారు కదా!"

"ఆవిడకూ మా అక్కయ్యకు క్షణం పడదు. పోట్లాట పెట్టుకుని ఊరెళ్లిపోయింది. ఇప్పట్లోరాదు"

"మీ ఇద్దరు ఆడపిల్లలు... ఒంటరిగా.. భయమనిపించదా?"

"ఎందుకూ భయం! మామూలు సాదాసీదా ఉద్యోగస్థులమైతే మేమూ అందరి ఆడపిల్లల్లాగా ప్రతిదానికీ భయపడేవాళ్లమేమో! కానీ మా అక్క కానిస్టేబుల్! నేను కండక్టర్. ఇద్దరం రాటుతేలిపోయాము. పలకరిస్తే కరిచినట్టు సమాధానం చెబుతామేమో మమ్మల్ని చూస్తే అందరూ భయపడినట్టే అనిపిస్తుంది. అయినా ఇరుగుపొరుగులతో కూడా మా అక్క ఎక్కువ స్నేహం వద్దంటుంది. పోలీసు బుద్ధివల్ల కాబోలు ఎవర్నీ నమ్మదు. అసలు ఈ రోజు మీరిలా వచ్చి నాతో మాట్లాడ్డం చూసిందంటే ముందూ వెనకా ఆలోచించకుండా దులిపేస్తుంది తెలుసా! ఇప్పుడది డ్యూటీలో ఉంది కాబట్టి బతికాం" అంది సరోజ.

"అమ్మో! అంత డేంజరు మనిషా? బిత్తరచూపులు చూశాడు ఆనందరావు. సరదాగా కాసేపు కబుర్లు చెప్పుకుందామని వస్తే హడలగొట్టేశారు కదండీ!" అన్నాడు.

"సరదా కబుర్లా? బలేవారే ఎర్ర బస్సుల్లో దుమ్ముకొట్టుకుంటూ తిరిగేవాళ్లం, మా దగ్గరేముంటాయి కబుర్లు. దర్జాగా ఫ్యాను కింద కూర్చునే ఉద్యోగస్థులు చెబితే మీరే చెప్పాలి సరదా కబుర్లు!"

"మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడదామని వచ్చాను!"

"అలాగా! చెప్పండి!"

"ఏం లేదు. నేను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. బామ్మ కూడా సంబంధాలు వెతుకుతోంది"

"బలే బలే! కట్నం ఎంతండోయ్ లక్షా? రెండు లక్షలా?"

"అదేమిటండీ! అమ్మాయి ఎవరు? ఏ ఊరు? నచ్చిందా అని అడగకుండా కట్నం గురించి అడుగుతారేమిటి?" చిరుకోపంగా అన్నాడు ఆనందరావు.

"ముందు కట్నం నచ్చాకే కదా? అమ్మాయి నచ్చేది"

"అందరి విషయం ఏమో కానీ నాకు అమ్మాయి నచ్చాలి. కట్నప్రసక్తిలేదు!" అన్నాడు సీరియస్‌గా ఆనందరావు.

"అమ్మో! అయితే ఆదర్శ పురుషులన్న మాట!"

"మీకన్నీ పరాచికాలే! నేను సీరియస్‌గా మాట్లాడుతుంటే పట్టించుకోరేం?"

"అయ్యబాబోయ్! మీకు కోపం కూడా వస్తుందే! చెప్పండి! చెప్పండి!"

"నేను నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకున్నాను. నీవు నాకు నచ్చావు. నేనూ నీకు నచ్చానాలేదా నామీద నీ అభిప్రాయమేమిటి? అని అడగాలని వచ్చాను" గబగబ మాట్లాడేశాడు ఆనందరావు. "నేను సీరియస్‌గా అడుగుతున్నాను. నీవూ సీరియస్‌గా జవాబు చెప్పు" అన్నాడు మళ్ళీ.

"అలాగే! పెళ్ళి విషయం... నూరేళ్ళ పంట. సీరియస్‌గా కాక వేళాకోళమెలా ఆడతాను చెప్పండి. ఇప్పటి మీరు... ఏమిటి వింటున్నారా... ఇప్పటి మీరు నచ్చారు. ఉద్యోగం ఉంది. అంతో ఇంతో అందం ఉంది. నేనంటే ప్రేమ ఉంది. పెళ్ళికి కావల్సిన అర్హతలున్న ఇప్పటి మీరు నాకు నచ్చారు"

"నీ మాటలు నాకర్థంకాలేదు... ఇప్పటి మీరు అంటే భవిష్యత్తులో చెడిపోతాననా?" భృకుటి ముడిచి అడిగాడు.

"భవిష్యత్తులో కాదు. భూతకాలంలో మీరు నాకు నచ్చాలి. భయపడకండి. మా బామ్మ అంటుండేది. చిన్నప్పుడు మంచి అలవాట్లు నడవడి ఉంటే పెద్దయ్యాక బుద్ధిమంతులవుతారు అని. మీ బామ్మగారు మీ చిన్నప్పటి అలవాట్లు బాగాలేవని చెప్పింది. దాన్ని గురించే ఆలోచిస్తున్నాను" అంది సీరియస్‌గా సరోజ.

"ఏమని చెప్పింది మా బామ్మ?" ముసలి పీనుక్కి ఏం పనిలేదు. ఫ్లాష్‌బ్యాక్‌లు వివరించటం తప్ప పళ్ళు నూరుకున్నాడు ఆనందరావు.

"చిన్నప్పుడు మీరు జనగణమన పాడేవారట కదా?"

"ఏమో! నాకు గుర్తులేదు. అయినా జనగణమన పాడకుండా ఎవరుంటారు. అయిదేళ్ళ వయసునించి పాడుతుంటాం కదా!"

"నిజమే! పాడతారు. ఎక్కడ? స్కూల్లో భక్తితో నిలబడి పాడతారు. మీరు బాత్‌రూంలో పాడారుట... ఎంత చెడ్డ అలవాటు... క్షమించరాని తప్పు. మీ బామ్మ చెప్పింది. చిన్నప్పుడు జరిగిన ఆ విషయం నాకు చెప్పకపోయినా బావుండేది" అంది క్రీగంట ఆనందరావును చూస్తూ సరోజ.

ఆనందరావు లేచి నిలబడి "వస్తాను" అంటూ వడివడిగా అడుగులేస్తూ గుమ్మం దాటిపోయాడు. అతని మొహంలో ఫీలింగ్సు గుర్తుతెచ్చుకుని మనసారా నవ్వుకుంది సరోజ!



ఉదయం లేచినప్పటినించి అన్యమనస్కంగా పనులు చేసుకోసాగింది అరవింద. భర్త ఒకటికి రెండుసార్లు పిలిచినా ఆ... ఊс... అంటూ ఉలిక్కిపడటమో, పరధ్యానంగా జవాబు చెప్పటమో చేస్తోంది.

"ఏమిటి? మెదడు అప్పుడే ఆర్.టి.సి. ఎక్కిందా? ఇంకా టైముందిగా?" అని సీరియస్‌గా అడిగాడు కరుణాకర్.

"ఆс...ఆс... ఆర్.టి.సి.యే! కాకపోతే ఆవిడగారి పుట్టింటికెళ్ళే ఊరు బస్సు ఎక్కింది. వాళ్ళ ఊరినించి నిన్న ఉత్తరం వచ్చిందిగా" అందుకుంటూ వ్యంగ్యంగా చేతులు తిప్పుతూ మాట్లాడింది అరవింద అత్తగారు.

"ఎంత కరెక్టుగా ఊహిస్తుందో ఈ మహాతల్లి" మనసులోనే అనుకుంది అరవింద చెల్లి ఉత్తరం రాసింది. నాన్నగారి ఆరోగ్యం సరిగా లేదుట. ఉన్నఊళ్లో జబ్బు నయం కాదుట. కిడ్నీఇన్‌ఫెక్షన్ అన్నారుట. బెంగుళూరు తీసికెళ్ళమన్నారుట. ఏం చెయ్యాలో తోచటంలేదు అమ్మనీకసలు ఉత్తరం రాయ




వద్దంది. దాని అవస్తలుదానికున్నాయి. ఉద్యోగంచేసి వచ్చి అలసిపోయి ఉంటుంది. ఇది తెలిస్తే అదింకా బాధ పడుతుంది అంది కానీ నాకే మనసుండక రాస్తున్నాను. వీలైతే ఒకసారి వచ్చి నాన్నను చూసివెళ్ళు" అంటూ రాసింది.

ఎవరికో డబ్బు దండిగా మూల్గుతున్నవారికి రావలసిన ఖరీదైన రోగాలు బొటాబొటిగా బతికే వారికి రావటమేమిటి? దేవుడు దయామయుడంటారు. తమపట్ల ఇంత నిర్దయగా ఉన్నాడెందుకు? అరవిందకి రాత్రంతా నిద్రపట్టలేదు. నాన్న తన కోసం... ముఖ్యంగా తన చదువుకోసం ఎంతో ఆరాటపడేవాడు. "ఆడపిల్లలను చదివించి ఉద్యోగాలిప్పిస్తే నీకేం ఒరుగుతుంది. నువ్వు కష్టపడితే దాని సంపాదనంతా మొగుడు అత్తమామలు తింటారు. ఈ చదువుల ఖర్చు డబ్బంతా దాచి కట్నం ఇచ్చి ఎవరికో ఒకరికి కట్టబెట్టి చేతులు దులిపేసుకోక ఎందుకొచ్చిన తిప్పలు" అంటూ నాన్నగారి స్నేహితుడు తన ముందరే ఉపన్యాసాలిచ్చేవాడు. "నీకు తెలీదులేవయ్యా. ఆడపిల్లలకు చదువుండాలి. కాలం ఎట్లొస్తుందో చెప్పలేం. చదువుంటే ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. అవన్నీ పక్కన పెట్టినా ఈ రోజుల్లో ఒకరి సంపాదనతో సంసారాలు సుళువుగా గడుస్తున్నాయా? వేన్నీళ్ళకు చన్నీళ్ళన్నట్టు భార్యాభర్తలిద్దరూ సంపాదిస్తుంటే కష్టముండదు" అనేవాడు. ఉద్యోగంలో చేరినప్పటినించి పట్టుమని వంద రూపాయలు వారికోసం ఖర్చు పెట్టింది లేదు. ఇపుడీ కష్టకాలంలో నాన్నకోసం కనీసం ఓ రెండు వేలయినా డబ్బు పంపిస్తే...?

అవును పంపాలి. ఎలాగోలా... అప్పు చేసయినా సరే పంపాలి. అప్పు అనగానే ఆమెకు సహ ఉద్యోగి డ్రయివరు ఖాసిం గుర్తుకొచ్చాడు. అతను చాలా మంచి మనిషి. వయసులో కాస్త పెద్దవాడు. అడపాదడపా అందరూ అతనిదగ్గర అప్పుచేస్తుంటారు. కొడుకు ఉద్యోగం చేస్తున్నాడు. స్వంత ఇల్లు. కొంత ఆస్తి ఉండటంవల్ల నెమ్మదిగా ఉన్నాడు. ధర్మవడ్డీ అంటూ నూటికి రెండు రూపాయలు తీసుకుంటాడు. ఆయన దగ్గర అప్పుచేసి తండ్రికి పంపిస్తే?

డ్యూటీకి వెళ్ళటానికి ఇంకో రెండు గంటలు టైం ఉందనగా అత్తగారు లేని టైం చూసి అరవింద భర్తతో "నాన్నగారికి ఆరోగ్యంబాగా లేదంటూ ఉత్తరం వచ్చింది చూశారుగా? " అంది.

"వేరే చూడాలా? తమరి మొహంలోనే ప్రతిబింబిస్తున్నది కదా!" అన్నాడు కరుణాకర్ వ్యంగ్యంగా.

"వచ్చింది చిన్నజబ్బుకాదు. డబ్బుకెంత ఇబ్బంది పడుతున్నారో. మనమూ మనవంతుగా కాస్త పంపిస్తే మనకూ తృప్తిగా ఉంటుంది. వాళ్ళూ అల్లుడు పంపించారని గొప్పగా చెప్పుకుని సంతోషిస్తారు. ఎక్కడైనా అప్పు చేసి ఓ రెండు వేలు పంపిస్తే నెలకు కొంత కట్టి అప్పు తీర్చుకోవచ్చు. కష్టాల్లో ఉన్నపుడే కదండీ ఆదుకోవాలి" అంది అరవింద నచ్చచెప్పుతూ!

"అయిందా ఉపన్యాసం. నీవు వారికి కూతురివి. కొడుకువి కాదు. పెళ్ళయి గడప దాటింతర్వాత ఆ యింటికి చుట్టపు చూపుగా వెళ్ళటం రావటం అంతవరకే... అంతేగానీ ఆరం, భారం మోసే ఇంటి పెద్ద కొడుకులా పోజుపెట్టి డబ్బు పంపిస్తానంటావేమిటి? ఎవరైనా పుట్టింటినించి చీరెలు, సారెలు, నగలు, నాణ్యాలు తెచ్చుకునే ఆడవారిని చూశానుగాని, కొంపలో ఉన్నదంతా పుట్టింటి వారికి దోచిపెడతాననే ఆడదాన్ని నిన్నే చూస్తున్నాను" కోపంగా అన్నాడు కరుణాకర్.

"ఆడపిల్లనని మానాన్న నాకు చదువు

చెప్పించకుండా వదిలేసి ఉంటే ఈరోజు మనకు భోజనానికి కూడా గతి ఉండేది కాదు. ఇవాళ మనం కలో, గంజో తాగుతున్నామంటే అది ఆయన చలవే. ఇపుడాయనకు అంతో ఇంతో సహాయం చేసే స్థితిలో ఉండి కూడా సహాయం చేయలేని దౌర్భాగ్యపు బతుకు అయిపోయింది నాది. ఛీ! ఛీ!" రోషంగా, దుఃఖంతో అంది అరవింద.

"ఏమిటే వాగుతున్నావు. నీ సంపాదన మీద బతుకుతున్నామనే కదా ఈ పొగరు. బోడి ఉద్యోగమూ నువ్వూ. ముందు మానేసి కొంపలో పడుండు. నేను పెడితే తిను లేకుంటే పస్తులుండు. వాళ్ళ నాన్న చదివించాడట. ఇది మాకు అన్నం పెడుతోందట. కుక్కిన పేనులా ఉండేదానివి. ఆ బస్సుల్లో తిరగమరిగి, మగ వాళ్ళందరినీ, రాసుకు పూసుకు తిరిగి, మాటలు నేర్చినావు రం...ండ" అంటూ నోటికొచ్చినట్టు తిట్టి, అరవిందని వంగదీసి దబదబబాది, బయటకు వెళ్ళిపోయాడు కరుణాకర్.

అరవిందను కొడుతుంటే బెదిరిపోయిన పాప గుక్కపట్టి ఏడవసాగింది. పాపను అక్కున చేర్చుకుని విలపించింది అరవింద. ఈ మనిషి ఇంతే! ఇతను మారడు. రెక్కలు ముక్కలు చేసుకుని పగలంతా కష్టపడి పనిచేసి వచ్చినా, ఇంట్లోవారికి జాలి లేదు. సంస్కారంలేని మనుషులు. ఈ బతుకుకంటే చావటం మేలు. చస్తే వీరికేం బాధ. రోజు మారకముందే ఇంకో స్త్రీని పెళ్ళిచేసుకుని కులుకుతారు. అయినా తనెందుకు చావాలి. చచ్చి సాధించేదేం లేదు. ఏదైనా సాధిస్తే అది బతికే సాధించాలి. లేచి మొహం కడుక్కుని, పాపను తయారు చేసి పక్కింట్లో ఇచ్చి, తాళంవేసి అత్తగారు వస్తే ఇవ్వమని చెప్పి డ్యూటీకి బయల్దేరింది. డ్యూటీకింకా టైం ఉండటంతో 'ఖాసిం' ఇంటికి బయల్దేరింది. ఆయన ఇంట్లోనే ఉన్నాడు. "ఏమ్మా! ఇలా వచ్చావు? డ్యూటీలేదా? " అంటూ పలకరించాడాయన.

"ఉంది బాబాయ్! వెళుతున్నాను. మీతో పనుండి వచ్చాను. కాస్త డబ్బు అవసరం పడింది. మానాన్న ఆరోగ్యం బాగా లేదని ఉత్తరం వచ్చింది. ఓ రెండు వేలు కావాలి. నెలకు కొంత తీర్చేస్తాను" అంది గబగబ.

"అలాగా! ఇంట్లోలేదు. బ్యాంకుకెళ్ళాలి. నీకెప్పటికి కావాలి? "

"ఎంత త్వరగా ఇస్తే అంత మంచిది. మీరివ్వగానే M.ంచేస్తాను"

"వేరే M.Oఎందుకు? నేను మీ ఊరి మీదుగానే కద డ్యూటీ చేస్తున్నది. అదీగాక రోడ్డుపక్కనే మీ ఇల్లు. ఓ రెండు నిమిషాలు బస్సాపి డబ్బిచ్చి వస్తాను. రేపే ఇచ్చి వస్తాను. నీవిక నిశ్చింతగా డ్యూటీకెళ్లు"

"సంతోషం బాబాయ్! చాలా థ్యాంక్స్ మరి మీకు బాండులాంటిదేమైనా రాసిమ్మన్నారా? "

"అవన్నీ తరువాత చూసుకోవచ్చు ముందు డ్యూటీ కెళ్లు. టైం అవుతోంది" అంటూ తరిమినట్టు మాట్లాడాడు ఖాసిం.

మనసులో దేముడికి ధన్యవాదాలు తెలుపుతూ డ్యూటీకెళ్ళింది అరవింద.

రోజూ వెళ్ళే రూటుగాకుండా అరవిందకు వేరే రూటుకు డ్యూటీ మార్చారు. అంతకు ముందు ఈ రూట్లో రెండుమూడుసార్లు మాత్రం డ్యూటీ చేసింది. ఏ డ్యూటీ అయితేనేం... ఏ రూటు అయితేనేం... ఎక్కడయినా ప్రయాణం మాత్రం తప్పదు కదా! అనుకుంటూ బస్సెక్కింది. టికెట్లిచ్చేసి కూర్చుంది.

ఓ పదికిలోమీటర్లు సుఖప్రయాణమయ్యాక 'ఘాట్'రోడ్డు వచ్చింది. ఇరువైపులా బస్సును రాచుకుంటున్నచెట్లు, ముళ్ళపొదలు, చిట్టడవి, దాదాపు ఓ రెండు కిలోమీటర్లు నరసంచారముండని ప్రదేశంలోకెళ్ళ




గానే బస్సులో ఉన్నట్టుండి 'హాహా' కారాలు మొదలయ్యాయి. దోపిడీ దొంగలు కత్తులు, తుపాకులు చూపించి, ప్రయాణీకులను దోచుకుంటున్నారు. అరవిందకు కాళ్ళు చేతులు ఆడలేదు. డ్రయివరువైపు చూసి 'అన్నా' అని అరిచింది. డ్రయివరు బస్సు ఆపాడు. 'రేయ్ ఏంట్రా దొంగనాకొడుకుల్లారా" అంటూ ముందుకు రాబోయాడు. "ఆగుబే! నోరుమూసుకుని పడుండు లేకుంటే చెక్కేస్తా అంటూ పిడిబాకు డ్రయివరు కడుపుకు ఆనించాడు. దాదాపు ఏడెనిమిదిమంది దొంగలు. అందరిచేతుల్లో మారణాయుధాలు. "మామూలు ప్రయాణికుల్లా బస్సెక్కి ఇంత ఘోరం చేస్తారా? " అంది అరవింద నోరు విప్పుతూ.

"ఏమిటే వాగుతున్నావ్! ఒరేయ్ ఇది కండక్టరు. దీనిదగ్గర ఆ డబ్బు సంచి గుంజుకో" అన్నాడు మరొకడితో.

అరవింద పెనుగులాడబోయింది. ఆ పెనుగులాటలో దొంగ చేతిలోనున్న కత్తితో ఆమె చేతిని గాయపరిచాడు. "అమ్మా" అంటూ అరిచింది. "బ్యాగు ఇచ్చెయ్యమ్మా" గట్టిగా అరిచాడు డ్రయివరు. గత్యంతరం లేక బ్యాగు ఇచ్చేసింది.

"దాని మెడలో ఏదో గొలుసున్నట్టుంది అదీ లాక్కోరా!"

అరవింద గుండె గుభేలుమంది. 'వద్దు! వద్దు! ప్లీజ్!' అంటున్నా అరవింద మెడలో గొలుసు, చెవులకు ఉన్న చిన్న దుద్దులు లాక్కున్నారు. మొత్తం బస్సులో ఉన్నవారందరిదగ్గరా వాచీలతోసహా లూటీ చేసుకుని దిగిపోయారు.

"టౌను చేరేవరకు నోరు మూసుకుని పోతే సరి. మేము దిగినాం కదా అని మా వెనకాల రావటం... లాంటివి చేశావా అందర్నీ బస్సులో ఉంచి పెట్రోలుపోసి బస్సు తగలబెడతాం జాగ్రత్త!" అంటూ దొంగలు దిగిపోతూ హెచ్చరించి మరీ వెళ్ళారు.

బస్సులో డ్రయివరు, కండక్టరుతోసహా ప్రయాణీకులందరూ బిక్క చచ్చిపోయారు. వాళ్ళు వెళ్ళిపోగానే, డబ్బుపోయిన వాళ్ళు, నగలుపోయిన వాళ్ళు, ముఖ్యంగా ఆడవాళ్లు బిగ్గరగా ఏడవసాగారు. అరవింద నిర్లిప్తంగా కూర్చుండి పోయింది. డ్రైవరు మౌనంగా సీట్లోకెళ్ళి కూర్చుని బస్సు స్టార్టు చేశాడు.

పోలీస్ కంప్లయింటు ఇచ్చి, పోయిన డబ్బు లెక్కలు, ప్రయాణీకుల సాక్ష్యాలుతో కేసు నమోదు చేయించి డ్రైవరు, అరవింద ఇంటిదారి పట్టేసరికి రాత్రి పది దాటింది.

అంతవరకూ ఉద్యోగ నిర్వహణలో ఏదీ గుర్తుకు రాని అరవిందకు ఇంటి దారిపట్టేసరికి టైం గుర్తొచ్చి, పోగొట్టుకున్న మెడలో గొలుసు, చెవుల దుద్దులు గుర్తుకువచ్చి హడలిపోయింది. ఇల్లు ప్రశాంతంగా ఉంది. పాప, కరుణాకర్ నిద్రపోయారు. అత్తగారు టి.వి. చూస్తూ కూర్చుంది. అరవింద వచ్చిన అలికిడి విని ఓసారి తల తిప్పి చూసి, ఏం పలకకుండా మళ్ళీ టి.వి. చూడటంలో మునిగిపోయింది. అరవింద స్నానం చేసివచ్చింది. భోజనం చేయాలనిపించలేదు. ఓ గ్లాసు మజ్జిగ త్రాగి పడుకుంది. ఎప్పుడూ లేనిది అత్తగారు ఇంత ప్రశాంతంగా ఉందేమిటో... తుఫాను ముందర ప్రశాంతత అంటే ఇదేకాబోలు. ఎలాంటి తుఫానునయినా ఎదుర్కోక తప్పుతుందా? అనుకుంటూ నిద్రలోనికి జారుకుంది.

ఉదయం ఏడింటిదాకా మెళకువ రాలేదు అరవిందకు. అయ్యో! ఇలా నిద్రపోయానేమిటి? ... డ్యూటీ... హమ్మయ్య... ఈరోజు తనకి సెలవు కదూ! బతికిపోయాను. అనుకుంటూ లేచింది. కరుణాకర్ కాఫీ కప్పుతో అరవింద దగ్గరికొచ్చి కాఫీ

కప్పు అరవిందకిస్తూ "రాత్రి ఎన్నింటికొచ్చావు? నువ్వొచ్చేసరికి నేను నిద్రపోయాను కదూ!" అన్నాడు నవ్వుతూ. అరవింద బిత్తరపోయింది.

డ్యూటీనించి లేటుగా వస్తే భర్త ఇంత సౌమ్యంగా మాట్లాడటమా? అత్తగారు ఏ రుసరుసలు లేకుండా వంటపనిలో నిమగ్నమా? ఇది కలా? నిజమా?

"అవునండీ... ఆలస్యానికి కారణం ఏమిటంటే...? "

"హయ్యో! మీ ఆర్.టి.సి. ఆలస్యానికి కారణాలు నాకు తెలియవా? ఏ ప్రబుద్ధుడు ఆర్.టి.సి. అంటే రాదు, తెలియదు, చెప్పలేం అంటూ నిర్వచించాడోగాని అది అక్షరాలా రుజువుచేసుకుంటూ నడుస్తున్నాయి కదా" అంటూ నవ్వాడు కరుణాకర్.

"ఇదిగో మా ఆర్.టి.సిని అలాగంటే నాక్కోపం వస్తుంది." అంది చిరుకోపంగా అరుంధతి.

"ఒరే కరుణా బ్యాంకు తెరచేవేళకు అమ్మాయిని తెమిల్చి నువ్వూ త్వరగా తెములు, మళ్ళీ రేపు అమావాస్య ఘడియలు. అంత బాగుండదు" అంది అత్తగారు.

"బ్యాంకేమిటి తెమలడమేమిటి? " భృకుటి ముడిచి అడిగింది అరవింద.

"అబ్బే ఏం లేదు. మా చెల్లి నిన్న ఉత్తరం రాసింది. అల్లుడుగారికి అర్జంటుగా పదివేలు కావాలిట. సర్దుబాటు చెయ్యాలి. నీ మెడలో గొలుసు మూడు తులాలకుపైగా ఉంది కదా బ్యాంకులో పెడితే పదివేలిస్తారు. మళ్ళీ ఓ ఆరు నెలల్లోగా నీ గొలుసు నీకు విడిపించి ఇస్తాను. అల్లుడికి కోపంరాకుండా ఉండాలంటే ఇదొక్కటే మార్గం అని అమ్మ చెప్పింది" అన్నాడు కరుణాకర్.

గొలుసు అనగానే అరవింద మెడ తడుముకుంది. వంట్లో ఉన్న సత్తువంతా నీరు గారిపోయినట్లయింది. "అది కాదండీ! నిన్న బస్సు లూటీ జరిగింది. క్యాష్ బ్యాగ్‌తో సహా... ప్రయాణీకుల దగ్గర నగలు, డబ్బు... నా మెడలో గొలుసు, దుద్దులు అన్నీ ఎత్తుకుపోయారు. ప్రాణాలతో బయటపడ్డాం. నా చేతిని గాయపరచారు కూడా"

అంటూ గాయపడిన చేతిని చూపించింది వణికే గొంతుతో మాటలు పెగుల్చుకుని.

"ఏమిటీ! గొలుసు దొంగలెత్తుకెళ్లారా? బస్సు లూటీ చేశారా? ఔరా! చూశావట్రా వాజమ్మా! నీ పెళ్ళాం ఎంత చక్కగా కథ అల్లి చెబుతుందో. కోడలిని కూతురులా చూసుకుని ఇంటెడు చాకిరితో చచ్చిపోతున్నాను. ఏదో నాకూతురికి కష్టమొచ్చిందని అడిగితే ఇంత కథల్లాలట్రా" ముక్కు చీదింది.

కరుణాకర్ గుడ్లురిమి చూస్తున్నాడు భార్యవైపు.

జరిగిన ఘోరాన్ని గురించి చెప్పి గాయం చూపించినా, మనసు కరిగి, "అయ్యో! ఏమిటి? ఎలా జరిగింది? " అని ఆదుర్దాగా అడుగకపోగా కట్టుకథలని తేల్చిపారేసిన భర్తమీద, ఇంకా ఉద్రేకం తెప్పిస్తున్న అత్తగారిమీద కోపం నసాళానికంటింది అరవిందకు.

"అసలు మీ కూతురికి కష్టమొస్తే నా మెడలో గొలుసెందుకివ్వాలి? ఆమెకు మీరు చేయించిన గొలుసుందిగా. అది తాకట్టుపెట్టటమో అమ్మటమో చేస్తే కష్టం గట్టెక్కుతుంది కదా? " అంది రోషంగా.

"చూశావుట్రా దీని పొగరు. ఉన్నది దాని కదొక్కటే గొలుసు. ఎక్కడైనా పెళ్ళిళ్లు పేరంటాలకెడితే బోసిమెడతో వెళ్ళాలా? నువ్వేటూ మగరాయుడులా బస్సుల్లో తిరిగే ఉద్యోగమాయె. మెడలో ఏమున్నా ఎవరు చూస్తారు. సంసారపక్షంగా ఉండే నా కూతురికీ నీకు పోలికా? అడగవేమిరా వెధవా? అయినా నువ్వేం అడుగుతావులే




పెళ్ళాన్ని ఊరిమీదకు పంపి దాని సంపాద నతో బతుకుతున్న దద్దమ్మవి. నీవూ సంపా దిస్తుంటే అదిలా తిరగబడి మాట్లాడు తుందా? నీ టైం బాగా లేదురా పిచ్చి సన్నాసీ!" అంటూ ఒకవైపు ఎత్తి పొడుపు మాటలు జాలి మిళితం చేసి మాట్లాడింది.

"మాటలు దుబారా రానివ్వకండి! మాట్లా డాలంటే నేనూ మాట్లాడగలను. నోరుందని మాట్లాడితే ఇక్కడెవరూ పడేవారు లేరు" అంది కోపంగా అరవింద.

"ఏమిటే, నువ్వా మాట్లాడగలవా? ఏదీ మాట్లాడు. నోరు మూసుకుని కుక్కలా పడుండు. అసలీరోజునించి ఉద్యోగానికె ళ్ళొద్దు. నా సంపాదనతో గంజిపోస్తాను. కుక్కిన పేనులా పడుండు! నోరెత్తావంటే చంపేస్తాను" అంటూ అరవిందను జుట్టు పట్టి వంగదీసి దబదబ వీపున పిడిగుద్దులు గుద్దాడు.

"అమ్మా!" అంటూ వంగిపోయింది అర వింద.

"హయ్యో! ఉద్యోగం మానెయ్యమంటు న్నావట్రా! ఉద్యోగం మానేస్తే వాళ్ళ నాన్న ఆరోగ్యంకోసం అప్పుచేసి ఖాసింతో డబ్బు పంపింది కదా అదెలా తీరుస్తుంది" అంది.

"ఏమిటీ, వాళ్ళ నాన్నకు డబ్బు పంపిందా? ఎంత పంపింది? ఎవరు చెప్పారు? " కరుణాకర్ ఆశ్చర్యంగా అడి గాడు.

"ఎవరు చెప్పడమేమిటీ నిన్నరాత్రి ఖాసిం స్వయంగా ఇంటికొచ్చి డబ్బు వేరే డ్రయివ రుతో వాళ్ళనాన్నగారికి పంపించాననీ, తనకు వెళ్ళటం కుదరలేదనీ చెబితేనూ!" అంది.

"ఎంతట? "

"ఏమో! ఎవరడిగారు? అలా అడిగితే చులకనగా ఉంటుందని కోడలి గౌరవం కాపాడాను. కానీ నా బాధ ఎవరు గుర్తి స్తారు? గొలుసు తాకట్టుపెట్టి ఏ పదివేలో పంపి ఉంటుంది. అతగాడికొచ్చింది చిన్నా చితకా రోగమా ఏమిటి? కిడ్నీ రోగమాయె. తండ్రికి పంపకుండా ఎవరు వద్దంటారు. అదేదో మనకు చెప్పి పంపితే ఎంత బాగుం టుంది. నేను సరే అత్త ముండను. గయ్యా ళిని. కట్టుకున్న మొగుడివి నువ్వింకా బతికే ఉన్నావు కద. నీతోనయినా ఓ మాట చెప్పొద్దూ. వీడికేమిటి నేను చెప్పేది అని నిర్లక్ష్యం. సంపాదన లేని మగవాడు ఆడదా నికెంత చులకనో చూశావా? " మంటను ఇంకా ఎగదోస్తూనే ఉందామె.

"ఏమిటండీ! అంత మూర్ఖంగా మాట్లాడ తారు. సంసారంలో చిచ్చులు పెట్టే మాటలూ మీరూ ఛీ! ఛీ!" అంది అరవింద దుఃఖంతో మాటలు పెగలక.

"ఎవర్నే నువ్వు ఛీ కొట్టేది" అంటూ మళ్ళీ చెంప పగలగొట్టాడు కరుణాకర్. నోటినించి రక్తం రాసాగింది అరవిందకు.

"అసలు మీరు మనుషులా పశువులా? " అంది గట్టిగా ఏడుస్తూ.

"నీకా ఉద్యోగముందనేకదా ఇంత పొగరు. నోటికెంతొస్తే అంత మాట్లాడ తావా? ఇదిగో నీకిప్పుడే చెబుతున్నా ఈ రోజునుంచీ నువ్వు ఉద్యోగం చెయ్యటం లేదు. రాజీనామా చేస్తున్నావు. నా మాట మీరి ఉద్యోగానికి వెళ్లావా? మళ్లీ ఈ ఇంట్లో నీకు స్థానంలేదు. నీ దారి నీది, నా దారి నాది. నా సంపాదన నూరుకానీ రెండొంద లుకానీ అందులోనే గంజి తాగి బతు కుదాం. నీ సంపాదనవద్దు. నీ పొగరణగా లంటే అదొక్కటే మార్గం" అంటూ ఇంట్లోంచి వెళ్లిపోయాడు కరుణాకర్.

గుక్కపట్టి ఏడుస్తున్న పాపను ఒళ్లో పడు కోబెట్టుకుంది అరవింద. ఉద్యోగం మానె య్యాలా? ఉద్యోగం ఉండి అంతో ఇంతో సంపాదన ఉంటేనే తన బతుకిలా తగల డింది. అదీ మానేస్తే గంజికోసం రోజూ

కుక్కల్లాగా పోట్లాడాలి కాబోలు. డబ్బుల్లే కుండా, ఆయన సంపాదన చాలీచాలని జీతంతో ఆ బతుకు ఊహించుకుంటేనే భయంగా ఉంది. అయినా అవన్నీ తనెందుకు ఆలోచించాలి. కట్టుకున్నాక పెళ్లాన్ని పోషించే బాధ్యత అతనిదేకదా! కష్టపడసీ, గంజి పోస్తాడో పస్తులుంచుతాడో చూద్దాం. రెక్కలుముక్కలు చేసుకుని తనెందుకు సంపాదించాలి. సంపాదించి లాభమేముంది. దినదినగండం నూరేళ్ల ఆయుష్షు అన్నట్టు ఈ బాధ తనకెందుకు? ఒకసారి ఉద్యోగం మానెయ్యి అన్న తర్వాత మళ్లీ ఉద్యోగం చెయ్యమని మాత్రం అన లేడు. ఒకవేళ చెయ్యమన్నా ఉద్యోగం ఉండదు. చావనీ! నాకెందుకు ఉంటే వండు తాను. లేకుంటే నీళ్లు తాగి పడుకుంటాను. ఈ రభసలు, వళ్లు హూనమయ్యేలా ఈ దెబ్బలుండవు. అపుడయినా కొంప ప్రశాం తంగా ఉంటుందేమో.

అరవింద ఇలా ఆలోచించి ఆలోచించి లేచి స్నానం చేసి పాపను తయారుచేసి రిజైన్ లెటరు రాసుకుని లీల ఇంటికి బయ ల్దేరింది.

"ఇల్లొదిలి వెళ్లద్దని వాడు చెప్పాడా? మళ్లీ ఎక్కడికి ప్రయాణం" అంది అత్తగారు కటువుగా.

"రాజీనామా ఉత్తరం ఇచ్చి వస్తాను" అంది ముక్తసరిగా. అరవింద నిజంగానే ఉద్యోగం వదిలేస్తోందని తెలిసి ముసలా విడ గుండె గుభేలుమంది. కొడుకు, కోడలి జీతాల్లో సంసారం గడిపి అంతో ఇంతో మిగుల్చుకుని చీరలు కొని కూతురికి పంపేది. పోస్టాఫీసులోనూ పదో పరకో వేసుకునేది. ఆమెనెవరూ లెక్కలడిగేవారు కాదు. కోడలిని గురించి ఆమె డ్యూటీల గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుని ఆమెను రాసి రంపాన పెట్టటం, కొడుకుకు చాడీలు చెప్పటం, పోట్లాటలు పెట్టటంలాంటి పనులతో తృప్తిగా కాలంగడిచిపోతోంది. ఇపుడిలా హఠాత్తుగా కోడలు ఉద్యోగం మానేస్తుందని తెలిసేసరికి సస్పెన్సు సినిమా చూస్తున్నప్పుడు కరెంటు పోయినట్లయింది ఆమెకు.

"ఎలాగూ రోజూ బస్సులో లగేజిటికెట్లు కొట్టకుండా గుంజుకున్న చిల్లర వస్తుంటుందికదా! అదెలాగూ ఏ బ్యాంకులోనో మాకు తెలియకుండా వేస్తూనే ఉంటావు. అవి తీసి మీ నాన్నకు పంపి ఉండకూడదా? మెడలో గొలుసు తాకట్టుపెట్టి డబ్బు పంపినందుకేకదా ఇంత పోట్లాట" అంది తనలోతను మాట్లాడుకుంటున్నట్టు. అరవింద ఆమెకేసి అసహ్యంగా చూసి ముందుకు నడిచింది.

"ఓ యబ్బో! కండక్టరమ్మ చిల్లర యవ్వారమంతా ఈ ముసల్దానికి తెలిసిపోయిందే అని ఆ చూపు చూడు కాల్చేసేట్టు. పక్కవీధి కండక్టరు లగేజి టికెట్లు కొట్టకుండా దాచుకున్న చిల్లర, టికెట్టు వెనకాల రాసిచ్చి ప్రయాణీకులకు ఎగ్గొట్టిన చిల్లరంతా తెచ్చి పెళ్లాం ముందు జేబులు దులుపుతుంటే చూసి తెలుసుకున్నాలే. అన్నమంతా పట్టి చూడాలా ఏం ఒక్క మెతుకు చూస్తే చాలదూ. ఒక్క కండక్టరును చూస్తే చాలదూ చరిత్ర అర్థమవటానికి!" అరవింద చెప్పులు వేసుకుని గేటు దాటేదాకా అలా గట్టిగా మాట్లాడుతూనే ఉందావిడ. "ఛీ ఛీ! పశువై పుట్టాల్సింది!" అనుకుంటూ పాపను భుజాన వేసుకుని లీల ఇంటికి వచ్చింది. లీల ఇంటికి తాళం వేసుంది. లీల డ్యూటీ కెళ్లింది. తాళంచెవి ఇచ్చి వెళ్లింది ఇవ్వమంటారా అంది కావేరి అరవిందను పరిశీలనగా చూస్తూ. ఇంత ఉదయమే అరవింద ఎప్పుడూ లీల ఇంటికిరాలేదు. అరవింద బాగా ఏడ్చిందేమో కళ్లు వాచి ఉన్నాయి. "ఇవ్వండి" అంది తాళం తీసి గదిలో మంచంమీద పాపను పడుకోబెట్టి తనూ కూర్చుంది. కావేరి ఇంట్లోనుంచి భోజనం

పట్టుకొచ్చింది. "మీరెందుకో అదోలా ఉన్నారు. ముఖం పీక్కుపోయింది. ముందు భోంచేయండి. ఈ రోజు టిఫిన్ చేయలేదు. ఏకంగా వంట చేశాను. తినండి!" అంటూ బలవంతంగా తినిపించింది. బాగా ఆకలిగా ఉండటంతో మొహమాటం కొద్దీ ముందు వద్దన్నా తర్వాత కడుపునిండా భోంచేసింది. పాపకూ కొద్దిగా తినిపించింది. "పాపను నేను ఆడించి లాలి కట్టి నిద్ర పుచ్చుతాను. తలుపు దగ్గరగా వేసుకుని నిద్రపొండి. లీల వచ్చేదాకా ఏం చేస్తారు" అంటూ పాపను తీసుకుని తలుపు దగ్గరగా వేసి వచ్చింది. అరవింద ఇంకేం ఆలోచించకుండా పడుకుని నిద్రపోయింది.



లీలకి ఆ రోజు ఫాస్ట్ సర్వీస్ బస్సుకు డ్యూటీ వేశారు. టికెట్లిచ్చేసి లెక్క పెట్టుకుని నిశ్చింతగా కూర్చుంది. దాదాపు గంట పదిహేను నిమిషాల వరకు తనకేం పనిలేదు. రోజూ ఇలాంటి డ్యూటీ అయితే ఎంత బావుండు అనుకుంది. సన్నగా తుంపర పడుతోంది. ప్రయాణీకులు కిటికీలకున్న అద్దాలు మూసేస్తున్నారు. చల్లనిగాలి శరీరాన్ని తాకుతోంది. తనకు చిన్నప్పటినుంచి బస్సులోగానీ రైల్లోగానీ ప్రయాణం చెయ్యటమంటే చాలా ఇష్టం. ఎంచక్కా కిటికీ దగ్గర సీట్లో కూర్చుని దాటిపోతున్న ప్రకృతి దృశ్యాలను ఆనందంగా చూస్తూ ఉండేది. చిన్నప్పుడు తల్లిదండ్రులతో కలిసి ప్రయాణం చేసే రోజుల్లో కిటికీ పక్కసీటు కోసం పోట్లాడి మరీ కూర్చుని ప్రయాణం చేసేది.

తనకు ప్రయాణమంటే ఇష్టమనే కాబోలు దేముడు తనకు నిత్యం ప్రయాణం చేసే కండక్టరుద్యోగం వచ్చేలా చేశాడు.

మనసులోనే నవ్వుకుంది. ఆమెకు సారధి గుర్తుకు వచ్చాడు.

అతనినుంచి వచ్చిన ఉత్తరాన్ని మళ్లీ తనురాసి పోస్టు చేసిన రిప్లైని మననం చేసుకుంటూ ఉండిపోయింది.

"లీలగారికి సారధి చేయు నమస్కారములు.

ఏమిటండీ మీరింత పిసినారి అయిపోయారు ఉత్తరాల విషయంలో.

నేను ఉత్తరం రాస్తే... దానికి బదులు రాసి ఊరుకుంటారు. నేను కాస్త ఆలస్యంగా కొద్దిరోజులు రాయకుంటే ఏమిటి? ఎందుకు? అని రాస్తారేమోనని ఎదురు చూస్తే 'ఊహూ' మీనుంచి ఉత్తరం రాదే! నేను రాస్తే తప్ప రాయకూడదా ఏమిటి?

నిష్ఠూరాల కార్యక్రమం అయిపోయింది.

ఇకపోతే కిందటి ఉత్తరంలో 'మీ నాన్నతో ఎందుకు పేచీ ఎవరో ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకోరాదా?' అని రాశారు.

ఈ ఆలోచన నాకూ ఓ ఆరు నెలల కిందట వచ్చిందండోయ్! ఓ నెలలోగా ఎవర్నో ఒకర్ని ప్రేమించి గుళ్లో పెళ్లి చేసుకుని మెడలో పూలదండలతో మా నాన్నకు కనిపించి కాళ్లమీదపడితే ఓ పనయిపోతుంది. నాన్న తిక్క కుదురుతుంది. మరీ విలన్ వేషాలు ఎక్కువ అయ్యాయి ఆయనకు' అనుకున్నాను సుమండీ!

నిజం చెప్పొద్దూ నా ఉద్యోగం కోసం కూడా అంత ప్రయాసపడలేదంటే

నమ్మండి. ముందు మా ఎదిరింటమ్మాయిని లవ్ చేస్తే బాగుంటుంది. టైం వేస్టు కాదు అనుకున్నాను.

ఎదిరింట్లో వాళ్లమ్మాయి వాళ్ల డాబామీద గుడ్డలారేస్తుంటే ఒకటీ అర సైగలు చేసి పల్లికిలించాను. ఆ అమ్మాయి రెండు రోజులు మౌనంగా ఉంది. హమ్మయ్య లైన్లో పడింది అనుకున్నా. అమ్మాయిలను వశప రచుకోవటం ఇంత సులభంగా ఉంటే...

'ఆడది అబల కాదు సబల'

'ఆడదాని మనసు అగాధం!'

'అర్థం కానిదేమిటంటే ఆడదాని మనసు!'

అంటూ పనికిమాలిన కొటేషన్లు రాస్తా రెందుకో అనుకున్నా.

మూడో రోజు ఆఫీసునుంచి వస్తుంటే ఒక లావుపాటి శాల్తీ నా కాలరు పుచ్చుకుని రోడ్లో నిలబెట్టాడు.

నేను దిమ్మెరపోయాను.

'ఏరా! కుక్క మూతి వెధవా!! మా చెల్లికి సైగలు చేస్తున్నావట. ఒళ్లెలా ఉంది? పెళ్లి నిశ్చయమైన పిల్లతో సరసాలాడుదామనుకు న్నావా? ' అంటూ కొట్టబోయాడు.

నాకు కళ్లు తిరిగాయి. అతన్నించి ఎలా బయటపడ్డానో రాయాలంటే పేజీలు చాలవు. ఓ నెల రోజులవరకు తేరుకోలేక పోయాను.

మా ఆఫీసులో కొత్తగా ఓ లేడీ క్లర్కు చేరింది. అమ్మాయి అందంగా ఉంటుంది. అయినా అనుభవం నేర్పిన పాఠం గుర్తుం డటంతో ఆమె ముందు వెధవ్వేషాలు వెయ్యలేదు. చాలా డిగ్నిఫైడ్‌గా ప్రవర్తించ సాగాను.

చెబితే నమ్మరుకానీ ఆ అమ్మాయే నా పట్ల ఆకర్షితురాలయ్యింది. మొదట్లో ఒకటీ అరా మాట్లాడే అమ్మాయి జోకులెయ్యసా గింది.

ఓ రోజు లంచ్ అవర్లో సూటిగా అడిగే సింది. 'మనం పెళ్లి చేసుకుందామా? ' అంది.

ఆశ్చర్యపోయాను.

ఆడవాళ్లు అన్ని విషయాల్లోనూ మగవా రితో పోటీగా ఉంటున్నారని విన్నానుకానీ ఇలా పెళ్లి విషయంలో ఇంత సూటిగా...

అబ్బో.. ఆడవాళ్లు చాలా ముందంజలో ఉన్నారు సుమా అని ముక్కున వేలేసుకు న్నాను.

ఏదిఏమైనా ప్రస్తుతం కావాల్సింది నా పెళ్లి. ఇంత ధైర్యమున్న అమ్మాయిని చేసు కుంటే మా ఇల్లూ చక్కబడుతుంది. నా జీవితమూ బాగుంటుంది అనుకున్నాను.

"చూడండీ! పెళ్లి చేసుకుందామా? అని నేనడిగానని మీరు నన్ను చులకనగా అంచనా వేయటమో కాబోయే పెళ్లామేక దాని సినిమాల్లోలాగా వెధవ్వేషాలు వేయ టమో చేస్తే మాత్రం నేను మంచిదాన్ని కాదు.

మీరు మా పెద్ద వాళ్లని, నేను మీ పెద్ద వాళ్లని కలవాలి. వారిద్దరూ మంచీచెడ్డా మాట్లాడుకోవాలి. అప్పుడే పెళ్లి. ముంద స్తుగా నేను ఈ రోజు సాయంత్రం మీ ఇంటికొస్తున్నాను" అంది. ఆమె మాట తీరు కొట్టినట్టు వినిపించి మనసు కలుక్కు మంది. ఆ దానిదేముందిలే పెళ్లయితే అన్నీ సర్దుకుంటాయి అనుకుని నాలుక చప్పరించే శాను. ఆనందంగా ఆమెను మా ఇంటికి ఆహ్వానించాను.

ముందుగానే అమ్మకు నాన్నకు విషయం చెప్పాను. కాకపోతే ఆ అమ్మాయితో పెళ్లి గిళ్లీ వగైరాలేవీ చెప్పకుండా మా ఆఫీసులో పనిచేసే అమ్మాయి ఈ రోజు మనింటికొ స్తుంది కాస్త టీ, బిస్కట్లు సిద్ధం చెయ్యమని అమ్మకు చెప్పాను.

అమ్మ ఏం ప్రశ్నించలేదు కానీ నాన్న




మాత్రం "ఎందుకొస్తోంది?" అని సీరియస్గా అడిగాడు.

"ఉత్తినే! ఈ దార్లోనే వాళ్ల బంధువులున్నారట. మాటల సందర్భంలో అంటేనూ... ఫార్మాలిటీ కోసం మా ఇల్లూ అటే, రండి అన్నానంతే!" అని చెప్పాను.

మనసులో తిట్టుకుంటూ శబ్దం కాకుండా పళ్లు నూరుతూ! ఆయన అప్పుడేం మాట్లాడలేదు.

ఆ రోజు సాయంకాలం ఆ అమ్మాయి వచ్చింది. ఆమెకు మా ఇల్లు నచ్చింది.

"మీఇల్లు చాలా బావుందండి. మీ తోట బావుంది. అబ్బ ఈ పువ్వులెంత బావున్నాయో! ఆంటీ తోట గురించి శ్రద్ధంతా మీదేకదూ! మిమ్మల్ని చూడగానే అనుకున్నా! అరె మీ పిల్లి కూడా ఎంతో బావుంది" అంటూ మా ఇంట్లో కనిపించిన బొద్దింకతో సహా మెచ్చుకుంది.

నా మనసు ఎగిరి గంతేసింది. ఈ అమ్మాయి వెళ్లిపోగానే ఆ అమ్మాయి గురించి నాన్నకు అమ్మకు అంతా చెప్పి పెళ్లికి వప్పించాలి అనుకున్నాను. కానీ అంతవరకూ నాన్న ఎంతో హుందాగా వాలు కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుతూ కూర్చున్న వాడల్లా లేచినిలబడి ఏమిటమ్మా మా ఇంట్లో అన్నీనచ్చాయి అన్నీ నచ్చాయి అంటూ తెగ మురిసిపోతున్నావు. మీ ఇద్దరి వాలకం చూస్తుంటే ఏదో ప్రేమ వ్యవహారంలో పడ్డట్టున్నారే! తప్పేముందిలే ఈ రోజుల్లో ప్రేమించి పెళ్లి చేసుకోవటం నీళ్లు తాగినంత సులభమైపోయింది. "మీ నాన్నగారేం చేస్తారమ్మా" అనడిగాడు.

"హెడ్ మాస్టరండి" అందా అమ్మాయి.

"అలాగా! ఏరా చంటీ! ఆమధ్య నువ్వు ప్రేమించానని ఓ అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చావు. వాళ్ల నాన్న టీచరనుకుంటా కదూ!" అన్నాడు నా వైపు నవ్వుతూ చూస్తూ. అంతే! ఆ అమ్మాయి కోపంగా నావైపు చూసింది.

"అపార్థం చేసుకోకమ్మా! వీడికి చిన్నప్పుడు అదేదో రోగం అంటుకుంది. దానిపేరు జీలకర్ర రోగమని వైద్యులు తేల్చారు. దాని ప్రభావంతో వయసొచ్చాక కనిపించిన అమ్మాయిలనందరినీ ప్రేమించానంటూ వెంట బడటం ఇంటికి తీసుకురావటం లాంటివి చేస్తాడని డాక్టర్లు అప్పుడే చెప్పారు. అప్పుడు నేను పట్టించుకోలేదు. కానీ ఆరోగ ప్రభావం ఇంత దారుణంగా ఉంటుందనుకోలేదు. ఈ ఆరు నెలలకాలంలో ఆరుగురు అమ్మాయిలను ప్రేమించానన్నాడు. పెళ్లి అన్నాడు. నేను చెప్పేది అబద్ధమైతే అదిగో ఆ ఎదిరింటమ్మాయినడగండి. వాళ్లన్నయ్య వీడిని రోడ్లో చితకబాదాడో లేదో కనుక్కో... మంచి అమ్మాయిని చూసి పెళ్లిచేయాలనుకుంటున్నాను. నీకభ్యంతరంలేకపోతే మీ పెద్దవాళ్లతో మాట్లాడి..."

అంటుండగానే ఆ అమ్మాయి చరచరా వెళ్లిపోయింది.

అమ్మ చూస్తే నాన్నతో మాట్లాడదు.

ఆయన వాక్ప్రవాహాన్ని ఆపేవారులేరు.

నాకు వళ్లుమండిపోయింది. "ఎందుకు నా మీద ఇంతకక్ష కట్టి ప్రవర్తిస్తున్నారు?" అన్నాను కోపంగా.

"నీకెలాంటి పెళ్లాం రావాలో నిర్ణయించవలసింది నేను. నీ యిష్టానుసారం ప్రేమా దోమా అంటూ తైతక్కలాడదామనుకున్నావా జాగ్రత్త!" అంటూ హెచ్చరించి బయటకెళ్లిపోయాడు.

అసహనంగా అమ్మవైపు చూశాను.

నా వైపు బాధగా చూసింది. దగ్గరకొచ్చి. వీపు నిమురుతూ, "నువ్వేం బాధపడకురా చంటీ! నీకోమంచి అమ్మాయిని చూసి పెళ్లి చేసే బాధ్యత నాది. అంతవరకు నీవు బుద్ధిగా ఉండు. సరేనా!" అంది.



"బుద్ధిగా ఉండక వందమందిని పెళ్లాడి మోసం చేశానా?" గట్టిగా అరిచాను.

అంతకుమించి ఇంకేం చెయ్యను చెప్పండి.

ఇదండీ నా ప్రేమగోల.

ఖచ్చితంగా మా నాన్న నన్ను ఏ వంకర టింకర పిల్లకో అమ్మేసి నీ చావు నీవు చావు అనటం ఖాయం.

అమ్మకు ధైర్యం అయితే ఉందిగానీ నాన్నను కాదని నాకు పెళ్లి చేసేటంత ధైర్యం ఉందా అని అనుమానం!

వీళ్లిద్దరూ మాట్లాడుకుని మంచి సంబంధం చూస్తే తప్ప నాకు పెళ్లికాదు. వీళ్ల మాట్లాడుకోవటం ఈ జన్మకు జరగని పని.

నేను ముదిరిన బెండకాయలా...

మూలపడ్డ రోడ్డురోలరులా...

విడుదలకాని సినిమాలా..

పూర్తికాని పజిల్‌లా...

ఉప్పులేని కూరలా...

వద్దులెండి ఉదాహరణలు అంత బాగున్నట్టు లేవు.

ఇలా మిగిలిపోవాల్సిందేనా?

ఓ ముక్కోటి దేవతలారా! నా మొర వినలేరా?

లీలగారూ నా మనసు చెడిపోయిందండి. ఉత్తరం ముగిస్తున్నాను. ఉంటానండి.

**మీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూ...**

**సారథి.** .... దానికి

సారథగారికి లీల చేయు నమస్కారములు

ఈసారి మీ ఉత్తరం నన్ను చాలా బాధ పెట్టింది. పెళ్లి సమస్య కేవలం ఆడపిల్లలకే పరిమితం అనుకునేదాన్ని. అయినా మీరు అంత నిరాశపడటం నాకేం నచ్చలేదు. జీవితంలో పెళ్లి ఓ భాగం మాత్రమే. పెళ్లే జీవితమైనట్టు అంత బాధ దేనికండీ బాబూ! ఎందుకైనా మంచిది ఓసారి జాతకం చూపించుకోండి! అసలు మీ జాతకంలో పెళ్లి ఉందాలేదా అన్నది తేలిపోతుంది. జాతకాలను మీరు నమ్మితేనే సుమండీ.

ఇకపోతే నా గురించిన విశేషాలు మామూలే!

ఈ బస్సు ప్రయాణంలో వారం రోజులు సాదాసీదాగా గడిచిందంటే ఓ కొత్త సమస్య తలెత్తి ఆ తర్వాత వారమంతా మనశ్శాంతి లేకుండా తోస్తుంది. నాన్నగారు ఉత్తరం రాశారు డబ్బు పంపమని.

అన్నట్టు మా కుటుంబ చరిత్ర పూర్తిగా తెలుపలేదుకదూ! నాకు ఉద్యోగం వచ్చాక నాన్నగారు వాలంటరీ రిటైర్మెంటు తీసుకుని తమ్ముడిని ఉద్యోగంలో వేయించారు. వాడికి పెళ్లి చేశారు.

నాన్నకు వచ్చిన గ్రాట్యుటీ, పెన్షన్ డబ్బుతో ఇంకో చెల్లి పెళ్లి కూడా చేసేశారు.

అంతా ఎక్కడివారక్కడ సెటిల్ అయ్యారు.

తమ్ముడి దగ్గర అమ్మానాన్న ఉంటున్నారు. తమ్ముడి భార్యకూ అమ్మకు ఓ క్షణం కూడా పడటంలేదుట. నాన్న ఉత్తరాల్లోనూ, స్వయంగా ఆయన మాటల ద్వారానూ తెలుసుకున్నాను. ఓసారి అమ్మ ఆరోగ్యం బావుండలేదని పెద్ద డాక్టరు చేత పరీక్ష చేయించుకోవాలని నా దగ్గరకు తీసుకొచ్చాడు నాన్న.

అమ్మ బాగా చిక్కిపోయింది. మునుపటి కళాకాంతులులేవు. స్త్రీ సహజమైన మెత్తని మనసుతో ఆమెపైజాలిపడినా, అంతరాంతరాల్లో అమ్మానాన్నలిద్దరూ నాపై చూపించిన పక్షపాతవైఖరి, విషగుళికలాంటి నా బాల్యమూ గుర్తుకొచ్చింది.

ఎవరు చేసిన కర్మ వారనుభవించక





తప్పుతుందా?

నా ఉసురు ఊరికే పోతుందా?

మగపిల్లవాడు, మగపిల్లవాడు అంటూ నెత్తినపెట్టుకుని ఊరేగారు. ఇపుడు మళ్లీ నేనే గతి అయ్యాను అని కసిగా అనుకున్నాను.

నిర్లిప్తంగా వారికి కావలసిన సదుపాయాలు డబ్బు సమకూరుస్తున్నానుకానీ మనస్ఫూర్తిగా ప్రేమతో మాత్రం కాదు! బహుశ అమ్మానాన్నలను ఎప్పటికీ క్షమించలేనేమో! నేనిలా ఇంత కఠినంగా రాస్తుంటే చదవటానికి మీకు ఇబ్బందిగానూ మరీ ఇంత రాక్షసి మనస్తత్వమేమిట్రా బాబూ! అనుకుంటున్నారుకదూ!

నిజానికి తల్లిదండ్రుల పట్ల ఏ కూతురికీ ఇంత కఠినత్వం ఉండకూడదేమో. మరి కూతురిపట్ల తల్లిదండ్రులు కఠినంగా ప్రవర్తించవచ్చా?

ఓసారి చాలా చిన్నపుడు అంటే నాకు పన్నెండేళ్లుంటాయేమో. ఆ వయసులో నేను చాలా లోతుగా ఉన్న బావినీళ్లు ఇనుప బిందెలతో అరమైలు దూరంనుంచి రోజుకు ఇరవై బిందెలు మోసేదాన్ని. నా చేతులు కాయలు కాసేవి. అరికాళ్లు పగుళ్లు బారి రక్తం వచ్చి నొప్పి పుట్టి ఏడిచేదాన్ని. పసుపు ఆముదం రాసుకుని యధాప్రకారం నీళ్లు తెమ్మనేది అమ్మ. ఇంట్లో పనికంటే నీళ్ల పని చాలా భారంగా అనిపించేది.

మా ఇంటిముందు రైలు పట్టాలుండేవి. రెండు రోజులకోమారు రైలింజను మా ఇంటిముందరున్న రైలు పట్టాలదాకా వచ్చి షంటింగ్‌కోసం ఆగి ఓ అయిదు, పదినిమిషాలుండి వెళ్లేది. ఆ సమయంలో రైలింజను దగ్గర నిలబడ్డ డ్రయివరు నీళ్లు వదిలేవాడు. ఆ నీళ్లు వచ్చే గొట్టం రైలు చక్రాలనానుకునే ఉంటుంది. ఒక్కోసారి వేడినీళ్లు కూడా వదిలేవాడు.

స్కూలులేని సమయంలో రైలింజను వచ్చి ఆగితే నేను పరిగెత్తివెళ్లి నీళ్లు మోసేదాన్ని. ఎందుకంటే అరమైలు దూరంనుంచి నీళ్లు తెచ్చేబాధ ఒకరోజైనా తప్పుతుందన్న సంతోషం మరి!

ఓసారి నీళ్లు బిందెలో నింపుకుంటున్న సమయంలో సిగ్నల్ ఇవ్వటంతో ఇంజను కదిలింది. బిందె ఇంకా నిండకపోవటంతో బిందె పట్టుకుని రెండు మూడు అడుగులు ఇంజనుతో సహా నడిచాను. రైలు పట్టాల పక్కన పరిచిన కంకరరాళ్లమీద నడవటం ఇబ్బంది అయిపోయి జారిపడిపోయాను. కంకరరాళ్లు మీదుగా నిండు బిందె దొర్లుకుంటూ వచ్చి నాకాలిమీదపడింది. కాలు బెణికి వారం రోజులు నొప్పి తగ్గలేదు. ఏవో పట్లు అవీ వేసినా తగ్గలేదు. డాక్టరు ఖర్చు తప్పలేదు. అపుడు అమ్మ అన్న మాటలు ఇప్పటికీ గుర్తుండిపోయాయి. "ఆ క్రిందపడేదేదో రైలు పట్టాలమీదుగా పడి ఉంటే పెళ్లి నెపంతో ఖర్చయ్యే యాభైవేలు మిగిలి ఉండును" అంది.

అదేదో జోకయినట్టు అంతా నవ్వేశారు.

ఇంకో గంటదాకా రైలు రాదని తెలిసి కూడా దగ్గరుండి తమ్ముణ్ణి పట్టాలు దాటించి స్కూలుకు పంపే అమ్మ...

అంతరాంతరాల్లో నా చావు కోరుకునే అమ్మ...

ఆ చిన్నతనంలో సవతి తల్లిలాంటి స్వంత అమ్మ... పక్షపాతవైఖరినీ... ఆ రోజునూ తలచుకుంటే ఈ క్షణానికీ కంట్లో నీళ్లు చిప్పిల్లుతాయి.

అలాంటి అమ్మ, తమ్ముడిమీద వాడి భార్యమీద చాడీలు చెబుతూ నా పంచన చేరి, నా డబ్బును ఆశిస్తూ...

ప్చ్ ఏమిటో! అమ్మ నాన్నల విషయంలో మనస్ఫూర్తిగా సానుభూతి చూపించలేకపోతున్నాను.

అలాగని నిష్ఠూరపు మాటలతో కఠి



నంగానూ ప్రవర్తించలేను.

నిర్లిప్తంగా ఉండిపోతున్నాను. వాళ్ల నాకు కనిపించకుండా ఏ ఉత్తరాలద్వారానో డబ్బు సహాయం అంటేనే నాకు బాధవుం టుంది. ఎదురుగ్గా ఉంటం మూలానా ప్రతి సారీ నా చిన్నతనం గుర్తొచ్చి బాధ పడటం జరుగుతోంది. గతంనుంచి ఎంత దూరంగా పారిపోదామన్నా అది ఎప్పుడూ నీడలా వెన్నంటి ఉంటుందెందుకో! నా ఉత్తరం మీకు చాలాబోర్ కొడుతుందనుకుంటాను.

ఉంటాను! మీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూ...

మీ స్నేహితురాలు లీల"

జ్ఞాపకాలతో ఆలోచిస్తున్న బస్సుకు ఏదో ప్రమాదం జరగబోతోందని బస్సు కుదుపు వల్ల తెలిసేలోగానే బస్సులోని జనం హాహా కారాలతో అంతా దద్దరిల్లిపోయింది. ఎదురుగ్గా వస్తున్న లారీని బస్సు ఢీకొనడం, పల్టీ కొట్టడం క్షణాల్లో జరిగిపోయింది.

★ ★ ★

గట్టిగా మాటలు వినిపించటంతో అరవిందకు మెలకువ వచ్చింది. టైం చూసుకుంది. రాత్రి ఏడవుతోంది. అబ్బ! ఇంత మొద్దులా నిద్రపోయానేమిటి? పాప ఎక్కడుంది? అంతగట్టిగా మాట్లాడుతున్నారెవరు? తన లోతనే గొణుక్కుంటూ హడావిడిగా గదిబయటకొచ్చింది. సరోజ సీతమ్మగారికి, ఆనందరావుకు, కావేరికి ఏదో విషయం కంగారు పడుతున్నట్లు ఆత్రంగా చెబుతోంది.

"ఏమిటి సరోజా? ఏమైంది? " అంటూ ప్రశ్నించింది అరవింద. లీల డ్యూటీకెళ్ళిన బస్సు యాక్సిడెంటయిందట.

ప్రయాణికులకు బలమైన దెబ్బలుట.

డ్రయివరు పరిస్థితి ఆందోళనకరంగా ఉందిట.

లీలకు కూడా తలకు దెబ్బ తగిలిందట.

యాక్సిడెంటయిన ఊరిపక్కనున్న 'ఊళ్ళో హాస్పటల్లో చేర్చారుట.

నేను డ్యూటీ దిగివస్తుంటే డిపోలో అనుకుంటున్నారు. లీలను చూడ్డానికి అలాగే వెడదామనుకున్నాను. మా అక్కయ్య కంగారుపడుతుందని ఆమెతో చెప్పి వెళుతున్నాను" అంది సరోజ.

"అలాగా! పద నేనూ వస్తాను" అంది అరవింద.

"నేనూ వస్తాను" అంది కావేరి.

"పదరా మనమూ వెడదాం" అంది సీతమ్మ.

"పాపతో ప్రయాణం ఇబ్బందవుతుందేమో? " సరోజ అంది.

"అవునండి! అందులోనూ హాస్పటల్ వాతావరణంలోనికి, ఆరోగ్యంగా ఉన్న పాప ఎందుకు? మీరుండిపోండి! బామ్మా! నీకూ ఇబ్బందవుతుంది. అరవిందగారికి తోడుగా ఉండు. పదకొండు గంటలలోగా తిరిగి వచ్చేస్తాం" అంటూ ఆనందరావు బామ్మనూ, అరవిందనూ ఆపేశాడు. కావేరి, సరోజ, ఆనందరావు లీలను చూడ్డానికి వెళ్లారు.

లీలకు తలకు గట్టిదెబ్బ తగిలి రక్తం బాగా పోయింది. స్పృహలో లేదు. కనీసం రెండు బాటిల్స్ రక్తం ఎక్కించాలని డాక్టర్లన్నారు.

కావేరి రక్తం గ్రూపు సరిపోవటంతో ఒక బాటిల్ తీసుకుని ఎక్కించారు. ఆనందరావు తన స్నేహితుడు ఒకతని రక్తం తీసుకునే ఏర్పాటు చేశాడు.

లీల తల్లిదండ్రులకు టెలిగ్రాం ఇచ్చాడు. కావేరిని ఇంటి దగ్గర దింపేసి, సరోజ, తనూ లీల దగ్గర ఉండి సేవలు చేశారు.

దాదాపు వారంరోజులకు లీల డిశ్చార్జి అయి ఇంటికి వచ్చింది. లీల అమ్మా నాన్నలయితే వచ్చారు. కానీ లీల అమ్మగారి ఆరోగ్య పరిస్థితి బాగా లేనందున సరోజ, ఆనందరావు కలిసి వారిని ఊరికి పంపించే




శారు.

ఈ వారంరోజులూ అరవింద లీల ఇంట్లోనే ఉంది. సెలవు పెట్టేసింది. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి, పుట్టింటికెళ్ళిపోతానంటూ రోదిస్తుంటే సరోజ వారించింది.

లీల డిశ్చార్జి అయి వచ్చాక, అందరం కలిసి ఆలోచించి ఓ నిర్ణయానికివద్దాం. త్వరపడి రాజీనామా ఇవ్వకు. అంటూ బలవంతంగా కావేరి, సీతమ్మలు తోడుండటంతో లీల ఇంట్లోనే ఉండిపోయింది. లీల రాగానే అరవింద ఉద్యోగం, సంసారం చర్చనీయాంశమైంది.

"అయితే ఉద్యోగానికి రాజీనామా ఇవ్వాలనుకున్నావా? సరే! ఇచ్చి ఏం చేస్తావు? పుట్టింటికెళతావా? వాళ్లకు భారమవుతావా?" అంది లీల.

"భారమెందుకవుతాను. చదువుంది. నలుగురి పిల్లల్ని పోగేసుకుని ట్యూషన్లు చెప్పుకుంటే నేనూ, నా కూతురు బతకలేమా?"

"ఆ పని ఇక్కడే చెయ్యొచ్చుగా? మళ్లీ పుట్టింటికెందుకు? మీ ఊళ్లో తప్ప ఇక్కడ ట్యూషను చెప్పించుకునేవారు లేరా?" అంది సరోజ.

"కన్నవారిదగ్గరుంటే కాస్త అండ, ధైర్యంగానూ ఉంటుందని" అంది అరవింద.

"ఇదిగో ఇలాంటి పిరికి ఆలోచనలు... మన నరాల్లో ప్రవహించినంతకాలం, పురుషాహంకారానికి, వివక్షతకు గురవుతూనే ఉంటాం"

"ఆడదానికి పుట్టినప్పటినించి చచ్చేదాకా ఎవరిదో ఒకరి అండ ఉండాలన్న మూర్ఖపు సాంప్రదాయాల్ని మూలకు తోసి, కట్టుబాట్లు తెంచుకుని, కళ్లతో కంప్యూటర్లను శాసిస్తున్న మహిళలను అనుసరించినప్పుడే బాగుపడతాం"

"ప్రస్తుతం స్త్రీలు ఆర్థిక స్వాతంత్ర్యం కోసం పరుగులు తీస్తుంటే... నాలుగ్గోడలే స్త్రీకి పరమావధి అన్నట్టు, ఉన్న ఉద్యోగానికి రాజీనామా చేస్తావా? స్త్రీల ఎదుగుదలను అణచివేయటానికి కంకణం కట్టుకున్న పురుషాహంకారానికి ఆజ్యం పోస్తావా?

"కన్నవారి దగ్గరకెళ్లి... భర్తను వదిలేసిన కూతురు కళ్లెదురుగా ఉంటే వారు భరించగలరా?

"పెళ్లికాకముందు కూతురు పుట్టింట్లో ఎన్నేళ్లున్నా, వారికి భారమనిపించదు. అదే పెళ్లయి భర్తను వదిలేసి పుట్టింట్లో ఉంటే అటు సమాజానికి జవాబు చెప్పలేక, ఇటు కూలిపోయిన నీ కాపురాన్ని చూడలేక వారి మనసులనింకా బాధ పెడతావే తప్ప, ఎవరికీ సుఖశాంతులుండవు" అంది లీల.

"అందుకేనే అమ్మాయ్! మొగుడూ, అత్త, అన్న తర్వాత ఏదో మాటలనకపోరు. పడకా తప్పదు. ఏదో అన్నంత మాత్రాన పిల్లనెత్తుకుని ఇల్లొదిలి రాకూడదు" అంది సీతమ్మ హితబోధ ధోరణిలో.

"నువ్వూరుకో బామ్మా! ఏ ఆడపిల్లకయినా భర్తతో సుఖంగా కాపురం చేసుకోవాలని ఉంటుంది. కానీ తెగతెంపులు చేసుకుని పుట్టిల్లు చేరాలనుకుంటుందా? ఆవిడకెంత సహనం నశించి ఉంటే ఇలా వస్తుంది" అన్నాడు ఆనందరావు, సీతమ్మను కసిరినట్టు మాట్లాడుతూ.

"అదీ నిజమేననుకో. అయినా ఈ మగముండావాళ్లు పెళ్లాలను బాగా వేపుకుతింటున్నారట్రా! రోజూ పేపర్లో వార్తలు చూడటంలేదా? పోనీ వాడినిక్కడికి పిలిపించి బుద్ధి చెబితే?" అంది సీతమ్మ.

"చూడు అరవిందా! నీకు నీ భర్త, అత్తగారు ఎన్ని కష్టాలు పెట్టినా, వారితోడిదే జీవితం అనో... లేదా పుట్టిల్లు చేరుకోవటమో, ఈ రెండు ఆలోచనలు తప్ప ఇంకో ఆలోచన చేసేట్టయితే నేనో సలహా చెబుతాను" అంది లీల.

"అటు భర్త దగ్గర కాకుండా ఇటు పుట్టిల్లు కాకుండా... సలహానా? ఏమి టది? " అంది అరవింద నొసలు చిట్లిస్తూ.

"రాత్రంతా రామాయణం విని పొద్దున్నే లేచి రాముడికి సీత ఏమవుతుంది? " అని అడిగినట్టయింది నీ వాలకం.

"ఏం మొగుడు లేకుండా బతకలేవా? "

"పుట్టింటికెళ్ళకపోతే ఏమవుతుంది? "

"ఒంటరిగా ఉద్యోగం చేసుకుని బతక లేవా?

"ఇదిగో లీలా ఇలాంటి పిరికిదానికి సల హాలు చెప్పి బుర్ర పాడుచేసుకోవటం దండగ. దాని ఖర్మకు దాన్ని వదిలెయ్యి!" అంది సరోజ విసుగ్గా.

"నువ్వూరుకో అరవకు" అంటూ సరోజ నోరు మూయించి, "అరవిందా ఆడవాళ్లు భయపడుతున్నంతకాలం మగవాళ్లు అలా భయపెడుతూ, అధికారం చెలాయిస్తూ, అణగదొక్కుతూనే ఉంటారు

"భర్త ఎలాంటివాడయినా అతని పాదాల దగ్గరే నా జీవితం అని నీవనుకునేటట్ట యితే నీకు నేను సలహా చెప్పేదేం ఉండదు

"ఉద్యోగం మానేసి కాపురానికెళ్లిపోయి కలోగంజో తాగి బతుకు" అంది లీల.

"అత్త పోరు, భర్త పోరు పడలేకనేకదా పారిపోయివచ్చాను. నా గురించి నేను ఏ నిర్ణయం తీసుకోలేకనేకదా మీ పంచన చేరాను. తలో మాట అంటూ నన్ను తీసి పారేసి మాట్లాడుతున్నారు" అంది సరోజ వైపు గుర్రుగా చూస్తూ అరవింద.

"ఎవరేం మాట్లాడినా అంతా మీ ఫ్రెండ్సే కదా" అంటూ వాతావరణం తేలిక చేశాడు ఆనందరావు.

"నీ భర్తను శాశ్వతంగా వదలమని నేను చెప్పటంలేదు. ఎలాగూ ఇల్లు వదిలి వచ్చే శావు. కొంతకాలం ఇక్కడే ఉండు. చూద్దాం. మీ వారిలో మార్పు వస్తుందేమో" అంది లీల.

"ఏం మార్పో ఏమిటో నువ్వెంత? నీ ఉద్యోగమెంత అని, అతను వేరే పెళ్లి చేసు కుంటే? " భయంగా అంది కావేరి.

"అంతగా చేసుకుంటే చేసుకోనీ! ఆ వచ్చే దాంతో అతనూ సుఖపడలేడు. దాన్నీ సుఖ పడనివ్వడు. వాళ్ల చావు వాళ్లు చస్తారు. నేనైనా సుఖపడతాను" అంది అరవింద.

"వారెవ్వా! ఏం మార్పు! ఏం మార్పు! మీ మాటలు దివ్యౌషధంలా పనిచేసి అరవింద గారిని ఇట్టే మార్చేశాయండోయ్" లీలవైపు చూస్తూ ప్రశంసించాడు ఆనందరావు.

లీలతోపాటు అందరూ అరవిందవైపు అభినందిస్తున్నట్టు చూశారు.

మళ్ళీ అరవిందే మాట్లాడింది.

"నేను ఏదైనా వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్లో ఉంటాను"

"బలేదానివే చిన్న బిడ్డతో అక్కడ కష్టం. మాస్టారి రూమ్ ఖాళీ చేయించి ఇస్తాను. అందులో వుందువుగాని ఎలాగూ ఆ గది తలుపులు వెలుపలే వున్నాయి. కాకపోతే బాత్‌రూమ్ మాత్రం లీల సర్దుకుంటే సరిపో తుంది. లీలా, నువ్వూ ఒకే బాత్‌రూమ్ వాడుకోవాలి, తప్పదు'' అంది సీతమ్మ.

"హమ్మయ్య ప్రాబ్లం సాల్వ్ అయ్యింది కదా. ఇంక ఎవరిపనులు వాళ్లు చూసు కోండి" అంటూ లేచివెళ్లింది కావేరి.

"వెళ్లొస్తా లీలా! డ్యూటీ టైం చూసుకుని వస్తాను" అని చెప్పి గేటుదాకా వచ్చింది సరోజ.

ఆనందరావు సరోజ వెనకాలే వచ్చి

"నన్నూ రమ్మంటారా తోడుగా..." అని సరోజ తిరిగి చూసే లోపలే... "ఈ పూల చెట్టు ఈమధ్య పూలు బలే పూస్తోంది సుమండీ! నా చిన్నప్పుడు ఈ పూలతో బుడ





గలు చేసి అందరి తలలమీదా ఠపాఠపా కొట్టేవాడిని" అన్నాడు మాట మార్చేస్తూ.

"అలాగా! నా చిన్నప్పుడు ఈ పూలన్నీ ఏరి మాలకట్టి పార్కులో ఉన్న గాంధీతాత మెడలో వేసి దేశభక్తిగీతం పాడేదాన్ని" అంది సరోజ

"అవునా! మీ వంశమంతా దేశభక్తులు, సంఘసేవకులు ఎక్కువగా ఉన్నట్టున్నారు కదూ"

తెచ్చిపెట్టుకున్న నవ్వుతో ఏదో ఒకటి మాటాడి ఆమెను ప్రసన్నం చేసుకోవాల న్నట్టు మాట్లాడసాగాడు.

వీరిద్దరూ గేటు దగ్గరున్న చెట్టుకింద నిల బడి మాట్లాడటం సీతమ్మగారు ఇంట్లోంచి చూసి కనుబొమలు ముడివేసింది.

"ఇంతకీ మీ అక్కగారి పెళ్లి మాటేమిటి? ఆవిడ పెళ్లి చేసుకోదా? " ఆనందరావు మళ్ళీ సరోజను మాటల్లో పెట్టాడు.

"ఆవిడ పెళ్లితో మీకేం పని? " కసిరినట్టు అడిగింది సరోజ.

"మరేం లేదు. ఆవిడ పెళ్లయితే మనకు లైన్‌క్లియర్ అవుతుందికదా! అందుకని"

సరోజ అతని మాటలకు ముసిముసిగా నవ్వింది.

"ఆవిడ ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకోదుట. అహ! అసలు చేసుకోదుట" అంది కిందపడ్డ పూలనేరుతూ.

"ఏం! భీష్ముడిలాగా ఏదైనా ప్రతిజ్ఞ చేసిందా? భీష్మి అని పేరు తెచ్చుకుని పాఠ్యపుస్తకాల్లో కెక్కుతుందా? " వ్యంగ్యంగా అడిగాడు.

"నాకు తెలియదు. మీరే అడగరాదూ"

"సరేలే! ఆ పర్సనాలిటీముందు నిలబడా లంటేనే భయం. మళ్లీ ప్రశ్నలు కూడానా? ఒకపని చేస్తాను. నాకు తెలిసిన యం.ఎల్.ఏ. ఒకాయన ఉన్నారు. అతన్ని పట్టు కుని మీ అక్కను ఈ దరిదాపుల్లో లేకుండా ట్రాన్స్‌ఫర్ చేయిస్తాను" అన్నాడు కసిగా ఆనందరావు.

పక్కున నవ్వింది సరోజ.

"అంతగా ఉడుక్కోనక్కర్లేదు. మా అక్క చాలా మంచిది. కాకపోతే మగాళ్లను అంత తేలిగ్గా నమ్మదు. నాకు మంచి యోగ్యుడిని చూసి పెళ్లిచేయాలనే అనుకుంటోంది" అంది.

"నాకంటే యోగ్యుడా? నన్ను గురించి వివరించలేకపోయారా? "

"మీ అంతట మీరు యోగ్యుడిననుకుని స్వంతడబ్బా కొట్టుకుంటే సరిపోతుందా? ముందు నాకు అన్నివిధాల మీమీద పూర్తి నమ్మకం కలగాలి. ఆ తర్వాతే పెళ్లి" అంది సరోజ చిలిపిగా నవ్వుతూ.

"ఇదిగో మీరు నన్ను మరీ ఆటపట్టిస్తు న్నారు. అసలు నాలో ఉన్న అవలక్షణా లేంటో చెప్పండి చూద్దాం" అంటూ చను వుగా ఆమె చెయ్యి పట్టుకుని ఊపుతూ అడి గాడు ఆనందరావు.

ఇంతలో సీతమ్మగారు పరిగెత్తుతున్నట్టు వారిద్దరి దగ్గరకు వచ్చి "ఒరే ఉమ్మిగా. టి.వి.లో పోట్లాట సీను వస్తోంది చూద్దువు గాని రారా! సూర్యకాంతం, ఛాయాదేవి జుట్లు పట్టుకుని పోట్లాడుకుంటున్నారు. త్వరగా రారా! సీను అయిపోతుంది" అంటూ తొందర చేయసాగింది.

"పోనీలేవే!! నువ్వెళ్లి చూడు నాకక్కర్లేదు" కసురుకున్నాడు ఆనందరావు, కంగారుప డుతూ సరోజ ముఖభావాలను గమనిస్తూ.

"అదేమిట్రా అలాగంటావు. నీ ఆరోగ్యం, నీ క్షేమమేకదా నేను కోరేది. పిచ్చి సన్నాసీ సరోజ ఇలాంటివేవీ పట్టించుకోదులేరా కన్నా" అంది దీనంగా మొహంపెట్టి.

సరోజకేమాత్రం అర్థం కాలేదు.

"అదేమిటండీ! టి.వి.లో పోట్లాట

సీనుకూ, మీ మనవడి ఆరోగ్యానికీ ఏమిటి లంకె?" అంది ప్రశ్నార్థకంగా మొహం పెట్టి!

"మా బామ్మ ఏదో అలా వాగుతుం టుంది. మీరేం పట్టించుకోకండి. మనం బయటికెళదాం పదండి" కంగారుగా అన్నాడు ఆనందరావు.

"మీరుండండి. నేనేం అనుకోను. మీరు చెప్పండి బామ్మా! సస్పెన్సును నేను ఏమాత్రం భరించలేను" అంది సరోజ.

"ఏం లేదమ్మా! వీడికి చిన్నప్పటినించి పోట్లాటలంటే ఇష్టం. ఆ సంగతి వీడికి మాటలు కూడా రాని పసికందుగా ఉన్న ప్పుడే గ్రహించాం. అదెలాగంటే, ఓసారి బాగా పోరుపెట్టి ఏడుస్తుంటే ఇంట్లో ప్రథ మచికిత్సలేవీ ఫలితాలు చూపించకపోవ టంతో డాక్టరు దగ్గరికి తీసికెళ్లాం. ఆయన అన్ని పరీక్షలు చేసి...

"పిల్లాడు ఆరోగ్యంగా ఉన్నాడు. ఏ లోపమూ లేదు. ఏవో ఆటబొమ్మలూ, అవీ చూపి ఊరుకోబెట్టండి" అంటూ చెప్పి పంపాడు.

పిల్లాడి ఏడుపుతో దిక్కుతోచక తిరిగివ స్తున్నాం. దార్లో ఎవరో బాగా కలియబడి పోట్లాడుకుంటున్నారు. మేము నడవటానికి కూడా దారిలేకపోవటంతో ఓ రెండు నిమి షాలు ఆగాల్సివచ్చింది.

అంతే! టక్కున ఉమ్మిగాడి ఏడుపు ఆగి పోయింది. నాగస్వరం విన్న నాగులాగా పోట్లాటను తన్మయంగా చూస్తూ వింటూ ఏడుపు ఆపేశాడు. వాడికి పోట్లాటలంటే ఇష్టమని తేలిపోయింది. నా మాట అబద్ధ మైతే వాడినే అడుగు. స్నానం చేస్తున్న ప్పుడు కూడా దొడ్లో ఎవరిదైనా పోట్లాట వినబడితే చాలు సబ్బు నురగతోనే వచ్చి అలా నిలబడి మైమరచి పోట్లాట

వింటాడు. ఫైటింగ్ లేని సినిమాలు నచ్చవు. మరీ ఇలాంటి శాడిస్టు ధోరణి పని కిరాదురా! రేపు నిన్ను చేసుకునే పిల్లకు ఇలాంటివి నచ్చకపోవచ్చు అని వాడు ఒకటో తరగతి చదివే వయసునించి చెబు తున్నాను వింటేగా?" అంది క్రీగంట సరో జవైపు చూస్తూ సీతమ్మ.

"ఇప్పుడలాంటివేవీ... లేవు. మీరు..." తడబడుతూ ఆనందరావు నోరు విప్పేలో గానే ఆనందరావువైపు అసహ్యంగా చూపో కటి విసిరి చరచరా వెళ్లిపోయింది సరోజ.

బామ్మగారివైపు తిరిగి పళ్లు నూరాడు ఆనందరావు. అదేం పట్టించుకోనట్టు "అన్నం వడ్డించమన్నావేమిట్రా ఆనందూ!" బోడిగుండు మీదున్న కొంగు సవరించుకుని చిద్విలాసంగా నవ్వుతూ అడిగింది సీతమ్మ.



అరవిందకు సీతమ్మగారు గది ఖాళీ చేయించి ఇచ్చింది.

వంటపాత్రలు, ఇంటికి కావలసిన సామాన్లు అన్ని కొద్దికొద్దిగా తెచ్చుకుని గడ పసాగింది.

నిజానికిపుడు అరవిందకు నిశ్చింతగా అని పించసాగింది. పాప, కావేరికి బాగా అలవా టయింది. అన్నం తినిపించటం, స్నానం చేయించటం, నిద్రపుచ్చటం అన్నీ ఎంతో ఇష్టంగా చేసేది. అరవింద డ్యూటీనించి

రాగానే పాపచేసిన అల్లరి, ముద్దుపనులు వివరించి చెప్పి అరవిందను నవ్వించేది.

అప్పుడప్పుడు అరవిందకు భర్త గుర్తు వచ్చినా, అతనితో గడిపిన మధురక్షణాల కంటే ముందుగా చేదు అనుభవాలు గుర్తు వచ్చి అతన్ని జ్ఞాపకాల్లోంచి తరిమేసేవి.

అతని గురించి ఎంత మరిచిపోదామను కున్నా, ఎవరో ఒకరు తటస్థపడి అతని గురించి, అత్తగారి మాటల గురించి అరవిం దకు చెప్పి మనసు నొప్పిస్తూనే ఉన్నారు.

"అదేమిటమ్మాయ్! కరుణాకర్‌ను వది లేసి నువ్వు ఎవరో ఆర్.టి.సి. డ్రయివ రును పెళ్లిచేసుకున్నావట నిజమేనా? " డ్యూటీనుంచి వస్తుంటే నిలబెట్టి మొహం మీదే అడిగేసింది అరవింద భర్త తరపు బంధువులావిడ.

"ఎవరు చెప్పారు? " వళ్లు మండిపోయి అడిగింది అరవింద.

"ఎవరో చెబితే నమ్మే మనిషినా నేను. మీ అత్తగారే స్వయంగా చెప్పింది. చెబుతు న్నప్పుడు నీ మొగుడు పక్కనే ఉన్నాడు కూడా. అతనూ నోరు మెదపకపోయేసరికి నిజమేనని నమ్మేశాను సుమా" అందావిడ దీర్ఘాలు తీస్తూ.

"అలాగా! ఇంకా పెళ్లి చేసుకోలేదండి. ఉద్యోగం చేస్తున్నానుకదా! అతనితో విడా కులు తీసుకుని ఆ తర్వాత పెళ్లి చేసుకుంటే ఏ గొడవా ఉండదుకదా! త్వరలో అవన్ని పూర్తయ్యాక శుభలేఖ పంపిస్తాను. వచ్చి పప్పన్నం తిని ఆశీర్వదించి వెడ్తుదురుగాని సరేనా? " అంది నవ్వుతూ, ముందుకు సాగి పోతూ.

'ఆ! ఏమో అనుకున్నాను గట్టిపిండమే! అమ్మో! ఈ వార్త అరవింద అత్తగారికి చేర వేయాలి. లేకుంటే కడుపు ఉబ్బుతుంది' అనుకుంటూ వెళ్లిపోయిందామె.

ఆ వార్త విని కరుణాకర్ తల్లిమీద చిందులేశాడు. "అంతా నీ మూలంగానే జరి గింది. పిల్లిలాగా పడుండేదాన్ని రెచ్చగొట్టి పులిలా మారేలా ప్రవర్తించావు. అదిప్పుడు గడపదాటి వెళ్లి పరువుతీసి, పగతీర్చుకుం టోంది"

"ఆడదేమిట్రా పగతీర్చుకునేది. ఆడంగి వెధవా? చూస్తుండు. లక్షరూపాయల కట్నంతో దాని జేజెమ్మలాంటి సంబంధం తెచ్చి నీకు పెళ్లిచేస్తాను"

"ఏమిటీ! మళ్లీ పెళ్లా! లక్ష రూపాయలు కట్నమా? పెళ్లిళ్ల పేరమ్మ అని బోర్డేసుకుని ఊర్లో వారందరికి సంబంధాలు చూడు. నా ప్రాణం పోయినా ఇంకో పెళ్లి మాత్రం చేసు కోను"

"అవున్లే! ఎందుకు చేసుకుంటావు? పగ లంతా మగాళ్లను రాసుకు పూసుకు తిరి గొచ్చి నిన్ను మభ్యపెట్టి పక్కలో వగలు పోయే కులుకులాడిని అంత తేలిగ్గా మరిచి పోగలవా? థూ! నీ బతుకు చెడ" అంటూ దుమ్మెత్తిపోసి తిట్టిపోసింది!

"ఛీ! ఈ కొంప నరకమైపోయింది. మీ చావు మీరు చావండి. నేనీ ఇంట్లో ఉండను' ' అంటూ సూట్‌కేసులో బట్టలు సర్దుకుని వెళ్ళిపోయాడు కరుణాకర్!

ఒక వస్తువు విలువగానీ, ఒక వ్యక్తి విలు గానీ లేనప్పుడే తెలిసివచ్చేది.

కరుణాకర్‌కు భార్య దూరమైన తర్వాత పిచ్చెక్కినట్టయింది. తల్లి పెట్టే చిచ్చులతో ఎంత పోట్లాడుకున్నా కళ్లెదురుగా భార్య కనిపిస్తుంటే అదోరకమైన తృప్తిగా ఉండేది. అరవింద పాపతోసహా ఇలా ఇల్లు వదిలిపో తుందని కలలో కూడా ఊహించలేదు.

ఆమె వెళ్లిపోయిన ఓ వారంరోజులు ఆమె కనిపిస్తే చావగొడదామన్నంత కోపం ఆవేశం ఉండేవి.

ఆఫ్టరాల్ ఆడదానికింత పొగరా? సంసా రమన్న తర్వాత కలతలు కొట్లాటలుం

డవా? అందరూ ఇలాగే బరితెగించి ఇల్లు వదిలిపోతారా?

ఏం చూసుకుని ఇంత పొగరు?

ఆ ఉద్యోగం చూసుకునేకదూ?

ఇలా ఆలోచించి బి.పి. పెంచుకునేవాడు.

ఓ పదిరోజులు గడవగానే ఇంటికి రావాలంటే భయపడటం మొదలు పెట్టాడు.

పదేపదే పాప చిరునవ్వులు, అలసిపోయినా, తన ఆలనా పాలనా చూసే అరవింద గుర్తువచ్చి బాధపడేవాడు. క్రమక్రమంగా, అరవిందవైపునించి ఆలోచించటం మొదలుపెట్టాడు.

అలా ఆలోచించటం మొదలుపెట్టినప్పటినించి, తల్లిమీద కోపం రాసాగింది.

అయినప్పటికీ, తల్లికి తను తప్ప ఎవరున్నారు? పాతకాలపు ఛాదస్తం, మూర్ఖురాలు, ముసలావిడ ఆమెను సాధించీ లాభంలేదు...

అతని మనసు ఓసారి భార్యవైపు ఓసారి తల్లివైపు త్రాసులాగా ఊగిసలాడసాగింది.

ఏది ఏమైనా భార్యలేనిలోటు అతనిని తీవ్రంగా బాధించసాగింది.

ఒంటరి స్త్రీ... పసిపిల్లతో... ఉద్యోగం... ఏం అవస్థపడుతున్నదో... ఎక్కడ ఉంటున్నదో?

ఇలా ఆలోచిస్తూ ఆమె గురించి సమాచారం సేకరించాడు.

లీల ఇంట్లో ఉన్నదని ఒకసారీ,

అదే కాంపౌండులో వేరేగది తీసుకుని ఉంటున్నదనీ.

పాప విషయంలో కావేరి సహకరిస్తున్నదని మరోసారీ తెలుసుకుని కాస్త తృప్తిపడ్డాడు.

"ఈ ఇంట్లో ఉండి తనకు సుఖంలేదు. శాంతిలేదు. దాని మానాన అది బతుకుతోంది బతకనీ! ప్రతిసారి దాని ఊసెత్తి ఉసురుపోసుకోవటం ఆపెయ్యి" అన్నాడు రోజూ భార్యమీద చాడీలు చెబుతున్న తల్లితో.

భార్య వెళ్ళి పోయాక కూడా ఆమెకే సపోర్టు చేస్తున్నట్టు మాట్లాడుతున్న కొడుకును చూసి మండిపోయిందావిడకు.

వీడికింకా పెళ్ళాంమీద మమకారం తగ్గలేదు. కారం రాసుకున్నట్టు ఏదైనా వార్త చెబితే తప్ప దారికిరాడు మనసులో అనుకుని వారం తిరక్కముందే "నీ పెళ్ళాం మళ్ళీ పెళ్ళి చేసుకుంటోందిట. ఎవరో ముస్లిం డ్రయివరుట. డ్రయివర్లు, నన్ను చెల్లిలా చూసుకుంటారు అదీ ఇదీ అని పేలిందా? ఉద్యోగం చేస్తోంది కదా కనీసం నీ మొహాన విడాకులైనా కొట్టకుండా దాని ఆగడం చూశావా? వీధి కుళాయి దగ్గర అందరూ నన్ను నిలదీసి నీ కోడలు మళ్ళీ పెళ్ళి చేసుకుంటోందిట నిజమేనా? అని నిలదీసి అడుగుతూ ఉంటే ఉరేసుకుందామనిపించింది. మగాడిలా రాసుకు పూసుకు తిరిగే ఆ ఉద్యోగం ఏమిట్రా అని అప్పుడే అన్నాను. ఏదో ఒక ఉద్యోగం డబ్బు సంపాదిస్తే చాలన్నట్టు కక్కుర్తి మాటలు మాట్లాడావు. ఆ ఉద్యోగంలో ఎలాంటి శీలవతులైనా ఇట్టే చెడిపోతారని ఇప్పుడర్థమైంది" ఆయాసం వచ్చేదాకా వాగిందావిడ.

అరవింద మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందంటే కరుణాకర్ నమ్మలేకపోయాడు. ఈ పుకారు కూడా తల్లి పుట్టించిందేనని ఊరుకున్నాడు. కానీ బంధువులావిడకు అరవింద కనిపించి అవును పెళ్ళి చేసుకుంటున్నాను. అని చెప్పిందని ఆవిడే స్వయంగా వచ్చి చెప్పేసరికి కరుణాకర్‌కు తల తిరిగిపోయింది.

ఉక్రోషం, కోపం, బాధ, దుఃఖం ఏకకాలంలో మిళితమై బాధించగా కోపమంతా తల్లిమీద చూపించి ఇల్లువదిలి వచ్చేశాడు.





నెలరోజులు పిచ్చిపట్టినట్టు రోడ్లు తిరిగాడు.

దగ్గరున్న డబ్బు అయిపోయింది.

స్నేహితుని గదిలో కొద్దిరోజులున్నాడు గానీ ఎవరి బతుకు వారికి భారమవుతున్న ఈ రోజుల్లో ఇంకొకర్ని భరించే శక్తి ఏ స్నేహానికీ ఉండదు.

అంధులోనూ, భార్యను ఇంట్లోంచి తరిమి కొట్టేసిన దుర్మార్గుడిగా ముద్ర ఒకటుండ టంతో, ఎవరూ, సదభిప్రాయంతో చేరదీ యరు.

పరిస్థితుల నర్థంచేసుకుని మళ్ళీ ప్రయి వేటు ఫ్యాక్టరీలో ఉద్యోగానికి చేరాడు. ఓ చిన్న గది అద్దెకు తీసుకున్నాడు.

తల్లి వచ్చి నెత్తీనోరు బాదుకుని ఏడ్చినా ససేమిరా ఇంటికి రానన్నాడు.

"ప్రతి నెలా కొంత డబ్బు పంపిస్తాను. వెళ్ళి మీ అన్నగారి పంచన పడుండు. లేదా ఏ వృద్ధాశ్రమంలోనైనా చేరు అంతే గాని నా దగ్గరకు మాత్రం రావద్దు" అంటూ కసిరాడు.

ఆవిడ శాపనార్థాలు పెడుతూ, ఏడుస్తూ వెళ్ళి పోయింది.

చాలారోజులతర్వాత ఆరోజు కరుణాకర్ ఆర్.టి.సి. బస్సులో ప్రయాణం చేయవలసి వచ్చింది.

తను పనిచేస్తున్న ఫ్యాక్టరీ యజమాని కొడుకు పెళ్ళికి వర్కర్లందరితోపాటు తనూ వెళ్లాడు.

బస్సులో కిటికీ దగ్గరున్న సీటులో కూర్చు న్నాడు. ఓ, లేడీ కండక్టరు టికెట్లిస్తోంది. కరుణాకర్ ఆమెనే గమనిస్తున్నాడు.

ఆమె తన పనిలో నిమగ్నమైపోయింది. ఆమె ఎవరో, ఆమె పేరేమిటో కరుణాకర్‌కు తెలియకపోయినా ఆమె చేస్తున్న వృత్తిలో తన భార్యను ఊహించుకోసాగాడు.

సరైన చిల్లర ఇవ్వకుండా కొంతమంది, లగేజి నడిచే దారిలో వేసి ఇబ్బంది పెడుతూ కొంతమంది.

స్టేజి దాటిపోయాక బస్సు ఆపమని కేక లేస్తూ కొంతమంది.

కండక్టరును సతాయిస్తుంటే... చూస్తూ పాపం... అరవింద కూడా ఇలాంటి అవస్థ లన్నీ పడి ఉద్యోగం చేసి వచ్చేదన్నమాట. అయినా ఏనాడూ తనకు తానుగా అలసట ప్రదర్శించి కోపమూ, విసుగూ తెచ్చుకునేది కాదు. తనూ, తల్లి రెచ్చగొట్టి పోట్లాట పెట్టుకుంటే తప్ప, అనుకోసాగాడు. కిటికీ లోంచి వర్షపు జల్లు ముఖాన పడటంతో ఆలోచనల్లోంచి బయటపడ్డాడు. వర్షం బాగా పెద్దదయింది. బస్సు కాస్త నిదా నంగా పోతోంది. కిటికీకున్న అద్దాలు జరి పాడు.

ఉన్నట్టుండి బస్సు ఆగింది. కనుచీకటి పడుతోంది. ఏదైనా స్టేజి కాబోలనుకుని అద్దాల్లోంచి చూశాడు కరుణాకర్.

పక్కన మరో ఆర్.టి.సి బస్సు నిలబడి ఉంది. ఆ బస్సులో ప్రయాణీకులందరూ ఈ బస్సులో కెక్కసాగారు. ఆ బస్సుకు రిపేర్ వచ్చినట్టుంది అందుకే ఈ బస్సులో నికి ప్యాసింజర్లను ఎక్కిస్తున్నారు అను కుంటూ బయటకు చూడసాగాడు కరుణా కర్.

అతనికి వర్షంలో తడుస్తూ నిలబడ్డ అర వింద ఆమె పక్కన డ్రయివరు కనిపిం చారు. బస్సంతా జనం హడావిడితో గోలగో లగా ఉంది. అరవింద కనిపించటంతో ఆమె మాటలు వినాలనిపించి కిటికీకున్న అద్దాలు కొద్దిగా తెరిచాడు.

డ్రయివరు అరవిందతో అంటున్నాడు. నువ్వూ బస్సెక్కి వెళ్ళిపోమ్మా! వర్షం ఎక్కు వైంది. డి.యం.గారికి విషయం చెప్పితే నేను రావటానికి ఏర్పాటుచేస్తారు. అంటు న్నాడు అరవిందతో.





"అలాగేలే అన్నా. కాస్త వర్షం తగ్గాక ఆ గుడిసెల్లో వాళ్లతో తినటానికేమైనా దొరుకుతుందేమో కనుక్కో. వెళ్ళొస్తానన్నా" అంటూ అరవింద బస్సెక్కింది.

కరుణాకర్‌కు వాళ్ళిద్దరు డ్రయివరు కండక్టర్లలాగా అనిపించలేదు. ఒకర్ని గురించి ఒకరు తాపత్రయపడే రక్తసంబంధీకుల్లా అనిపించారు.

కరుణాకర్ ఎక్కిన బస్సులోని కండక్టరు అరవిందకు నేప్‌కిన్ ఇచ్చింది. ముఖమూ తలా తుడుచుకుని ఆమె పక్కన కూర్చుంది.

కూర్చోబోతూ వెనుకసీటులో తదేకంగా తననే చూస్తున్న కరుణాకర్‌ను చూసి ఓ క్షణం కలవరపడింది. చాలారోజుల తర్వాత భర్తను చూశానన్న ఆనందం... బాధ... మిళితమై కన్నీటిరూపంలో సుడులు తిరగబోయింది.

కనుకొలకులు దాటకుండానే ముఖం తుడుచుకునే నెపంతో నేప్‌కిన్ ముఖానికద్దుకుంది అరవింద.

★ ★ ★

"సారథిగారికి,

మీ ఉత్తరం చేరింది. నాకు ఉత్తరాలు రాయటం ఉపమానాలు చెప్పటం రాదనుకోండి. అయినా మీ ఉత్తరం చదివాక ఏదైనా కవిత్వం నేనూ రాయగలిగితే బావుండుననిపిస్తుంది ఎందుకో మరి! మండుటెండలో నడచివచ్చి గుబురుగా ఉన్న చెట్టుకింద సేదదీరినట్టు, కొత్త ఆవకాయతో అన్నం కలుపుకు తిన్నట్టు, ఘంటసాల పాటవింటున్నట్టు, వగైరా వగైరా అనుభూతులన్నీ మీ ఉత్తరం మోసుకొచ్చి మనసును తేలిక పరుస్తుందంటే నమ్మండి.

ఏమిటి నవ్వుతున్నారా?

ఇన్నాళ్ళకు ఈ కలం నేస్తం కలం పదునెక్కిందేమిటా అని!

ఆరు నెలలు సావాసం చేస్తే వారు వీర

వుతారుట కదా! మీ సావాస దోషమే మరి!

మీ పెళ్ళికి మీ నాన్న విలన్ అని రాసే వారు కదా! నా పెళ్ళికి కూడా మానాన్న విలనయ్యాడు.

ఓ నెల క్రితం ఎందుకో నా జీవితం అర్థంపర్థంలేనిదిగా అనిపించింది. ఉదయం లేవటం డ్యూటీకెళ్ళటం... హడావిడి... రావటం... ఏదో కాస్త తినటం... పడుకోవటం... ఇదేమిటి? ఇంతేనా? జీవితమంటే... మరీ ఇంత రొటీన్ బతుకా? యంత్రంలా ఇలా పనిచేసుకుంటూ పోతే కొన్నాళ్ళకు ముసలిదాన్నవుతాను. ఆ తర్వాత బి.పి., షుగర్... ఫటాఫట్ చస్తాను. ఎవరో ఈడ్చి అవతల పారేస్తారు. అంతేనా?

నాకంటూ ఓ మనిషి... నాకోసం బాధపడే మనిషి... తపించే మనసు... నన్ను ఓ దార్చే మనిషి... నాక్కావాలని గాఢంగా అనిపించింది.

అంతే!

అర్ధరాత్రి లేచి కూర్చుని, నాన్నకు సిగ్గువిడిచి "నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను వరుణ్ణి వెదకండి" అని రాశాను.

తిరుగుటపాలోనే ఆయన దగ్గర్నించి ఉత్తరం వచ్చింది.

"అమ్మా! నీ పెళ్ళి గురించి నాకు మాత్రం బాధ్యతలేదా తల్లీ! పేరయ్యగారిద్వారా వాకబు చేశాను. ఈరోజుల్లో అన్నివిధాల బాగున్నవారికే పెళ్ళిళ్ళు కుదరటం కష్టమవుతోంది. అంటూ కారణాలు ఏకరువు పెట్టాడు!

అలాంటిది పీటలమీది పెళ్ళాగిపోవటం ఓ కారణమైతే, రెండోది మగాళ్ళతో రాసుకు పూసుకు తిరిగే ఉద్యోగమాయె!

ఇది ఆంధ్రదేశమే కానీ, అమెరికా కాదు కదమ్మా ఎవర్నిపడితే వారిని పెళ్ళాడి, ఎప్పుడంటే అపుడు విడాకులు తీసుకోటా

నికి.

నీకు వరుడిని వెతికే విషయంలో నా చెప్పులరిగి పోయాయనుకో. అయినా నా ప్రయత్నం నేను చేస్తూనే ఉన్నాను. మీ అమ్మకు ఈ నెలలో ఆపరేషను అవసరమౌతుంది. ఓ పదివేలు సర్దాలి. మీ అమ్మకు నీవే దిక్కు మరి. తల్లిపోతే సంపాదించుకోగలమా?"

అంటూ బీద అరుపులతో ఉత్తరం రాశాడు నాన్న. ఉత్తరం చూసి కాసేపు బాధపడ్డాను. నానా తంటాలు పడి డబ్బు సర్ది పంపించాను.

ఆ మరుసటి నెలలో బస్సులో పేరయ్యగారు కనిపించారు. అతనితో మాట్లాడాలనిపించలేదు. కానీ అతనే నన్ను వెంబడించి మరీ వచ్చి మాట్లాడాడు.

"అదేమిటమ్మాయ్! పెళ్ళివద్దన్నావట. కండక్టరు పని చేసేనన్నెవరు చేసుకుంటారు? ఒకవేళ చేసుకున్నా సుఖపడటం అంటూ ఉండదు. కొడుకు ఎలానూ మిమ్మల్ని ఆదరించటంలేదు. జీవితాంతం నా డబ్బుతో మిమ్మల్ని పోషిస్తాను అన్నావట! నిజమేనా? నీకేమైనా పిచ్చా? కండక్టరు పనిచేసే అమ్మాయిలకు నలుగురికి పెళ్ళిళ్ళు చేశాను. లక్షణంగా కాపురాలు చేసుకుంటూ, ఉద్యోగమూ చేస్తున్నారు. ఎవడో తలమాసిన వెధవ కండక్టరు ఉద్యోగాన్ని కించపరిస్తే మగాళ్ళందరూ అలాంటి వారే అని అపోహపడి పెళ్ళిమానేస్తావా? అయినా మీ నాన్న మాటలు పూర్తిగా నమ్మలేదనుకో. మీ నాన్నకు నీవు బంగారు గుడ్లు పెట్టే బాతువయ్యావు. పెళ్ళిచేస్తే రాబడి తగ్గుతుందని కూడా నీ మనసు విరగ్గొట్టి ఉంటాడని నా అనుమానం.

ఆ మధ్య నీవు మీ అమ్మ ఆరోగ్యం గురించి పదివేలు డబ్బు పంపావటగా? ఆ డబ్బుతో ఆమె ఆరోగ్యం గురించి ఖర్చుపెట్టటం అటుంచి, మీ తమ్ముడి కొడుకు పుట్టిన రోజుట. వాడి మెడలో ఓ పులిగోరు చైనుంటే బావుంటుంది. అంటూ నీ డబ్బుతో కొని ఆర్భాటంగా వేసి వచ్చారుట.

ఇలాంటి విషయాలన్నీ నాకెలా తెలిసాయా? అని ఆశ్చర్యపోతున్నావా? మా ఇంట్లో ఆడవాళ్ళు చెప్పారులే!

"సరే! వాళ్ళ సంగతి వదిలెయ్యి!

"మీ నాన్నద్వారా అయితే మాత్రం నీ పెళ్ళి ఈ జన్మకు జరగదు.

"నా కూతురిలాంటిదానివి.

"ఒకసారి నేను తెచ్చిన సంబంధంతో నీ పెళ్ళి ఆగిపోయింది. మళ్ళీ ఇపుడు నేను తెచ్చే సంబంధంతోనే నీ కాపురం చూడాలనుంది. కాదనకు"

అంటూ నచ్చచెప్పాడు.

"నాకిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు. ప్రస్తుతం నావయసు ఇరవై రెండు. ఇంకో రెండేళ్ళలోగా చేసుకుంటాను. అపుడు మీకు తప్పక కబురు పంపిస్తాను" అంటూ అతన్ని వదిలించుకున్నాను.

అతనిద్వారా మా అమ్మానాన్నల గురించి తెలుసుకొని షాకయ్యాను.

ఏ తండ్రయినా కూతురి పెళ్ళి చూడాలనుకుంటాడు కానీ... ఇలా...?

తండ్రి సరే... అమ్మ!

నా డబ్బుతో ఇంట్లోంచి తరిమేసిన కొడుకు కొడుక్కి గొలుసు...

"అంటే వారి మనసుల్లో... కాదు... వారి నరనరాల్లో వంశోద్ధారకుడు. పున్నామనరకంనించి కాపాడేవాడు, మగపిల్లవాడు. అన్న భావాలు రక్తంరూపంలో ఎలా ప్రవహిస్తున్నాయో చూడండి!

వాళ్ళనించి పిచ్చిదానిలా నేను ప్రేమను, ఆప్యాయతను ఆశించటం పిచ్చిగా లేదూ!

అది ఈ జన్మకు సాధ్యమవుతుందా?




దాదాపు పదిరోజులు మనసు మనసులో లేదు.

అయినా నా జీవితంలో నాకు అనుకూలంగా, నేను ఆశించినవి ఏం జరిగాయిగనుక.

ఇపుడిలా బాధపడటం వ్యర్థం అని నన్ను నేను సముదాయించుకున్నాను. అయినా ఇప్పుడేమయిందని? కొంపలు మునిగిపోయినట్టు ఇలా బాధపడుతున్నానేమిటి? అనుకుని ఊరడిల్లాను.

ఏమిటి నా ఉత్తరం బోర్‌కొడుతోందా?

నిట్టూర్పులు విడుస్తున్నారు! ఇక బాధపెట్టను లెండి ముగిస్తున్నాను.

మీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ...
లీల. "

ఉత్తరం రాయటం పూర్తిచేసి కవరులో పెట్టి అతికించి గది తాళంవేసి బయటకొచ్చింది. బయటకురాగానే కనిపించిన దృశ్యంచూసి అలాగే నిలబడిపోయింది లీల. కందస్వామి, కావేరి పాపను ఆడిస్తూ వాళ్లూ చిన్నపిల్లల్లా మారిపోయి ఆడుకుంటుంటే ఆ దృశ్యం ఇంకా చూడాలనిపించింది లీలకు. అలాగే అయిదు నిమిషాలు నిలబడి కన్నార్పకుండా చూడసాగింది. పక్కున ఇటు తిరిగిన కందస్వామి లీలను చూసి సిగ్గుపడ్డట్టు అటూ ఇటూ కదిలి "ఏమిటి లీలమ్మా డ్యూటీకెళ్లలా" అన్నాడు తడబడుతూ.

"ఈ రోజు డ్యూటీ కెళ్ళకుండా మీతో పాటు నేనూ పాపతో ఆడుకోవాలనుకుంటున్నానన్నయ్యా" అంది లీల.

కందస్వామి నవ్వేసి "బలేదానివి" అంటూ బయట కెళ్ళిపోయాడు.

"కాసింత లేదు దీని అల్లరిచూడు లీలా! దారంట వచ్చిపోయేవారినందరినీ కొడతానంటు బెదిరిస్తుంది" అంటూ పాప అల్లరి పనులను గూర్చి చెప్పసాగింది. కావేరి!

పాపను కావేరికి అప్పచెప్పి నిశ్చింతగా ఉద్యోగం చేసుకుంటోంది అరవింద. కందస్వామి, కావేరిలు ఇంతకుమునుపు చీటికీ, మాటికీ గిల్లికజ్జాలు పెట్టుకునేవారు. ఇపుడు పాపవల్ల అటువంటి పరిస్థితులకు అవకాశం దొరకటంలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు లీలా?" అంది కావేరి.

"చిల్డ్రన్ కేర్ సెంటర్‌ను, నువ్వు ప్రారంభిస్తే ఎలా ఉంటుంది అని ఆలోచిస్తున్నాను... ఆగాగు... ముందు నన్ను మాట్లాడనీ, ఈ వీధిలోనే నాకు తెలిసిన ఉద్యోగినులు పిల్లలతో సతమతమవుతూ, పనిమనుషులమీదా, పక్కింటి వారిమీదా ఆధారపడటం, బాధపడటం చూస్తున్నాను. నీవు నెలకు కొంత డబ్బు వారినించి జీతంలాగా తీసికొని, ఉదయంనించి, సాయంత్రం దాకా వారిని జాగ్రత్తగా చూసుకుంటే చాలు. ఎలాగూ ముందుగది మీరు ఎక్కువ వాడుకోరు కదా. మీ వారు కూడా ఈ విషయం గురించి అభ్యంతరపెట్టరని అనుకుంటున్నా, ఎందుకంటే ఆయనకూ పిల్లలంటే ప్రేమ ఉన్నట్టు తెలుస్తోంది. ప్రతి రూపాయకూ ఆయనమీద ఆధారపడకుండా నీకూ ఆర్థికస్వాతంత్రం ఉంటుంది. ఆలోచించు అంది లీల.

"అయిడియా బాగానే ఉంది. కానీ నేను సమర్థవంతంగా నిర్వహించగలనా అన్నదే అనుమానం" అంది కావేరి.

"అదే... ఆ అనుమానాలు పక్కకు పెట్టి ఆత్మవిశ్వాసంతో ఈ పని నేను చెయ్యగలను అనుకుంటే చెయ్యగలవు. ఊరికే కూర్చుని నా మొగుడు నాకు పదిరూపాయలు కూడా ఇవ్వడు.

పెత్తనం కట్టడు. అని అతన్ని ఆడిపోసుకుంటూ, ఇతర స్త్రీలతో పోల్చుకుంటూ, కుళ్ళుకుంటూ ఉండటం కంటే ఇంట్లోనే



ఉంటూ నీకు చేతనైన పని చేసి డబ్బు సంపాదిస్తే ఎంత తృప్తిగా, గర్వంగా ఉంటుందో ఆలోచించావా? " అంది లీల.

"అమ్మా! తల్లీ! నీతో తడుముకుంటే చాలు, ఉపన్యాసాలతో చంపేస్తావు. అలాగే చేస్తాను. కానీ ఈ వీధిలో ఎవరు ఉద్యోగాలు చేస్తున్నారో, ఎవరికి పిల్లలతో అవస్త ఉందో నాకు తెలీదు. వారినిక్కడికి పంపే బాధ్యత నీదే" అంది కావేరి.

"నీనించి గ్రీన్ సిగ్నల్ వచ్చింది కదా మిగతా పని నాకొదిలెయ్. ఈరోజు డ్యూటీ కెళుతున్నాను. రేపటినుంచి ఆ కార్యక్రమం చూస్తాను" అంటూ పాపను ముద్దాడి బయల్దేరింది లీల.

గేటుదాటకముందే, అరవింద హడావిడిగా వచ్చింది. లీలను చూసి "హమ్మయ్య నువ్వు డ్యూటీ కెళ్ళిపోయావేమోనని హడావిడిగా పరిగెత్తుకుంటూ వచ్చాను. అర్జంటుగా వెయ్యిరూపాయలు కావాలి" అంది అరవింద. ఆమె ముఖం వాడిపోయి ఉంది. కళ్ళు భయంతోనూ బాధతోను విలవిల్లాడుతున్నాయి.

"ఏమిటి ఏం జరిగింది? " అంది కంగారుగా లీల.

"మా అత్తగారికి కాలు విరిగింది. హాస్పిటల్‌లో అడ్మిట్ చేసి వచ్చాను. ఎముక విరిగినట్టుంది. బాధతో విలవిల్లాడుతోంది. ఎక్స్‌రేలు వగైరా పరీక్షలకు, కట్టుకట్టడానికి మొత్తం వెయ్యి రూపాయలు ఖర్చవుతుందిట. నువ్వే ఎలాగైనా సర్దాలి!" అంది ఆత్రుతనిండిన స్వరంతో.

"ఎలా విరిగింది? ఎక్కడ విరిగింది? అసలు ఆ సంగతి నీకెలా తెలుసు? " కావేరి ప్రశ్నించింది.

"మావారు ముసలావిడను ఆవిడ మానాన ఆవిడను వదిలేసి వేరే రూం తీసి కొని ఉంటున్నారట. పాపం ఈవిడ వాళ్లన్న గారి పంచన కొన్నాళ్లుండి అక్కడా సరిపడక తిరిగి ఈ ఊరొచ్చింది. దిగులుతో సరిగా భోంచెయ్యటంలేదేమో. బాగా సన్నబడింది. బస్సు దిగి రోడ్డు దాటబోతుండగా ఎవరో స్కూటరువాలా కొట్టేసి వెళ్ళిపోయాడట. కింద పడి విలవిల ఏడుస్తోంది. సరిగ్గా అప్పుడే నేను డ్యూటీ దిగి వస్తున్నాను. జనం గుమిగూడారేమిటా అని వెళ్ళి చూద్దునుగదా అత్తగారు. నన్ను చూసి చిన్నపిల్లలా వాటేసుకుని వలవలా ఏడ్చేసింది. అప్పటికప్పుడు ఆటో ఎక్కించి హాస్పిటల్లో చేర్పించి, ఇంటికి పరిగెత్తుకొచ్చాను." అంది అరవింద గబగబ, మూడు ముక్కల్లో చెప్పి ముగిస్తున్నట్టు.

"చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవా అంటారు. భార్యా భర్తలను విడగొట్టిన పాపం ఊరికే పోతుందా? దేముడు కాలు విరిచేశాడు. రోడ్లో పడినదాన్ని అలాగే పడుండనీయక పోయావా? ఇంకో లారీనో, బస్సో వచ్చి ఓసారి ఎక్కి పైకి తీసికెళ్ళిపోవును. మళ్ళీ హాస్పిటల్ ఖర్చు దండగ. ఇప్పుడైనా మునిగింది లేదు. ఆవిడ చావు ఆవిడ చస్తుంది. హాస్పిటల్ ఛాయలకెళ్లొద్దు" అంది కావేరి, అరవిందనుద్దేశించి.

అరవింద కళ్ళ వెంట నీరు ధారాపాతంగా కారసాగింది. "అలా అంటావేమిటి కావేరీ! ఎంత చెడ్డా ఆవిడ నా అత్తగారు. నా భర్తకు తల్లి. నాకూ తల్లితోసమానం. ముసలితనం వల్లనో, ఛాదస్తం వల్లనో నన్ను బాధపెట్టి ఉండవచ్చుగాక. అటు ఆయనా, ఇటు నేనూ పట్టించుకోకపోతే, ఆవిడ పరిస్థితి ఏమిటి? అనాథలాగా రోడ్డుకు వదిలెయ్యమంటావా? అలా నా మనసొప్పదు. నావల్లకాదు కూడా" అంది ముక్కు చీదుతూ అరవింద.

"నీమీద అభిమానం కొద్దీ కావేరి అలా మాట్లాడుతుందంతే. ఆమె కూడా ముసలావిడ పరిస్థితి చూస్తే ఇట్టే కరిగిపోతుంది.





అంత మానవత్వం లేని మనిషేంకాదు. కావేరి మాటలు నువ్వేం పట్టించుకోకు. డబ్బు తీసికొనివస్తాను. ముందు హాస్పిటల్ కెడదాం పద. అన్నట్టు నాకు డ్యూటీకి టైం అవుతోంది. కావేరిని తోడుతీసికొని హాస్పిటల్ కెళ్ళు. వీలయితే నేను ఈరోజు డ్యూటీ క్యాన్సిల్ చేసుకుని హాస్పిటల్ కొస్తాను" అంది లీల.

"అనవసరంగా డ్యూటీ రద్దుచేసుకోవటమెందుకు? డబ్బుంటే చాలు డాక్టర్లు వాళ్ల పని వాళ్ళు చేస్తారు. ఎవరుండి చేసేదేం లేదు. నువ్వు డ్యూటీ ముగించుకుని రా!" అంది అరవింద.

"నేను వెడతాలే లీలా! నువ్వు డ్యూటీ కెళ్ళు" అంది కావేరి.

"చూశావా కావేరి మనస్తత్వం" అన్నట్టు అరవిందవైపు కళ్లెగరేసి చూసి నవ్వుతూ వెళ్ళొస్తానంటూ చెప్పి గేటుదాటింది.

ఏమిటో ఆడవాళ్ళ మనస్తత్వం.

మొన్నటిదాకా అరవింద, అత్తగారూ కారాలు మిరియాలు నూరుతూ... ఒకరి మీద ఒకరు చాడీలు...

ఇల్లు రణరంగం కావటం...

ఇల్లొదిలి రావటం...

ఇక జన్మలో వారిమొహం చూడననీ, తన బతుకు తాను బతుకుతానన్న అరవింద అత్తగారినాస్థితిలో చూసి మనసు కరిగిపోయి ఎంతో తల్లడిల్లిపోవటం!

తన బతుకు బజారుకెక్కించిన అత్తపై కఠినంగా ఎందుకు ఉండలేకపోతోంది?

కేవలం స్త్రీ కావటంవల్లనేనా?

స్త్రీ సహజమైన కరుణ, జాలి, క్షమాగుణాలు ఆమెనింకా వత్తిడికి గురిచేస్తున్నాయా?

తన సంగతి మాత్రం!

ఇప్పటికీ తన గురించి ఆలోచించని తల్లిదండ్రులకు, రక్తమాంసాలు ధారపోసి సంపాదించిన డబ్బు పంపటంలేదూ!

ఆ డబ్బు తల్లిదండ్రులు వినియోగించుకోవటం లేదని తెలిసీ వారిని పల్లెత్తుమాట అనలేకపోతోంది ఎందుకని?

ఇదే పరిస్థితి మగవారికొస్తే ఇంత నిబ్బరంగా ఉండగలరా? ఇల్లు పీకి పందిరెయ్యరూ!

అంతెందుకు ఇంకో నెలకో రెండు నెలలకో మరో రెండు మూడు వేలు సర్దమని నాన్నరాసినా... తను పంపిస్తుందే తప్ప పోట్లాటకు దిగదు. ఎప్పటికప్పుడు కరుణ, జాలి మిళితమై రాజీపడిపోయే గుణాలు రక్తంలో ప్రవహిస్తున్నంతకాలం... ఆడవాళ్ళ బతుకులకు మోక్షం ఉండదు.

ఆలోచిస్తూనే బస్టాపుకొచ్చింది లీల. ఆలోచనలకు ఫుల్‌స్టాప్‌పెట్టి డ్యూటీలో నిమగ్నమై అందరికీ టికెట్లిస్తూ వచ్చింది.

సరిగ్గా డ్రయివరు వెనుక సీట్లో ఒకతను కూర్చున్నాడు. నిండా నలభై ఏళ్ళుంటాయేమో... భారీ మనిషి. ఖద్దరు పంచె తెల్లటి జుబ్బా... పెద్ద మీసాలు చూడ్డానికే భయంవేసేలా ఉన్నాడు.

ముగ్గురు కూర్చునే సీటులో ఒక్కడే కూర్చున్నాడు. పైగా అది ఆడవాళ్ల సీటు. లీల ఒకసారి బస్సంతా పరికించి చూసింది. ఆడవాళ్లెవరు నుంచోలేదు. బస్సు పెద్ద రద్దీగాలేదు. పోనిద్దూ! కూర్చుంటే కూర్చున్నాడు. కొంపదీసి చదువురాదేమో ఆడవాళ్లెవరైనా వస్తే లేచి వెళ్లాలనైనా తెలుసో లేదో మహానుభావుడికి. తెలుగు సినిమాలో విలన్‌లాగా ఉన్నాడు అనుకుంటూ అతనిక్కాడా టిక్కెట్ ఇచ్చేసి తన సీట్లో కొచ్చి కూర్చుంది లీల.

ఫస్టు స్టేజిరాగానే ఇద్దరు ముగ్గురు మాత్రం దిగి ఓ ఇరవైమంది ఆడామగా ఎక్కారు. వాళ్లలో ఓ గర్భవతి కూడా

ఉంది.

ఆడవాళ్ల సీట్లో కూర్చున్న అతన్ని లేపటానికి ధైర్యం చాలదన్నట్టు కండక్టరమ్మా నిండు చూలాలు నిలబడలేదు సీటు చూపించమ్మా! అంటూ గర్భవతి తల్లి బతిమిలాడే ధోరణిలో అడిగింది.

లీలకు అతన్ని చూస్తే కాస్త భయమనిపించినా డ్యూటీపరంగా అతనితో మాట్లాడక తప్పలేదు "అన్నా! ఇది ఆడవాళ్ల సీటు లేచి వెనక్కి వెళుదువుగానిరా" అంది లీల.

"ఏందీ! ఆడాళ్ల సీటా? అయితే ఏందంట. కూర్చున్న నన్ను లేపటానికి నీకెంత ధైర్యం!" కటువుగా అనేశాడతను.

ఇతను నిజంగా విలనే మనసులో అనుకుంది. "అది కాదన్నా ఆ అమ్మాయి గర్భవతి పాపం నిలుచోలేదు!" అంది మరోసారి.

"నిలుచోలేకపోతే నాపక్కన కూర్చోమను. నేను మాత్రం లెగను!" అన్నాడతను మీసాలు దువ్వుకుంటూ.

లీల గర్భవతితో కల్పించుకుని "వెళ్లమ్మా వెళ్లు కూర్చో" అంది.

"అతని పక్కనా? " సంశయిస్తూ అడిగింది.

"అంతమాత్రం అతన్నక్కడినుంచి లేపలేకపోయాక నీ ఉద్యోగమెందుకూ!" మొహం మీదే అనేసింది ఆ అమ్మాయి తల్లి.

మనసు చివుక్కుమంది లీలకు, తమాయించుకుని 'నీకు సీటు కావాలి. నుంచోలేవు. అక్కడ కూర్చుంటే తప్పేంటి? మీ అన్న పక్కన నువ్వు కూర్చోవా? కూర్చోపల్లేదు. ఎవ్వరేం అనుకోరు. ఎవరైనా అనుకున్నా కాన్పుకు పుట్టింటికి చెల్లెల్ని తీసుకుపోతున్నాడనుకుంటారు!" అంది లీల నవ్వుతూ. ఆ అమ్మాయి ఠక్కున అతని పక్కన కూర్చుంది. కిటికీ వారగా అతనే జరిగి సర్దుకున్నాడు లీలవైపు గుర్రుగా చూస్తూ!

మరో రెండు స్టేజీలు దాటగానే ఆ అమ్మాయి మళ్లీ లీలనుద్దేశించి "కండక్టరమ్మా కడుపులో వికారంగా ఉంది వాంతి అయ్యేట్టుంది. నేను కిటికీ వార కూర్చుంటాను" అంది ముఖం దీనంగా పెట్టి.

"అన్నా! మీరివతలకురండి ఆ పిల్లకు వికారంగా ఉందిట" అంది.

"ఏం తమాషాగా ఉందా? వచ్చి పక్కన కూర్చుంది చాలక. అక్కడికీ ఇక్కడికీ డ్యాన్స్ చేయిస్తారా? " అన్నాడు గట్టిగా అతను.

అప్పటిదాకా డ్రయివరు కలుగచేసుకోకుండా వింటున్న వాడల్లా బస్సు సడన్ బ్రేకువేసి "ఆడవాళ్ల సీట్లో కూర్చోకూడదయ్యా మగడా అంటే కూర్చుని పైగా దబాయిస్తున్నావు ఏందయ్యా నీకత" అన్నాడు గట్టిగానూ కోపంగానూ.

"నా యిష్టమొచ్చిన చోట కూర్చుంటా ఈ బస్సు నీయబ్బ సొమ్మా! అక్కడ కూర్చో ఇక్కడ కూర్చో అని చెప్పటానికి నువ్వెవరు? ఊరికే బస్సు తోలుకోరా డ్రయివరు నాకొడకా అంటే.. నాకు రేగిందంటేనా నువ్వు, ఈ కండక్టరు ఆడది ఇద్దరూమటాష్ అయిపోతారు జాగ్రత్త. ఖూనీలు చేసి జైలుకు పోయివచ్చిన నా కొడుకుని" అంటూ నోటికొచ్చినట్టు తిట్టసాగాడు.

అతన్నించి తాగిన కంపుగుప్పుమంది! లీలకు భయమేసింది. డ్రయివరునుద్దేశించి "అన్నా! నువ్వూరుకో పక్క స్టేజిలో అతను దిగిపోతాడు గొడవెందుకు? " అంది.

"ఆ! అట్లగడ్డి పెట్టు! అవునూ నువ్వు అందర్నీ అన్నా అనిపిలుస్తావు. బావ అని పిలవటం నేర్చుకో! బతికి బాగుపడతావు" అన్నాడు.

లీల డ్రయివరువైపు అర్థింపుగా చూసి బస్సు స్టార్టు చేయమని సైగచేయటంతో




బస్సు స్టార్టు చేశాడు. గర్భవతి అమ్మాయి వాంతి నాపుకుంటున్నట్టు నోటికి కొంగు అడ్డంపెట్టుకుని బాధపడుతోంది.

ఇదంతా చూస్తున్న ప్రయాణికుల్లో కూడా సహనం చచ్చిపోయింది.

"ఏమిటయ్యా! ఆడకూతురు అందునా గర్భవతి అవస్తపడుతుంటే ఇవతలికి రావేమిటి!" అంటూ ఒకరిద్దరు కేకలేశారు.

"నోరుముయ్యండిరా ఖూనీలు చేసొచ్చిన నా కొడుకుని నన్ను తగులుకున్నారంటే మటాష్!" అంటూ అరిచాడు.

గొడవ ఇలా జరుగుతుండగానే అతను దిగవలసిన స్టేజి రావటమూ, గర్భవతి అమ్మాయి అతనిగుడ్డల మీద పడేట్టు వాంతి చేసుకోవటం ఒకేసారి జరిగాయి. "నీయమ్మ నా గుడ్డలు ఖరాబుచేస్తావా!" అంటూ ఆ అమ్మాయి జుట్టుపట్టుకున్నాడు. లీలతోసహా నలుగురైదుగురు ప్రయాణీకులు ఆ అమ్మాయినుంచి అతన్ని విడిపించి బస్సు దింపేశారు. బూతులు తిడుతూ దిగిపోయాడతను. "అన్నయ్యా! తమ్ముయ్యా! అంటే ఈ రోజుల్లో ఎవరూ దారికి రారమ్మో కండక్టరమ్మా. మొట్టమొదట నువ్వు టికెట్లు ఇచ్చేటప్పుడే ఇది ఆడాళ్ల సీటు లేస్తావా లేదా అని అక్కణ్ణుంచి లేపుంటే కథ ఇంత దూరం వచ్చేదికాదు" ప్రయాణీకులు తలో మాటా అంటున్నారు.

"ఊరికే టికెట్లు కొట్టి నెల జీతం తీసుకుందామనుకుంటివా? ఎట్టా ఎట్టా నా కొడుకులతో ఏగాల ఏందనుకుంటివో!"

"అట్టకాదుగానీ కరాటే నేర్చుకో. ఇట్టాంటి నాయాల్లను సావగొట్టి కిందికి తొయ్యొచ్చు"

"నీమీద, డ్రయివరు మీద పగబట్టినా పట్టి ఉంటడు. కొన్నాల్లు రోడ్లో పోయేటపుడు సూసినడుసుకోండి"

"ఆ వాని మొగం ఖూనీలు చేసినా ఖూనీలు చేసినానని వదరుతున్నాడంతే! తాగుబోతు నాయాలు. మీసాలు పెంచితే భయపడతారని పెంచినాడు. వాడేం సేస్తడు"

తలో మాట అంటున్న ప్రయాణీకులకు ఇవ్వవలసిన చిల్లర ఇస్తూ, వారి మాటలు వింటూ ఆలోచిస్తుండగానే బస్టాండు వచ్చేసింది.

హమ్మయ్య అనుకుంటూ బస్సు దిగింది లీల.



"నిజంగా మీరు నన్ను పెళ్లి చేసుకుంటారా?" సూటిగా అడిగింది సరోజ ఆనందరావును.

చాలా రోజుల తర్వాత వారిద్దరూ పార్కులో కలుసుకున్నారు. ఆదివారమేమో పిల్లలు, పెద్దలతో పార్కు బాగా సందడిగా ఉంది.

"పార్కుకెడదాం వస్తారా?" అన్నాడు ఆనందరావు ఉదయమే!

"వస్తాను! వెళ్లేలోగా మీ బామ్మనుంచో మీనుంచో మూడ్ చెడకుండావుంటే!" అంది సరోజ.

"మీరు మరీ సెన్సిటివ్ సుమా! మీకు పెద్ద వాళ్లెవరూ లేనందువల్ల అన్నీ అలా అనిపిస్తాయి. అందులోనూ ముసలాళ్లతో అనుభవించటం కష్టం! వాళ్ల ఛాదస్తం

మాటలు అసలు పట్టించుకోకూడదు. గుర్తూ పెట్టుకోకూడదు!" అన్నాడు.

"ఏం ఛాదస్తం కాదులెండి! ముసలాళ్లూ చిన్నపిల్లలూ ఉన్నదున్నట్టు నిజాలు కక్కేస్తారు. ముసలాళ్లను ఛాదస్తులనీ, పిల్లలను చిన్నతనమనీ చెప్పేసి సర్దుకుంటామంతే!"

ఆమె మాటలకు కాస్త తడబడ్డాడు ఆనందరావు. మాట మార్చేస్తూ.

"ఎన్నింటికెడదాం పార్కుకి? " అన్నాడు.

"రాత్రి రెండు గంటలకు. అదేం ప్రశ్న! పార్కుకెన్ని గంటలకెళతారు సాయంత్రం ఆరింటికెడదాం!" అంది.

వెళ్లి మ్యూజికల్ ఫౌంటెన్ దగ్గర కూర్చున్నారిద్దరూ.

వేరుసెనక్కాయలు తింటున్న ఆనందరావునుద్దేశించి "మీరు నిజంగా నన్ను పెళ్లి చేసుకుంటారా? " అని అడిగేసరికి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

కాస్త తమాయించుకుని "నిజంగా అంటే? అబద్ధపు పెళ్లికూడా ఉంటుందా? "

"ఉంటుంది! సినిమాల్లో"

"ఇది సినిమాకాదు. మనం యాక్టర్లం కాదు! నేను నిజ్జంగా నిన్ను పెళ్లి చేసుకుంటాను. చాలా! ఇంకాస్త గట్టిగా అరిచి పార్కులో వాళ్లందరిని ఇటు తిప్పమంటావా? "

"మీరు నన్ను పెళ్లి చేసుకుంటారుసరే! నేను మిమ్మల్ని చేసుకోవాలంటే కొన్ని కండిషన్లుకు మీరొప్పుకోవాలి!"

"బాబోయ్! కొంపదీసి అపూర్వచింతామణి ప్రశ్నల్లాంటివి కాదుకదా!"

"ఇంచుమించు అలాంటివే! మొదటిది మన పెళ్లయ్యాక కూడా మా అక్క మన దగ్గరే ఉంటానంటోంది" అంది క్రీగంట ఆనందరావును గమనిస్తూ!

"అలాగా! ఉండనీ. నీకు మాత్రం ఎవరున్నారు ఆవిడేకదా పెద్ద దిక్కు. ఆవిడ మన దగ్గరుండటంవల్ల నాకొక లాభం. అదేంటంటే పుట్టింటికెళతానంటూ పేచీపెట్టి నన్ను వదలివెళ్లవు. ఇంకొకటేమిటంటే మన అన్యోన్యం చూసి మీ అక్కగారు పురుషుల మీద ద్వేషం వదిలి పెళ్లి చేసుకుంటుంది. ఆ పెళ్లికి మనమే పెద్దలం"

"ఆపండాపండి! రెండవదేమిటంటే నేను కండక్టరుద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాను"

"అదేమిటి? ఎందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు ఆనందరావు.

"ఏం నాకుద్యోగం లేకుంటే పెళ్లి చేసుకోరా? "

"సిల్లీగా మాట్లాడకు! నువ్వు ఉద్యోగం ఎందుకుమానెయ్యాలనుకున్నావో చెప్పు! ఇంత ఖచ్చితంగా అడుగుతున్నానని నీ సంపాదన మీది ఆశతో పెళ్లి చేసుకుంటున్నానని పొరపాటున కూడా అనుకోవద్దు"

"ఈ కండక్టరుద్యోగంలో చాలా రిస్కులున్నాయి. రేపు పెళ్లయ్యాక మీరు సహించలేరు మనమధ్య పోట్లాటలు రావచ్చు"

"మనమధ్య పోట్లాటలా? ఎందుకలా ఊహిస్తున్నావు!"

"ఊహించటంకాదు! అరవింద కాపురం కళ్లారా చూడటం లేదా? అరవింద ఆ ఉద్యోగమే చెయ్యకపోతే ఇలా భర్తను వదిలివచ్చి అందరినోళ్లలో నానేదా? "

"చూడు సరోజా! నీకెలా చెప్పాలోనాకు అర్థం కావటంలేదు. ఎవరో ఒకరు అలాంటివారని అందరినీ అదే దృష్టితో చూస్తే ఎలా? "

"ఎవరో అంటారనీ కాదు, ఉంటారనీ కాదు. నాకే అస్సలు ఆ ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేదు. ఉదయం లేచింది మొదలు హడావిడి. పరుగులు... టెన్షన్ వద్దులే బాబూ... సుబ్బరంగా ఇంటిపట్టున ఉండి వంటపని, ఇంటిపని, తోటపని చేసుకుంటూ మీక్కావల్సినవన్నీ సమకూర్చి మిమ్మల్ని




ఆఫీసుకు పంపి కాసేపు టివి చూసి, కాసేపు నిద్రపోయి మళ్లీ మీరు సాయంత్రం వచ్చే లోగా స్నానంచేసి తెల్లచీర కట్టుకుని మల్లె పూలు పెట్టుకుని గడపకానుకుని నిలబడి మీకోసం ఎదురుచూసి మీరు రాగానే ఇద్దరం కలిసి ఏపార్కుకో... సినిమాకో వెళ్లి వచ్చి...కబు ర్లు చెప్పుకుంటూ ఓహ్ ఆ లైఫ్ ఎంత బావుంటుందనీ... ఏదో బతకలేక బడిపంతులుద్యోగం అన్నట్టు కర్మచాలక కండక్టరుద్యోగం చేయాల్సి వచ్చింది. చేశాను. ఇపుడేం ఖర్మ. మీ జీతంలో అయి దుమంది తిని, దాచిపెట్టచ్చు మనకు లక్ష ణంగా సరిపోతుంది. ఏమంటారు?" అంది సరోజ గుక్క తిప్పుకోకుండా.

"నిజమేననుకో! ఎన్నాళ్లిలా నాక్కావల్సి నవి సమకూర్చి గడపనానుకుని నాకోసం ఎదురు చూస్తావు?" ప్రశ్నించాడు ఆనంద రావు వ్యంగ్యంగా.

"ఎన్నాళ్లేమిటి? జీవితాంతం... అంటే మధ్యలో కొన్నాళ్లు బ్రేక్ పడచ్చనుకుంటా. మీకు పిల్లలంటే ఇష్టమేనా? నాకైతే పెద్ద ఇంట్రస్టు లేదనుకోండి. మనకి ఇంట్రస్టు లేకపోయినా ఎవరైనా ఏమైనా అంటే అదే మనకింకా పిల్లలు పుట్టలేదని ఇరుగుపొ రుగు... మీ వాళ్లు.. మావాళ్లు వ్యాఖ్యానిం చకుండా గుసగుసలాడుకోకుండా ఓ ఇద్దర్ని కనేసి ఫుల్‌స్టాప్ పెట్టేస్తే సరిపోతుంది"

"ఓహో! మళ్లీ పిల్లలక్కావల్సినవి సమ కూర్చి నాక్కావాల్సినవి సమకూర్చి మళ్లీ గడ పనానుకుంటావన్నమాట"

"అంతే కదామరి! కాకపోతే పిల్లలుపుట్టాక తెల్లచీర వాలు జడ మల్లెపూలు ఉండవను కుంటా. సింపుల్‌గా కాటన్‌చీర, చిన్నముడి నాలుగంటె నాలుగు మల్లెపూలు... పెద్దరి కంగా కనిపించొద్దూ!"

"ఈ తర్వాత ఏమవుతుంది. మరికొన్నా ళ్లకు ముసలిదానివవుతావు. పిల్లల పెళ్లిళ్లవు తాయి. నీకో నాకో కిడ్నీలో, గుండెలో పాడ వుతాయి, హాస్పిటల్ చుట్టూ శాలువాలు కప్పుకుని తిరుగుతాము. ఓ శుభాముహూ ర్తాన చస్తాము. పిల్లలు మనకు తద్దినం పెడతారు. అంతేగా" అన్నాడు కోపంగా ఆనందరావు.

"అబ్బ! మరీ అంత స్పీడుగా అంతముం దుకెళ్లి... అపశకునం మాటలేమిటి అస హ్యంగా... మీ బామ్మగారన్నట్టు... మీలో చాలా లోపాలున్నాయి సుమా... మూడ్ చెడగొట్టే మాటలూ మీరూ!" అంది సరోజ చిలిపిగా చూస్తూ!

"చూడు సరోజా! నీవు కావాలని నన్ను ఆటపట్టించటానికి మాట్లాడుతున్నావో... నిజంగానే మాట్లాడుతున్నావో.. నాకర్థం కావటంలేదు. నీవెలా మాట్లాడినా నీ మన సులో ఏ ఉద్దేశ్యం ఉన్నా నా ఉద్దేశ్యం ప్రకారం నీవు ఉద్యోగం చేసి తీరాలి. నీవ నుకున్నట్టు సంపాదనకోసం మాత్రంకాదు. కొన్ని ఉద్యోగాలు ఇవి పురుషులు చేసే ఉద్యోగాలు అని కేటాయించబడ్డాయి. కేటా యింపు ఏమాత్రం లేదు మేము ఎందులో తీసిపోయామంటూ స్త్రీలు కూడా ముందుకు వచ్చి కేటాయింపును లాగిపక్కకు పడేశారు. అలాంటిదే ఈ కండక్టరుద్యోగం కూడా. నా భార్య అలాంటి ఉద్యోగం చేసి విజయపథం వైపు ప్రయాణిస్తుంటే నాకు గర్వంకాదా? అలాకాకుండా పెళ్లయిన మరుక్షణం ఉద్యోగం మానేస్తే ఏమిటి అర్థం? భార్య కండక్టరు ఉద్యోగం చేస్తే సహించలేని సంస్కారహీనుడిగా ముద్ర పడాలనా నీ ఉద్దేశ్యం. ఈ ఉద్యోగం కాకుండా నీవు ఆఫీ సుల్లో ఏ క్లర్కు ఉద్యోగం చేస్తూనో మానే స్తానని అంటే తక్కున ఒప్పేసుకుందును. ఎందుకంటే జీతానికితప్ప ప్రాముఖ్యం, పేరులేని ఉద్యోగాలవి. ఏదో పుట్టాం... బతికాం.. చచ్చాం... లాకాకుండా నీవంతు దేశసేవ చేయటం గురించి కాస్త ఆలో చించు! నిరక్షరాస్య స్త్రీలా ఆలోచించకు"



అన్నాడు ఆనందరావు.

"అయిందా ఉపన్యాసం! మంచినీళ్లు తాగుతారా? మీకేం మహారాజులా మాట్లాడుతారు. అనుభవిస్తే తెలుస్తుంది"

"అనుభవాలు, బాధలు అన్ని ఉద్యోగాల్లోనూ ఉన్నాయి. తట్టుకుని ముందుకు పోవాలిమరి!"

"ఈ ఉద్యోగం సంగతిమీకు తెలీదు! టికెట్లిస్తున్నది ఆడదికదాని ప్రతివాడు కావాలని రాసుకుంటూ వెళతాడు. అదే పనిగా చేతులు తగిలిస్తారు. వళ్లంతా కారం రాసుకున్నట్టవుతుంది" కోపంగా అంది సరోజ.

"అర్థం లేకుండా మాట్లాడకు, మగకండక్టరు టికెట్లిస్తుంటాడు. బస్సుఫుల్‌గా ఉంటుంది. అతన్ని మాత్రం రాసుకుంటూ వెళ్లరా? అతనలాగే అనుకుంటున్నాడా? నువ్వు మాత్రం అలా ఎందుకనుకుంటావు? దాదాపు అరవై డెబ్బయిమందికి టికెట్లిచ్చేటపుడు ఒకరిచేతులు మరొకరికి తగలకుండా ఎలా ఉంటాయి. మడికట్టుకున్న వారిలా ప్రవర్తించాలంటే సాధ్యపడుతుందా? కాకపోతే నూటికొకరో ఇద్దరో ఆకతాయి వెధవలు ఏదో వెకిలిచేష్టలు చేయాలని చూస్తారు. శృతిమించితే తప్ప అలాంటివి పట్టించుకోకూడదు"

"ఎన్నని పట్టించుకోకుండా ఉండటం? స్టేజి వచ్చినపుడు డ్రయివరుతో కలిసి కాఫీ టిఫిన్ తిన్నామనుకో అతడికీ మాకూ... కట్టేసి ద్వంద్వార్థపు మాటలు మాట్లాడుతుంటారు. ఎంత బాధవుతుందో తెలుసా? ప్రతి డ్రయివరు మమ్మల్ని చెల్లెమ్మా అని పిలుస్తారు. స్వంతతోబుట్టువుల్లా ప్రయాణం చేస్తాం. ఇలాంటి మాటలు వింటున్నపుడు అనుభవించే క్షోభ మాటల్లో చెప్పలేం!"

"నిజమేననుకో! అలాగని పనికిరాని వెధవల మాటలు పట్టించుకుని బాధపడి మన భవిష్యత్తు పాడుచేసుకుంటామా? ఆ మాటకొస్తే ఈ జనంతో మాటలు పడనివారెవరూ ఉండరు? చేతనైతే నోరుమూయించాలి! లేదా చెవిటివారిలా దులిపేసుకు తిరగాలి. అయినా మాట్లాడేవారు ఎన్ని రోజులు మాట్లాడతారు. ఓపిక నశించి వాళ్ల నోళ్లే మూతబడతాయి" అనునయంగా అన్నాడు ఆనందరావు!

"అయితే ఇంతకీ ఏమిటంటారు? నేనీ ఉద్యోగం చేస్తే తప్ప పెళ్లిచేసుకోనంటారు అంతేనా? "

"నీకూ నాకూ పెళ్లి గురించి రాసిపెట్టి ఉంటే పెళ్లవుతుంది. లేకుంటే లేదు. నన్ను కాకుండా నీవు ఎవర్ని పెళ్లి చేసుకున్నా కండక్టరు ఉద్యోగం మాత్రం మానెయ్యకు. ఒక స్నేహితుడిగా నేను నిన్ను కోరేది అదొక్కటే. చాలా టైం అయింది వెడదాం పద!'' సీరియస్‌గా అనేసి లేచి నిలబడ్డాడు ఆనందరావు.

ఇంటరాగేషన్ చేసి సమాధానం రాబట్టిన తృప్తితో సరోజ మొహం వెలిగిపోయింది.

మసకచీకట్లలో ఆనందరావు ఆమె మొహాన్నిసరిగా చూడలేదు. చూసి ఉంటే ఆమె మనసును ఇట్టే చదివేసి తేలికపడేవాడేమో.

బరువుగా ముందుకు కదిలాడు.

★ ★ ★

"ఎలా ఉంది ఈ చిన్న పిల్లలతో వ్యవహారం! అన్నయ్యగారితో పేచీలురావటంలేదుకదా!" లీల ఓరోజు తీరిగ్గా అడిగింది కావేరిని.

"అలాంటిదేంలేదు" అని కావేరి అంటుండగానే లోపల్నించి "ఏంటి చెల్లెమ్మా పేచీలు అంటున్నావు నేను పేచీపెట్టుకుంటున్నానని నీతో చెప్పిందా కావేరి? " అంటూ తల దువ్వుకుంటూ వచ్చాడు కందస్వామి.

అతను ఇంట్లోనే ఉన్నాడన్న విషయం గమనించక మాట్లాడానే అని నాలిక్కరుచు





కుంది లీల.

"మీ అన్నయ్య ఈ రోజు సెలవు పెట్టారు లీలా. ఈ రోజు పిల్లలతో ఆడుకోవాలనిపించిందిట. అయినా మేం పేచీలు పెట్టుకునేది లేనిది నేను ప్రత్యేకంగా చెప్పాలా ఏమిటి? సీతమ్మగారిల్లు పుణ్యమా అని ఒకరింట్లో దగ్గితే ఇంకో ఇంట్లోకి స్పష్టంగా వినిపిస్తుంది. రహస్యాలకు తావులేదాయె" అంది కావేరి.

"ఏమిటి తల్లీ! నా ధ్యానం చేస్తున్నావు!" అంటూ సీతమ్మ ప్రవేశించింది.

నాలిక్కరుచుకుంది కావేరి.

"ఏం లేదు బామ్మగారూ! మీ పుణ్యమా అని మనమంతా ఒక కుటుంబంలోని వారిలా హాయిగా బతికేస్తున్నామంటోంది కావేరి"

"కావేరికిపుడు చేతినిండాపని, ఇంటినిండా పిల్లలతో కళకళలాడుతోందనుకో!" సీతమ్మ అంది.

"అందరికీ సలహాలు చెప్పే లీలావతివి నువ్వుండగా అందరూ బాగానే కళకళలాడతారు" అంటూ ప్రవేశించింది సరోజ.

"ఉచిత సలహాలు ఇస్తుంటే అందరికీ చవకగా కనిపిస్తున్నావు. సలహాకింతని డాక్టరు ఫీజులాగా ఫీజు వసూలు చెయ్యి చెల్లెమ్మా తిక్కకుదురుతుంది" అన్నాడు కందస్వామి.

అరవింద కూతురితో సహా పదిమంది పిల్లలకు కావేరి ఉదయం పదిగంటలనించి సాయంత్రం అయిదున్నర, ఆరుదాకా తల్లి కంటే ఎక్కువగా ఆలనా, పాలనా చూసుకోసాగింది. పని సహాయానికి ఒక ఆయాను జీతమిచ్చి పెట్టుకుంది.

పిల్లలు వచ్చేలోగా తన ఇంటిపని, భర్త పని చూసి అతన్ని పంపించేస్తుంది. ఆ తర్వాత పిల్లల గది శుభ్రంగా ఆయాతో కడిగించి సిద్ధంగా ఉంచుతుంది.

ఒక్కొక్కరే వచ్చి వారి పిల్లలను వదిలేసి పాలసీసాలను పాలడబ్బాలను ఇచ్చి వెళతారు.

దాదాపు అందరూ రెండేళ్లలోపు పిల్లలే. కొందరికి ఊయల కూడా అవసరమౌతుంది. తక్కువ ఖర్చుతో తన ఇంట్లోనే రెండు మూడు ఊయలలు సిద్ధంచేసింది.

కొంతమంది పిల్లలు అస్వస్థతగా కూడా ఉంటారు. వాళ్ల తల్లిదండ్రులిచ్చిన మందులు కూడా టైం ప్రకారం వాడుతుంది. మరీ జ్వరం ఎక్కువవటం, విరేచనాలు, వాంతులు లాంటివి ఎక్కువగా ఉంటే తగ్గేవరకు తల్లి దగ్గరుంటే మంచిది. అవి మిగతా పిల్లలకు సంక్రమిస్తాయని సలహా ఇచ్చి పంపివేస్తుంది.

ఒక్కోపాప ఒక్కోరకంగా అల్లరి చేస్తుంటే వారిని ముద్దుచేస్తూ... అసలు కావేరికి రోజులెలా గడుస్తున్నాయో తెలీటంలేదు. డబ్బుకు కూడా అసలు ఇబ్బంది లేకుండా గడిచిపోతోంది. ముఖ్యంగా భర్తని ప్రతి రూపాయకూ దేబిరించాల్సిన గతి తప్పింది. అంతోఇంతో బ్యాంకులో కూడా వేసుకోసాగింది.

మొదట్లో కందస్వామి "ఏమిటి ఇంటినిండా పిల్లలగోల" అంటూ చిరాకుపడ్డాడు గానీ ఎప్పటిలాగా అతనికి భయపడకుండా "పొద్దున్నించి రాత్రిదాకా పనిపాటాలేకుండా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవాలి. ఎక్కడైనా ఉద్యోగం చేస్తానంటే వద్దంటారు.

పోనీ మనకేపిల్లలు పుడతారేమో వాళ్ళతో పనే సరిపోతుంది అనుకుందామంటే పెళ్ళయి పదేళ్లు దాటింది ఆ యోగం లేనట్టుంది. అవన్నీ అటుంచినా, ఎప్పుడైనా ఓ రూపాయి అవసరమైనా మిమ్మల్ని దేబిరించాలి. ఖర్చు చేశాక లెక్క చూపాలి. అంతో ఇంతో నేనూ సంపాదించితే మీకంత బాధ ఉండదు కదా" అనేది.

"అన్నీ నేను చూసుకుంటున్నపుడు ఇక నీకు డబ్బెందుకు? అయినా ఆడవాళ్ళకు డబ్బు పెత్తనమెందుకు వంట పని, ఇంటి పని శుభ్రంగా చేస్తే చాలు!" అనేవాడు కందస్వామి.

అతనితో వాదించటమంత మూర్ఖపు పని ఇంకోటి లేదని తెలుసుకుంది. అలాగని భయపడి ఊరుకునే ప్రసక్తి లేదనుకుని తన పని తాను చేసుకుపోసాగింది.

మరోసారి తీవ్రంగా కోప్పడితే "చూడండి మీకిష్టమున్నా లేకపోయినా నేనీ పని మాత్రం మానను" అని ఖచ్చితంగా చెప్పేసింది కావేరి.

కాస్త తగ్గాడు కంధస్వామి, భార్యతో గొడవపెట్టుకోవటం, రచ్చకెక్కటం కంటే రాజీపడటమే మంచిదనుకున్నాడు. ఈ ఆడవాళ్లు ఎంతకైనా తెగిస్తారు. కళ్ళెదుట అర విందను చూడటంలా మొగుడు వద్దు, మొద్దూవద్దంటూ వచ్చి నిక్షేపంగా బతికేయటంలా? వాడేమో గెడ్డం పెంచుకుని పిచ్చివాడిలా తయారయ్యాడు. అటు పెళ్ళామూ దూరమయి, పరువూపోయి, ఎదురయిన ప్రతివాడి మొహమూ ఓ ప్రశ్నార్థకమౌతుంటే ... అమ్మో... ఆ రంగుల దృశ్యాలు నాకొద్దు బాబోయ్... అనుకుని 'కామ్'గా ఉండిపోయాడు. మొదట్లో పిల్లలతో చిరాకనిపించినా... తర్వాత తర్వాత... తనకూ ఆ పిల్లల ఆట పాటలు... పిల్ల చేష్టలు చూస్తుంటే ముద్దు అనిపించసాగింది. చాలాసార్లు ఆఫీసునించి త్వరగా వచ్చి పిల్లలతో ఆడుకునేవాడు.

"ఎలాగూ నువ్వు పిల్లల్ని పుట్టించలేవని నీ పెళ్ళాం ఊళ్లో వాళ్ళ పిల్లలతో అడ్జెస్టు అయిపోతోందా? " ఓసారి క్లోజు ఫ్రెండు ఒకడు మొహానే అడిగిన ప్రశ్నకు బాధపడి... కావేరితో చెప్పి బాధపడ్డాడు.

"వాడెవడో చొంగవెధవ చొంగ మాటలు మాట్లాడితే అంత బాధపడేదెందుకు? ఇంట్లో పెళ్ళాంతో అయితే యుద్ధం చేస్తారు కదా! వాడికి ఘాటుగా జవాబు చెప్పి నోరు మూయించలేకపోయారా? " అంటూ కోప్పడింది కావేరి.

"పిల్లలతో ఈ గోల ఏమిటి ఈ సలహా ఇచ్చిందెవరు? అంటూ అన్నయ్యగారు నిన్ను కోప్పడ్డారా!" అడిగింది లీల!

"అబ్బే అలాంటిదేంలేదు. ఇప్పుడాయన చాలా హ్యాపీగా ఉంటున్నారు. మొన్నోరోజు లీలమ్మకు ఓ చీర కొనిపెట్టాలి అన్నారు కూడా!"

"అబ్బో! ఎందుకట" నవ్వింది లీల.

"ఎందుకేమిటి నువ్వు ఆడపడుచువట. చీరె, సారెపెడతారుట. మంచి మొగుడిని కూడా ఆయనే వెతికి తెస్తారుట!"

"అలాంటిలాంటి మొగుడు, అల్లాటప్పా చీరెసారెకు నేనొప్పుకోను సుమా!"

"ఇంకెలాంటి మొగుడు కావాలి తల్లీ! నువ్వు బస్సు కండక్టరువు. రైలుకండక్టరును తెచ్చేదా? విమానం కండక్టరును తెచ్చేదా!" సరోజ కల్పించుకుంటూ అడిగింది.

అందరు హాయిగా నవ్వేశారు.

"ఏవయసులో జరగాల్సిన ముచ్చట ఆవయసులో జరగాలి ఇంక మీరిద్దరూ పెళ్లికి సిద్ధంకాండే అమ్మాయిలూ!" దీర్ఘంతీస్తూ సరోజను, లీలను చూస్తూ అంది సీతమ్మ.

"మేము సిద్ధంగానే ఉన్నాం. పెద్దలు మీరు వెతికి వరుండ్లను తెస్తే మేము తాళి కట్టించుకోవటమే తరువాయి" అంది సరోజ.

"ఆ! ఈకాలంలో పెద్దలు కుదిర్చేదాకా ఆగుతున్నారా తల్లీ ప్రేమించేసుకుని ఒకేసారి దండలతో ప్రత్యక్షమయి దబ్బున కాళ్ళమీద పడుతున్నారు ఆశీర్వదించమని" మర్మగర్భంగా మాట్లాడింది సీతమ్మ, సరోజనుద్దేశించి!

"పెద్దవాళ్ళు పచ్చజెండా చూపకపోతే ఏం చేస్తారు పాపం! ఎన్నాళ్లని ఆగుతారు" సరోజ మళ్ళీ అందుకుంది.

వాళ్ళిద్దరిమనసుల్లో ఏముందో... ఎందు కలా మాట్లాడుకుంటున్నారో అర్థమయిన లీల టాపిక్ మళ్ళించింది.

"అరవింద అత్తగారు ఈరోజు డిశ్చార్జి అవుతారట బామ్మా!" అంది.

"అలాగా! పాపం! ముసలావిడ శారీర కంగా బాగా నలిగిపోయింది. ఎక్కడుం టుందిట"

"ఎక్కడుండటమేమిటి అరవింద ఇక్కడే తన దగ్గరే అట్టిపెట్టుకుంటుందిట"

"ఏ మాటకామాటే చెప్పుకోవాలి అరవిం దది చాలా దొడ్డ మనసు సుమా! లేకపోతే అన్ని అగచాట్లు పెట్టిన అత్తగారిని మళ్ళీ చేరదీసి చాకిరీ చేస్తోంది" సీతమ్మ అరవిం దను మెచ్చుకుంది.

"బామ్మా! ఆకలేస్తోంది అన్నం పెడుదూ గాని రావే! వాళ్ళ మధ్య మాటల్లో పడితే మైమరచిపోయి మనవడిని మరిచిపోతావు కదా" లోపల్నించి కేకేశాడు ఆనందరావు!

"కాసేపాగరా ఉమ్మిగా! ఇక్కడ సరోజ మ్మకు, లీలమ్మకు పెళ్ళి ప్రయత్నాలు జరు గుతున్నాయి" అంది సీతమ్మ లోపలికి చూస్తూ.

"వాళ్ళ పెళ్ళిళ్ళ సంగతి నీకెందుకే. నిన్ను వెతికిపెట్టమన్నారా ఏమిటి? " ఆనందరావు అన్నాడు.

"మరే! పెద్దదాన్ని నాకామాత్రం బాధ్యత లేదనుకున్నావా? ఏమంటావ్ లీలా" అంది లీలవైపు చూస్తూ!

"అయ్యో! ఎంతమాట. పెళ్ళంటే మాటలా? నూరేళ్ళపంట. మీకు తెలీకుండా చెప్పకుండా పెళ్ళి చేసుకుంటామటండీ!" లీల అంది.

"నా కన్నంపెట్టి వెడుదూగానిరా!" మళ్ళీ పిలిచాడు ఆనందరావు. "అబ్బబ్బ! చంపేస్తు న్నావు గదరా వెధవా! అదేదో కక్షసాధింపు ఉత్తరం రాయటం అయిందా? " సీతమ్మ గట్టిగా అడిగింది.

"అరవకుండా లోపలికిరా!" కసిరినట్టు పిలిచాడు ఆనందరావు మళ్ళీ!

"కక్షసాధింపు ఉత్తరమా అదేమిటండీ! ఎవరికి రాస్తున్నారు? " కుతూహలంగా అడి గింది సరోజ సీతమ్మను.

"మావాడిది అదోరకం బుద్ధిలే అమ్మా! ఎవరిమీదైనా కోపం రావటమో, తన మాట వినకపోవటమో జరిగిందనుకో. అంతే... ఆకాశరామన్న పేరుపెట్టి తిట్టి తిట్టి ఉత్తరం వారిపేర రాసేసి కక్షతీర్చుకుంటాడు. నిన్న వాళ్ళ ఆఫీసరుకు వీడికీ ఏదో చెడిందిట. వాడికో ఆకాశరామన్న ఉత్తరం రాస్తేగానీ నాకక్ష తీరదు. అని ఉదయం అంటుంటే విన్నాను. ఇందాక ఏదో రాస్తూ కూర్చు న్నాడు. బహుశ అదే అయ్యుంటుందని అడిగాను" అంది సీతమ్మ.

"ఏదో మాటవరసకంటే నిజంగా రాసేస్తా ననుకున్నావా? నీకు పనికిరాని మాటలు మాట్లాడ్డం తప్పితే వేరే పని లేదా? " గుమ్మంలోకొచ్చి నించుని కసిరాడు ఆనంద రావు.

అతని చూపులన్నీ సరోజమీదే ఉన్నాయి.

సరోజమాత్రం ఈసడింపుగా ఆనంద రావువైపు చూసి "వెళ్లొస్తా లీలా!" అంటూ వెళ్ళిపోయింది.

ఆనందరావు కూడా గబగబ బట్టలు మార్చుకుని బయటికెళ్ళిపోయాడు.

"అదేమిట్రా ఆనందూ అన్నం అడి గావు..." సీతమ్మ మాటలు పూర్తిగాక ముందే గేటుదాటి పోయాడు.

"ఆనందరావుగారికి పెళ్ళి చెయ్యాలనుకోవ టంలేదా? ... అహా... ఏమనుకోకండి...

మీరే కదా ఏవయసులో ముచ్చట ఆ వయసులో జరగాలి అన్నారు. అందుకని అడిగాను" అంది లీల సీతమ్మతో.

"అడిగితే తప్పేముందిలే అమ్మా! చెయ్యాలనే అనుకుంటున్నా! నాకు నచ్చిన పిల్ల దొరకొద్దూ!"

"మీకు నచ్చిన పిల్లా? మీ మనవడికి నచ్చిన పిల్లా? "

"రెండూనూ" నవ్వుతూ అంది సీతమ్మ.

"సరోజ ఆనందరావు ఒకరినొకరు ఇష్టపడుతున్నట్టున్నారు! మీరు గమనించే ఉంటారు..."

"ఆ... ఆ... గమనించాను ఇప్పుడైతే ఇష్టపడుతున్నారు. ఆ యిష్టం ఎన్నాళ్ళు నిలుస్తుందా అని ఆలోచిస్తున్నాను"

"అదేమిటి అలా మాట్లాడుతున్నారు. మీకా సందేహం ఎందుకొచ్చింది!"

"అరవింద కాపురం చూశాక! సరోజ మంచిపిల్ల! ముక్కుకుసూటిగా పోయే తత్వం! ధైర్యంగలది. నాకు బాగా నచ్చింది''

"అలాగా! మీరు అప్పుడప్పుడూ పుల్ల విరుపుడు మాటలు, ఆనందరావుగారిమీద కాని మాటలు చెబుతుంటే అపార్థంచేసుకున్నాను సుమండీ!"

సీతమ్మ నవ్వేస్తూ "ఓస్ అదా! వీళ్ళిద్దరికీ ఒకరిమీద ఒకరికి ఎంత ప్రేముందో కనుక్కుందామనీ... అసలది ప్రేమేనా... లేక... ఆకర్షణా తేల్చుకుందామనీ!"

"తేల్చుకున్నారా? "

"తేల్చుకున్నట్టే ననుకో! కానీ నిన్న వీరిద్దరిమధ్య ఏం జరిగిందో తెలీదు. రాత్రి మా ఆనందుడు ఏరా పెళ్ళెప్పుడు చేసుకుంటావు పిల్లను చూడమంటావా? అనడిగితే, నీకు ఇష్టమొచ్చినట్టు చెయ్యి అన్నాడు. మనిషి అదోలా ఉన్నాడు. ఎందుకోమరి!"

"నన్ను చెప్పమంటారా? పెళ్ళవగానే సరోజ కండక్టరు ఉద్యోగం మానేస్తానంటిట!"

"అదేమిటి? ఎందుకని? " ఆశ్చర్యంగా అడిగింది సీతమ్మ.

"ఇందాక మీరన్నారే అరవిందకాపురం అనీ సరోజ క్కూడా అలాంటి అనుమానమే వస్తోందిట. ఇప్పుడైతే కొత్త మోజు ఏమీ అనరు. రోజులు గడిచేకొద్దీ, పురుషాహంకారం ప్రదర్శించి... చీటికీ మాటికీ ఉద్యోగం గురించి నసిగితే భరించలేం. పెళ్ళయినా చేసుకోవాలి! ఉద్యోగమైనా చేయాలి. రెండూ చేస్తే మాత్రం ఆడదాన్ని మనశ్శాంతిగా బతకనివ్వరు" అంటుంది.

"సాటి స్త్రీగా నేనూ సరోజతో ఏకీభవిస్తాననుకో! కాకపోతే మనవడు అని వెనకేసుకొస్తుంది అని నీవనుకోనంటే ఓ మాట చెబుతాను. ఆనందుడు చాలా మంచివాడు. స్త్రీ వాది కూడాను. ఇంతకుమించి ఉదాహరణతో సహా చెబితే అతిశయోక్తిగా ఉంటుంది. సరోజకు నీవు చెప్పు. అలాంటి సంశయాలేం పెట్టుకోకుండా పెళ్ళికి అంగీకరించమని చెప్పు"

మనస్ఫూర్తిగా మాట్లాడుతున్న సీతమ్మను అభినందిస్తున్నట్టు చూశారు లీల, కావేరి.

"హమ్మయ్య! లైను క్లియర్ అయిపోయింది. లడ్డూలు తినటమే ఆలస్యం! లీలమ్మా! ఇక నీ సంగతి చెప్పు! పెళ్ళికొడుకును చూడమంటావా? మా ఆఫీసులో ఓ అబ్బాయి ఉన్నాడు. నీకు జోడీసరిపోతుంది. ఆదర్శభావాలున్నవాడు. పెళ్ళిచూపులకేర్పాటు చెయ్యమంటావా? " కందస్వామి కల్పించుకుని గబగబ మాట్లాడేశాడు.

"ఆగండిఆగండి! సమయం వచ్చినపుడు నేనే చెబుతాను. ఆత్రపడకండి" నవ్వుతూ అంది లీల!





"లీలగారికి సారధి రాయు ఉత్తరం! బావున్నారా? ఈ బాగున్నారా? అనే మాట ఎవరు కనిపెట్టారోగానీ, బహుశ అది ప్రపంచంలో పుట్టిన తొలి అబద్ధపుమాట అయ్యుంటుందని నా అభిప్రాయం! కాదంటారా!

కాకపోతే ఏమిటి చూడండి... ఎవరైనా. ఎదురుపడినా మనం అడిగేది మొదటగా "బాగున్నారా? " అంటాం.

వాళ్ళు ఆ! బాగున్నాం! మీరూ క్షేమమే కదా! అంటారు... ఆ! క్షేమమే! అంటారు.

కానీ ఆ ఇద్దరూ ఒకరికొకరు అబద్ధమే కదా చెబుతున్నది. ఇంత చిన్న మాటకు.. మంచిగా పలకరించే ఈ మాటకు ఇంత వితండవాదమూ, గూడార్థం ఏమిటండీ... అంటున్నారా?

మీరే ఆలోచించండి! ఈ ప్రపంచంలో ఎవరు బాగున్నవాళ్ళు

ఏ సమస్య లేకుండా ఎవరైనా ఉన్నారా చెప్పండి.

అయినా కూడా ఎవరైనా బాగున్నారా అని అడగ్గానే "బాగున్నాం" అని చెప్పటం అబద్ధం కాదంటారా? ఆఖరికి హాస్పటల్ కెళ్లి పేషెంటును 'బాగున్నారా' అని అడిగినా "బాగున్నాను" అంటాడే తప్ప "నీ మొహం. బాగాలేకుంటేనే కద హాస్పిటల్‌లో అడ్మిట్ అయ్యాను" అని నిక్కచ్చిగా చెప్పడు కదా.

నాకప్పుడప్పుడు అనిపిస్తుంటుంది ఇలాంటి విషయాలగూర్చి 'రీసర్చి' చెయ్యాలని!

ఏమిటండీ మొహం అలా పెట్టారు. ఉత్తరం పిచ్చిపిచ్చిగా ఉందా. సరిసరి! ఇంతకీ మీ ఉద్యోగం ఎలాఉంది?

అన్నట్టు మీకో శుభవార్త...

మానాన్నగారు కొంచెం నాకనుకూలంగా మారిపోయారు కొంచెమంటే రూపాయలో పావలా భాగం మారిపోయారన్నమాట! క్రిందటి నెలలో పెళ్ళిచూపులకెళ్ళాము. వెళ్ళే ముందే నాన్నతో పేచీపెట్టుకున్నాను. "మీకసలు నాకు పెళ్ళిచేసే ఉద్దేశ్యం లేదు. అనవసరంగా పెళ్ళిచూపులు, గాడిదగుడ్డు అంటూ వెళ్ళటం ఎందుకు నేను రాను" అన్నాను.

"ఏమిట్రా వెధవా? నీకు నోరెక్కువవుతోంది. పెళ్ళిచేసే ఉద్దేశ్యం లేకపోతే పెళ్ళిచూపులకెందుకు వెడదామంటాను" అన్నారాయన కోపంగా!

"నాకు తెలిసి రెండు కారణాలున్నాయి. ఒకటి మీకు ఎక్కువసార్లు పెళ్ళి చూపులకెళ్ళే అవకాశం రాకపోవటంవల్ల... ఇపుడా దుగ్ధ తీర్చుకుంటున్నారనీ... రెండవది... మీకిష్టమైన స్వీట్సు వగైరా అమ్మ చేసిపెట్టదు కదా, పెళ్లి చూపుల పేరుతో వెళ్ళి సుష్టుగా తినెయ్యొచ్చనీ" అన్నాను.

"నోరుముయ్యి ఛండాలపు వెధవా! తండ్రిని పట్టుకుని అంత మాటంటావట్రా"

"ఆ! తండ్రే! ఇంతవయసొచ్చినా మీనాన్న నీకు పెళ్ళిచెయ్యకపోగా, పుల్ల విరుపుమాటలు, తల తిక్క మాటలు మాట్లాడి సంబంధాలన్ని చెడగొట్టేస్తున్నాడు. బహుశ నీవు పెళ్ళవగానే తల్లిదండ్రుల్ని చూడకుండా వేరుకాపురం పెడతావని భయంకాబోలు" అని నా స్నేహితులంతా నన్ను మొహానే అడుగుతున్నారు" అన్నాను.

ఏమనుకున్నారో ఏమో! మా నాన్న నిశ్శబ్దం అయిపోయి "సరే! ఇకనించి నేనేం మాట్లాడను. తండ్రిగా రమ్మంటే వస్తాను. అన్నీ నీవూ మీ అమ్మా చూసుకోండి. నామీద పడి ఏడవటమెందుకు" అన్నాడు.

తీరా... "అన్ని విధాల మంచిసంబంధం ఒక్కత్తే కూతురు. తండ్రి పెద్దకంట్రాక్టరు. బోలెడు సంపాయించాడు. అమ్మాయి పేర

రెండు మేడలు, ఒక కొబ్బరితోట, పదెకరాల మాగాణి, బంగారం... బ్యాంకుబ్యాలెన్సు... వగైరా వగైరాలు చెప్పి నన్నూ నాన్నను లొట్టలేసుకుంటూ పెళ్ళిచూపులకు పరిగెత్తేలా చేశాడు పేరయ్య!

పెళ్ళిచూపుల కెళ్ళాం! అది ఒక మారుమూల పల్లె. బస్సుదిగాక రెండు కిలోమీటర్లు నడవాలి.

నడిచే పనిలేకుండా అమ్మాయి తండ్రి బండి కట్టించి పంపారు.

ఆ బండి ఎలాగుందంటే రాజుల సినిమాల్లో రాజుగారు ఊరేగి వెళతాడు చూడండి అలాగుంది.

గుర్రానికి చేసిన అలంకారపు ఖర్చులో పావలా భాగముండదు నా జీతం.

ఇంత ధనవంతులు మమ్మల్ని పిలవడమేమిటి? అని సందేహం మనసులో తొలిచింది. ఏం జరుగుతుందో చూద్దామనుకున్నా!

ఇక మర్యాదలు చేశారు చూడండి. అబ్బో! అవన్ని రాస్తే పోస్టుమేన్ బరువు మొయ్యలేక విసిరిపారేసినా ఆశ్చర్యంలేదు. కూర్చుంటే మర్యాద లేస్తే మర్యాద. మనం నోరు విప్పినా వినయం. వాళ్ళు నోరు విప్పినా వినయమే! "అల్లుడుగారు! అల్లుడుగారు" అంటూ వరసలు కలిపేశారు.

ఊరు ఊరంతా వచ్చి నన్ను చూసి వెళ్లారు. "పెళ్ళికొడుకు చక్కగున్నాడు. ఈడుజోడు మహాబాగా కుదిరింది. కనకరాజుగారా? మజాకా? " (అమ్మాయి తండ్రి పేరు కనకరాజులెండి) ఇలా మాట్లాడుకొంటూ నాకు ఎవరికి తోచిన సర్టిఫికెట్లు వారు ఇచ్చేసుకుంటున్నారు. వాళ్ళు పెట్టిన ఫలహారాలతోనే కడుపునిండిపోయింది.

అమ్మాయిని తీసికొచ్చి నా ఎదురుగ్గా కూర్చోబెట్టారు.

నిజం చెప్పొద్దూ! నా కళ్ళు జిగేల్‌మన్నాయి. ప్రాణమున్న పాలరాయిబొమ్మలా ఉంది. చాలా చాలా అందంగా ఉంది. మా




అమ్మా నాన్నలకు కూడా అమ్మాయి నచ్చింది.

అయితే, ఇంత షావుకార్లు, అమ్మాయి అందగత్తె కదా అల్లుడిని ఏ జాగీర్దారునో జమీందారునో తెచ్చుకోక ఒక సామాన్య యువకుడిని తెచ్చుకోవటంలో అర్థమేమిటి?

నా మనసులో సందేహాలు పెళ్ళిళ్ల పేరయ్యను బయటకు లాక్కుపోయి బయటపెట్టాను.

"అయ్యో! అంత అనుమానం పడాల్సిందే మీలేదు బాబూ? అక్కడ కూర్చున్నాడు చూడు అమ్మాయి తాతగారు... ఆ ముసలాడికి సవాలక్ష సందేహాలుట. జాగీర్దార్లు, జమీందార్లకు చెడ్డ అలవాట్లుంటాయిట. ఆస్తి కరిగిపోయేలా చేసుకుని వీధిన పడతారుట. ఎలాగైనా సరే గవర్నమెంటు ఉద్యోగికే... అతని కెంత చిన్న జీతమైనా సరే గవర్నమెంటు ఉద్యోగికే ఇచ్చి చెయ్యాలి. ఆస్థి కరిగిపోయినా, ఏది ఏమైనా బతికినంతకాలం గవర్నమెంటు పెన్షను ఇస్తుంది. దాంతో బతికేయచ్చు అంటూ ఛాదస్తంతో అందర్ని వేపుకుతింటుంటే... అమ్మాయి తల్లితండ్రులు కాదనలేక ఒప్పుకున్నారు. దాదాపు రెండు సంవత్సరాలనించి వెతుకుతున్నారు. ఉద్యోగముంటే అందంలేక, అందం ఉద్యోగం ఉంటే సాంప్రదాయాలు సరిలేక, వాయిదాలేస్తూ వస్తున్నారు. ఇదిగో ఇప్పటికి నీవు దొరికావు" అన్నాడు పేరయ్య!

సందేహనివృత్తి అయ్యాక తృప్తిపడ్డాను "అయినా ఇంత ఆస్థి, ఐశ్వర్యం గల అమ్మాయి మా ఇంటికొచ్చి కాపురం చేస్తుందా? కయ్యానికైనా, వియ్యానికైనా సమ ఉజ్జీ ఉండాలంటారు. కొంపదీసి నన్ను ఇల్లరికం రమ్మంటారా" అనడిగాను.

అబ్బెబ్బే! అలాంటిదేంలేదు. ఎందుకంత అనుమానిస్తావు. అంటూ నానోరు మూయించాడు పేరయ్య.

ఇచ్చిపుచ్చుకోవటాలు లాంచనాల గురించి

మాట్లాడుకోసాగారు. అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళారు. నేను అక్కడున్న పుస్తకం ఒకటి మొహానికడ్డంపెట్టుకుని చదువుతు న్నట్టు నటిస్తూ వారి మాటలు వింటు న్నాను.

ఇంతలో అమ్మాయి తాతగారు "అన్నీ సరే మీ అబ్బాయికి కట్నకానుకలు, మా అమ్మాయికి బంగారం, ఆస్థి మేము ఇస్తాము. మీరు మా అమ్మాయికి ఏమి స్తారు? " అనడిగాడు.

"మీరిచ్చినంత మేమివ్వగలమా? మాతా హతుకు తగ్గట్టు అమ్మాయి మెడలోకొక గొలుసు చేయిస్తాము. కంచిపట్టుచీరలు రెండు కొంటాం. పెళ్ళయ్యాక నిదానంగా వీలు చూసుకుని ఓ నాలుగు బంగారుగా జులు చేయిస్తాం" అంది అమ్మ.

"అయ్యో! అదికాదమ్మా అవన్ని సరే! శాశ్వతంగా అమ్మాయిపేరుమీద కొంత వేయాలి "అన్నాడు ముసలాయన.

"శాశ్వతంగానా? అంటే? ఎందుకు? " అడిగాడు నాన్న.

"అయ్యో! మీకర్థంకావటంలేదే! ఇపుడ యితే అంతా బాగున్నారు. రేప్పొద్దున మీ అబ్బాయి నవ్వితే? అపుడు మా అమ్మాయి పరిస్థితి ఏంటి? "

"అబ్బాయి నవ్వితే అమ్మాయీ నవ్వు తుంది ఇందులో కొత్తగా పరిస్థితి ఏముంది" నాన్న నవ్వుతూ అన్నాడు. నాకూ నవ్వు వచ్చింది.

"హయ్యో! హయ్యో! పాపం శమించు గాక!" ముసలాయన భార్య లెంపలేసుకుని దేముడికి దణ్ణంపెట్టుకుంది.

"ఏమిటయ్యా! అపశకునపు మాటలూ నువ్వూనూ! అబ్బాయి నవ్వితే అమ్మాయి నవ్వటానికి ఇవేం సతీ సహగమనపు రోజులా? " అన్నాడు.

అతని మాటల అంతరార్థం నాకూ నాన్నకూ అర్థమైపోయాయి. నవ్వటం అంటే చావటం అన్నమాట.

నాన్నకు కోపంతో మాటలురాలేదు.

ముసలాయన మళ్ళీ అందుకున్నాడు.

"ఈరోజుల్లో బయటికి వెళ్ళిన వాడు ఇంటికి తిరిగి వచ్చేదాకా నమ్మకాల్లేవు. ఎక్క డంటే అక్కడ, ఎప్పుడంటే అప్పుడు నవ్వేస్తు న్నారు. ఆడపిల్లల పరిస్థితులు చాలా దుర్భ రంగా మారిపోతున్నాయి. మా అమ్మాయి భద్రతకోసం మేము చూడటంలో తప్పులే దుగా!"

పెళ్ళిళ్ళ పేరయ్య నాన్నను, నన్ను పక్కకు తీసికెళ్ళాడు. "ఆ ముసలాయన ఛాదస్తం మీరేం పట్టించుకోకండి. వాళ్ళ వంశాచార ప్రకారం భవిష్యత్తులో భర్త చని పోతే భార్య దిక్కులేనిది కాకుండా, బతకటా నికి, ఆధారముండాలిగనుక, అమ్మాయి పేర కొంత డబ్బు, దస్కం వేయించటం పరిపా టిట. ఆ, ఆనవాయితీ ప్రకారం మిమ్మల్ని అడుగుతున్నాడు. ఎంతో కొంత వేస్తామని చెప్పేసెయ్యండి. ఇలాంటి సంబంధం జన్మంతా వెతికినా దొరకదు" అన్నాడు.

"ఏంటయ్యా దొరికేది నా పిండం! శుభమా అని పెళ్ళి చూపులకొస్తే మావా డిని పట్టుకుని రేపు వాడు చస్తే? అంటాడా!" నాన్న చిందులేశాడు.

"అబ్బబ్బ! 'చస్తే' అని ఎక్కడన్నాడు? దాని పర్యాయపదంగా 'నవ్వితే' అన్నాడు గదా పట్టించుకోకండి! మంచి సంబంధం" అంటూ పేరయ్య గోలపెట్టాడు.

"ఏమిటీ చావుకు పర్యాయపదం నవ్వ టమా! ఇంకా సేపు ఇక్కడే కూర్చుంటే...

నువ్వు నవ్వితే... నీ పెళ్ళాం నవ్వితే... అంటూ నన్నూ నా భార్యనూ అనేటట్టు న్నాడు. రేయ్ ఈ సంబంధం మనకొద్దు! పద వెళ్దాం అంటుండగానే లోపలికి రండి అంటూ పిలవటంతో మళ్ళీ లోపలికి వెళ్ళాం!

"ఏమిటి నాయనా ఏం నిర్ణయించుకున్నారు? " ముసలాయన అడిగాడు.

"ఏవిషయం? " కటువుగా అడిగాడు నాన్న.

"అదే అబ్బాయి నవ్వితే"...

అతని వాక్యం పూర్తికాకుండానే నాన్న "ముందిది చెప్పండి మీ వయసెంత? " అనడిగాడు.

"దాదాపు ఎనభై"

"అయితే త్వరలోనే మీరు నవ్వబోతున్నారన్నమాట!"

"ఆ! ఆ! అమంగళం శమించుగాక!" అంటూ ముసలావిడ తాళిబొట్టు కళ్ళకద్దుకుంది!

"ఏమిటా అపశకునపు మాటలు" గాండ్రించాడు ముసలాయన.

"ఇందులో అపశకునమేముంది! మనమంతా ఎప్పుడైనా నవ్వవలసిన వాళ్ళమే. కాకపోతే కాస్త ముందూ వెనుకా! మీరు నవ్వి ఊరుకుంటే బామ్మగారికి ఏదైనా అండగా డబ్బు దస్కం బ్యాంకులో వేశారా? "

నాన్న మాటలకు ముసలాయన బి.పి. ఎక్కువై ఊగిపోయాడు!

"ఒరే పేరిగా! ఇలాంటి సంబంధం పట్టుకొచ్చావేమిట్రా! నిన్ను తగలెట్టా!" ముసలాయన కేకలేశాడు.

అమ్మాయి తండ్రి, మిగతా పెద్దలు ఆయన్ని శాంతపరిచే మాటలు మాట్లాడసాగారు.

"కాటికి కాళ్ళు చాపుకున్న నీకే చావు గురించిన మాటలు కర్ణకఠోరంగా ఉంటే ఇంకా పెళ్లి కూడా కాని నా కొడుకు గురించి అమంగళపు మాటలు మాట్లాడితే నాకెలా గుంటుందో అర్థం చేసుకో! మీ అమ్మాయికి పెళ్లి మనుషులతో చెయ్యకు. ఏ కత్తితోనో, చెట్టుతోనో, పుట్టతోనో చెయ్యి! మనుషులైతే త్వరగా చస్తారు. లేరా! ఇంకా కూర్చున్నావెందుకు" అంటూ నాన్న నన్ను లేపుకొచ్చేశాడు.

"వీడి మొహానికి డబుల్ మీనింగు మాటలొకటి! మర్యాదలు చూసినపుడే అనుమానం వచ్చింది నాకు. అతి వినయం ధూర్త లక్షణం అని" అంటూ వారం పదిరోజులదాకా నాన్న వాళ్లను తిడుతూనే ఉన్నాడు.

ఇదండీ నా పరిస్థితి.

వడ్డించిన విస్తరిముందునుంచి లేచివచ్చినట్టయింది నాకు! ఇంతకీ నాకు పెళ్లి యోగం ఉందాలేదాని కేరళ జ్యోతిష్కుల నడగాలనుకున్నాను.

'మన రాష్ట్రంలో లేరా అంత దూరమెందుకు? ' అంటారా?

"ఆ భాష మనకు రాదుకదా! వాళ్ల భాషలో వాళ్లు చెబుతారు. మన భాషలో మనకు అనుకూలంగా ఊహించుకుని తృప్తి పడచ్చు! ఏమంటారు?

"నా సంగతి సరే! సిగ్గులేని శివరాత్రికి ఏటా జాగరణే అన్నట్టు నా సమస్య తెగేది కాదు తెల్లవారేదికాదు. ఎప్పుడో నాకు యాభైయ్యవ పడిలోపడ్డాక అప్పటికి మా నాన్న, అమ్మ హుష్‌కాకి అయిపోయుంటారుగనుక నా పెళ్లికే ఆటంకం ఉండదు. అప్పుడు నిర్భయంగా నా స్వంత ఖర్చుతో పేపరులో ఫ్రంటు పేజీలో 'వధువుకావలెను' అని వివరాలతో ప్రకటన ఇస్తాను. నా ఇంటిముందు ఆడపిల్లలు క్యూ కట్టక పోరు. నేను వరించకపోను. ఏమంటారు?

"ఏం నాయనా పగటికలలుకంటున్నావా? యాభై ఏళ్లవయసులో నీకు పెళ్లి కావల్సి వచ్చిందా వెధవా! అని, చీపుర్లతో ఇంటిముందు క్యూకట్టి తన్నినా ఆశ్చర్యం లేదు" అంటారా?

"ఈ కాలం ఆడపిల్లలు అన్నింటా సమర్థ

వంతులు బాబోయ్!

"అన్నింటా సమర్థవంతులు అంటే నాకో విషయం గుర్తుకువచ్చింది. ఆమధ్య నేను నా స్నేహితుడి పెళ్లికి ఊరు వెళ్లాను. బస్సు ప్రయాణం నాకు పడదు. అయినా ఆ ఊరికి రైలు సౌకర్యం లేనందున తప్పనిస రిగా బస్సు ప్రయాణం. ఆ బస్సులో ఓ లేడీ కండక్టరు చకచక టికెట్లిస్తూ ఉంటే చూడ టానికి చాలా ముచ్చటేసింది సుమండీ! బస్సు బాగా రద్దీగా ఉంది.

"ఉన్నట్టుండి ఆ అమ్మాయికెవ్వన కేకవే సింది.

"ఇద్దరు యువకులు క్రిందామీదాపడి కొట్టుకుంటున్నారు.

"నాకైతే అస్సలు ఏం పాలుపోలేదు. ఏమిటి సంగతి అని నా పక్కనున్నతన్ని అడిగాను.

"కండక్టరమ్మను ఒకడు నడుం దగ్గర గట్టిగా గిల్లాడట. అది చూసి ఇంకో అతను వాడిమీద కలియబడ్డాడుట. అదీ సంగతి"

"బస్సు ఆపేశారు. డ్రయివరు వచ్చి ఆ ఇద్దర్నీ బస్సు దింపేశాడు బలవంతంగా! వాళ్లిద్దరు బూతులు తిట్టుకుంటున్నారు.

"నీకెందుకురా అంత రోషం! దాన్ని గిల్లు తాను మళ్లీ మాట్లాడితే ముద్దుపెట్టుకుం టాను. అడగటానికి నువ్వెవరు" అంటున్నా డొకడు.

"నేనెవర్నా! ఆ అమ్మాయి నాకాబోయే పెళ్లాం. మా ఇద్దరికీ నిశ్చితార్థం కూడా జరి గిందిరా! ఇంకోసారి మాట్లాడావంటే పళ్లురా లగొడతాను"

"వార్నీయబ్బ! కాబోయే పెళ్లామా! నేను దాన్ని ఉంచుకున్నానురా పిచ్చినాయాల!" అని రెండోవాడు అంటుండగానే మళ్లీ కలి యబడి పోట్లాడుకున్నారు.

"వారి మాటలు ఇక వినదలుచుకోనట్టు 'రైట్ రైట్' అంది లేడీ కండక్టరు.

"ఆ తర్వాత ఆ అమ్మాయి గురించి ఆచూకీ తీశాను. ఆ అమ్మాయి పేరు లక్ష్మి! నిజంగానే అతనితో నిశ్చితార్థం జరిగిందిట. కానీ ఈ గొడవ జరిగేసరికి అతను ఈ పెళ్లి రద్దు చేసుకున్నాడట. ఎంతమంది చెప్పినా చివరికి ఆ అమ్మాయిచేత ఉద్యోగం మానిపి స్తామని చెప్పినా వినకుండా పెళ్లి చేసుకోన న్నాడుట.

"నిజంగా నాకు చాలా బాధనిపించింది. ఉద్యోగం చేసే ఆడపిల్లల మీద పురుషాహం కారం ప్రదర్శించి వాళ్లనెంతగా అణచివేస్తు న్నారోకదా అనిపించింది.

"ఒకడు నాకాబోయే పెళ్లాంరా అంటే ఇంకొకడు నేనుంచుకున్నాను అంటుంటే ఆ మాటలు విని ఆ అమ్మాయెంత కుమిలిపో యిందో. అతను పెళ్లి చేసుకుని ఉంటే ఆ అమ్మాయికి కాస్త ఉపశమనంగా ఉండే దేమో.

"దాదాపు వారం రోజులు ఆ అమ్మాయి గురించిన ఆలోచనలు నన్ను వదల్లేదు. దానికితోడు న్యూస్‌పేపరు తెరిస్తే చాలు ఎక్కడో ఒకచోట అమ్మాయిల, యువతుల ఆత్మహత్యల గురించి వార్తలు.

"ఓ రోజు పేపర్లో ఆగిపోయిన పెళ్లి కార ణంగా వంటిమీద కిరోసిన్ పోసుకుని నిప్పంటించుకుని మృతి చెందిన యువతి అంటూ రాశారు. నా గుండె గుభేలు మంది. అదీగాక చనిపోయిన అమ్మాయి పేరు కూడా చివర్లో లక్ష్మి అనే ఉంది. నేను చూసిన లేడీ కండక్టరు గురించి వివరాలు చెప్పే అతను కనిపించలేదు.

"రోజూ ఉదయం సాయంత్రం బస్టాపు కెళ్లి ఆ అమ్మాయి కనిపిస్తుందేమోనని ఎదురు చూశాను. కనిపించలేదు. ధైర్యం చేసి ఎవరైనా డ్రయివర్లనుగానీ కండక్టర్లను గానీ ఫలానా లక్ష్మి అనే కండక్టరు ఆత్మ హత్య చేసుకుందా? ఆమె కనిపించటం




లేదెందుకు? ఆవిడ అడ్రస్ ఏమిటి అని అడగాలంటే చాలా భయం వేసింది. గతంలో జరిగిన అనుభవం తాలూకు గుర్తుకు వచ్చి ఆ ప్రయత్నం మానేశాను. అయినా ఆవిడెలాపోతే నాకెందుకు అని చాలాసార్లు అనుకున్నా మనసును ఊరు కోబెట్టలేకపోయాను.

"దాదాపు నెల రోజుల తర్వాత ఓ రోజు పార్కులో కనిపించిందా అమ్మాయి. ఒంట రిగా కూర్చుంది. దూరంగా ఆడుకుంటున్న పిల్లలవైపు చూస్తూ కూర్చుంది. మాటిమా టికీ చీరకొంగుతో కళ్లు తుడుచుకుంటోంది.

"ఆ అమ్మాయిలో కనిపించిన సంతోషం ఒక వైపు, ఆమె కూర్చుని బాధపడే తీరు మరో వైపు ముప్పిరిగొని గబగబ ఆమెవైపు అడు గులు వేశాను.

"మరీ హలో అనో హాయ్ అనో పలక రించే పరిస్థితి కాదు. నెమ్మదిగా అడుగులే సుకుంటూ వెళ్ళి ఆమె ప్రక్కన కాస్త దూరంలో చతికిలబడి 'బావున్నారా?' అన్నాను.

"వెంటనే తల తిప్పి చూసి, నొసలు ముడివేసి, మీరెవరన్నట్టు చూసింది. 'మీరు నాకు తెలుసు. నేను మీకు తెలీదు. నా పేరు సారథి'. అంటూ ఫలానా రోజు ఫలానా బస్సులో గొడవ అంతా గుర్తు చేశాను.

"అలాగా! అయితే ఏమిటిట?" కటువు ధ్వనించింది గొంతులో.

"అబ్బే! ఏంలేదు మీరు కోపం తెచ్చుకో కండి! బాధపడకండి. ఈ ఉద్యోగంలో కాస్త రిస్కులుంటాయి. నాకూ ఓ కలం స్నేహితు రాలు లేడీ కండక్టరుంది. ఆమెద్వారా మీ ఉద్యోగంలో సాధక బాధకాలు తెలుసు వాడెవడో జులాయి వెధవ ఏదో అన్నాడని మీక్కాబోయే భర్త పెళ్లి రద్దు చేసుకున్నాడని తెలిసి... చాలా బాధపడ్డాను. మీరదే ఆలో చిస్తూ ఇలా ఒంటరిగా కూర్చుని కన్నీరు కారుస్తుంటే నేను చూడలేను. ఈ రోజుల్లో ఆడపిల్లలు చాలా ధైర్యంగా ఉండాలి" అంటూ గబగబా మాట్లాడేశాను.

"ఆమె ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసి నా వైపు చూసింది.

నన్ను పూర్తిగా మాట్లాడనిచ్చి తర్వాత నెమ్మదిగా "చూడండి! మీరెవరో నాకు తెలీదు. అనవసరంగా నా గురించి ఆలో చించి మీ మనసు పాడుచేసుకుంటున్నారని పిస్తోంది. నేనిక్కడ కూర్చుని ఏడవటం లేదు. గాలికి కంట్లో నలుసుపడింది. ఇక పోతే ఆగిపోయిన పెళ్లంటారా? అది ఆగితే ఇక నాకు పెళ్లికాదా? అందులోనూ ఉద్యోగం చేస్తున్నానుకదా! సంపాదన చూసి అయినా ఎవరో ఒకరు నాకు భర్తగా వస్తారు. ఈ రోజుల్లోకానీ ఆ రోజుల్లోకానీ ఆడపిల్లలకు పెళ్లికాకుండా నిలబడిపోయే ప్రసక్తిలేదు. భర్త మాత్రం ఖచ్చితంగా దొరు కుతాడు. కాకపోతే మంచి భర్త దొరకటం కష్టం! అసలీ ప్రపంచంలో మంచి అన్న, మంచి తమ్ముడు, అమ్మ, నాన్న, వదిన, చెల్లి, అక్క, మరిది... ఇలా అంతా మంచి వారుంటారు కానీ పురాణాలనుంచి ఇప్పటి దాకా ఆపై లోకంలోకానీ ఈ భూమ్మీదగానీ మంచి భర్త మాత్రం లేడు! ఇది జగమెరి గిన సత్యం"

"ఆమె ఇంకా ముగించకముందే రెండు అయిస్క్రీంలు పట్టుకుని ఓ యువకుడు మా దగ్గరికొచ్చి ఆమెచేతికొక ఐస్క్రీం ఇచ్చి నా వేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"నేను నోరు విప్పేలోగానే ఆ అమ్మాయి "ఇతను మా దూరపు బంధువు. నాకు అన్నయ్య అవుతాడు. మన పెళ్లికి శుభలేఖ పంపలేదెందుకని నిష్ఠూరమాడుతున్నాడు. అనుకోకుండా... వ్యవధిలేకుండా... పెళ్లయి పోయిందని చెబుతున్నాను" అంది.

"శరీరాకృతిలో అతను ఆ అమ్మాయి

పక్కన భర్తగా నుంచోటానికి బాగానే ఉన్నాడు. వారిదగ్గర సెలవు తీసుకుని ఇవ తలికొచ్చేశాను.

"ఈ ప్రపంచంలో 'మంచి భర్త మాత్రం లేడు' అన్న ఆమె మాటలు నన్ను చాలా రోజులు వెంటాడాయి. ఎందుకో మనసు భారంగా తయారయ్యింది. ఇక రాయలేను. ఉంటానండి లీలగారూ! మీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ..." సారధి.



"అమ్మాయ్! అరవిందా! కరుణాకర్ ఎక్క డున్నాడో కనుక్కో తల్లీ! మళ్లీ మనమంతా మన ఇంట్లో ఉందాం. మీ భార్యాభర్తలను కలిపే దాకా నా ఈ జన్మకు మోక్షంలేదు" అంది అరవింద అత్తగారు కన్నీళ్లు తుడుచు కుంటూ!

"కనుక్కుంటానుగాని మీరేం ఆలోచించ కుండా నిశ్చింతగా ఉండండి! ఎక్కువ ఆలో చిస్తే బిపి పెరుగుతుందని డాక్టరు చెప్పారు గుర్తుందా? మీరు ఆరోగ్యంగా ఉంటే నేనూ నిశ్చింతగా ఉద్యోగం చెయ్యగలుగుతాను" అంది అరవింద.

మనసు బాగుంటేనేకదా ఆరోగ్యం బాగుం డేది మనసులోనే గొణుక్కుంది ముసలా విడ.

కోడలు ఆమెకిప్పుడు దేవతలాగా కనపడు తోంది. కాలు విరిగితే ఒక రోజా? రెండు రోజులా? ? మూడు నెలలు తనకు సేవలు చేసింది. కూతురికి ఉత్తరాలు రాయిస్తే వచ్చి ఒక్కపూట ఉండి ఆమె భర్తకు వంట కష్టం! పిల్లలకు స్కూళ్లున్నాయి అంటూ పరారయింది.

కోడలేమో చంటిదాన్ని పెట్టుకుని, ఉద్యోగం చేస్తూ తనకేమాత్రం లోటులే కుండా చూసుకుని తనను మళ్లీ మనిషిని చేసింది. నిజానికి ఈ యాక్సిడెంటు తన మనసు మారటానికే జరిగిందనిపిస్తోంది. కోడల్ని ఎన్ని మాటలు, ఎన్ని చిత్రహింస లకు గురిచేసింది తను. అయినా అవన్నీ మరిచిపోయి ఇలా మామూలుగా ఉండట మంటే మాటలా!

ఆమె స్థానంలో తనుంటే ఇంత ఉదా రంగా ప్రవర్తించేదా? భార్యాభర్తలను విడదీ సిన పాపం ఊరికే పోతుందా?

"అమ్మాయ్ లీలా! మా కరుణాకర్ ఎక్క డున్నాడో నీకేమైనా తెలుసా తల్లీ!" అంది.

"ఆ మధ్య ఓసారి కనిపించారు పెద్దమ్మా! నన్ను చూడగానే మొహం ప్రక్కకు తిప్పుకుని వెళ్లిపోయారు. కనుక్కుం టానులెండీ" అంది లీల.

"పుణ్యం కట్టుకో తల్లీ! నా కోడలు, కొడుకు చక్కగా కాపురం చేసుకుంటుంటే చూడాలనుంది. అది ఈ జన్మకు తీరు తుందో లేదో! పాపిష్టిదాన్ని వాడి మనసు విరిచేశాను" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది.

"అయ్యో! అదేమిటి! అంతలా బాధపడు తున్నారు! ఇపుడేం జరిగిందని. భార్యాభర్త లన్న తర్వాత ఏవో గొడవలు వస్తూ ఉంటాయి. ఎంతమంది విడిపోయి మళ్లీ కలుసుకోవటంలేదు. భలేవారే! ప్రతిదానికీ బాధపడతారేంటి రెండురోజుల్లో మీ అబ్బాయి ఆచూకీ కనుక్కుంటాను, సరేనా" అంది లీల.

"ఊరికే ఆచూకీ కనుక్కోవటం కాదే తల్లీ! వారిద్దరినీ కలిపే బాధ్యత నీదే! వాడు నా

మొహం చూడడు. నా మాట వినడు కూడా. అరవింద వెళ్లి అతన్ని బతిమిలాడే ధోరణిలోలేదు. ఎన్నాళ్లిలా? నీవు పూను కుంటే తప్ప వారి కాపురం చక్కబడదు. నీమీద నాకు పూర్తి నమ్మకముంది" అంది.

"అలాగే! అలాగే! మీరు కాస్త నెమ్మదించండి. వెళ్లి విశ్రాంతి తీసుకోండి!" అంటూ ఊరడించింది లీల!

ఆ సాయంత్రం "అరవిందా! మీ వారి దగ్గరికెడదాం పద!" అంది లీల.

"ఎక్కడున్నారు? ఎందుకు? " రెండు ప్రశ్నలు ఒకేసారి వేసింది.

"ఎక్కడున్నది నాకు తెలుసు. ఎందుకంటావేమిటి? ఎన్నాళ్లిలా విడిపోయి ఉంటారు? టైం బాగా లేక ఏదో జరిగింది. ఇపుడు అందరి మనసులు చక్కబడ్డాయి..."

ఆమె వాక్యం పూర్తికాకముందే "నువ్వసలు లీలవేనా.. ఒంటరిగా ఆడది బతకలేదా? అదీ ఇదీ అంటూ ఒకప్పుడు లెక్చరిచ్చేదానివి. ఇపుడు మళ్లీ నన్ను రాజీపడమంటున్నావు. ఎప్పుడూ నీవు చెప్పినట్టు నేను విని తీరాలా? " కాస్త కోపంగా అంది అరవింద.

"నిన్ను బాధపెట్టినందుకు తల్లీ కొడుకులిద్దరూ పశ్చాత్తాపపడుతున్నారు. నీవూ వారిని క్షమించేస్తే లైన్‌క్లియర్ అవుతుంది" కావేరి కల్పించుకుంది.

"కుక్కతోక వంకరని సరిచేయగలమా? ముసలావిడంటే కాటికి కాళ్లు చాపుకుంది కాబట్టి పశ్చాత్తాపపడి మారిపోయి బాధపడుతోంది. ఆయనగారికింకా ఉడుకు రక్తం గదా! ఇప్పుడప్పుడే మారరు. మీరు ఊరికే నస పెట్టకండి" విసుగ్గా అంది అరవింద.

"ఉడుకు రక్తమో, చల్లటి రక్తమో నాకు తెలీదు. నేను ఉదయం డాక్టరు దగ్గరికెళ్లి వస్తుంటే కరుణాకర్ గారు కనిపించారు. ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తున్నారట. వారం రోజులనుంచి విపరీతమైన దగ్గు, జ్వరమంట, గెడ్డం పెంచుకుని మనిషి బాగా డీలాపడిపోయి కనిపించాడు. అతన్ని చూడగానే నాకు చాలా బాధనిపించింది.

"అరవింద, పాప బాగున్నారా లీలగారూ!" అనడిగారు.

"బాగున్నారు, రండి వెడదాం! మీ అమ్మ గారు కూడా అరవింద దగ్గరేఉంటోంది" అంటూ మీ అత్తగారి కాలు విరిగిన విషయం అంతా చెప్పేశాను.

అంతా విని అతను మొహం బాధగా పెట్టాడు. 'అలాగా! ఉంటానండి' అంటూ వెళ్లిపోయాడు. బాగా చిక్కి సన్నబడ్డాడు. ఆయన కూడా పశ్చాత్తాపపడుతున్నట్టే ఉంది. ఏదో తల్లి మాటలు విని అపుడలా ప్రవర్తించాడేకానీ దుర్మార్గుడేమీ కాదు. అలా అని నీవే చెప్పేదానివి. స్వతహాగా దుర్మార్గుడైతే నేను కూడా నిన్ను ఇప్పుడు వెళ్లమనను. క్రూరుడైన భర్తతో కాపురం చేయటం కంటే పోరాడి ఒంటరిగా బతకటమే మంచిది. ఆ విషయంలో నా అభిప్రాయం ఎప్పుడూ మారదు. అవతలి వ్యక్తి పశ్చాత్తాప పడుతున్నప్పుడు మనమూ ఓ మెట్టు కిందికి దిగి రాజీపడితే తప్పులేదని నా అభిప్రాయం! బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి రా!" అంది లీల.

"లీల చెప్పింది కరెక్టే అరవిందా! నీ బాధలకు అసలు కారకురాలు మీ అత్తగారు. ఆవిడనే క్షమించేసి ఇంట్లో తెచ్చిపెట్టుకుని సేవలు చేస్తున్నావు. కట్టుకున్న భర్తతో కూడా అదే ధోరణిలో సాగిపోతే మంచిదేమో! పెద్దగా తెలిసిందాన్నికాదు. ఆ తర్వాత నీ ఇష్టం" అంది కావేరి.

"మీరిద్దరు చెప్పినట్టు వినొచ్చు కానీ నేనే వెళ్లి అతన్ని రమ్మని బతిమిలాడితే.. కథ మళ్లీ మొదటికొచ్చినా ఆశ్చర్యంలేదు. అతనికి మాత్రం భార్యా కూతురు అక్కర్లేదా?

అలా అవసరమైనపుడు అతడే వస్తాడు. అపుడు చూద్దాం! ఇపుడు నేను వెళ్లి క్షమా బిక్ష పెట్టేసి ఇంటికి తెచ్చుకునేది మాత్రం లేదు" నిక్కచ్చిగా చెప్పేసి అక్కడినుంచి వెళ్లి పోయింది అరవింద.

"పిల్లిలా ఉండేది ఎలా మాటలు నేర్చింది? ఎంత ఖచ్చితమైన నిర్ణయాలు తీసుకుంటోందో చూశావా? " తనలోతాను గొణుక్కుంటున్నట్టు అంది లీల! "అంతా ఒకప్పటి తమరి గీతోపదేశమే లీలమ్మ తల్లీ!" నవ్వుతూ అంది కావేరి.

ఆ రాత్రంతా అరవిందకు నిద్రపట్టలేదు. మనసనే త్రాసులో భర్తమీద ప్రేమ ఒక వైపు, ఆత్మాభిమానం మరోవైపు పెట్టి తూచింది. ఒకసారి అటు, మరోసారి ఇటు చివరికి ఎటూ తేలక తెల్లవారు ఝామున అలసిపోయి నిద్రపోయింది మనసు.

మరుసటి రోజు ఉదయం లేచి హడావి డిగా డ్యూటీకి బయల్దేరింది అరవింద. ఆ రోజు అరవిందతో కలిసి డ్యూటీకొచ్చిన డ్రయివరు బాషా "అమ్మో అరవింద బెహెన్ స్క్వాడ్ ఉన్నదంట. జాగర్తగ టికెట్లు కొట్టు" అన్నాడు.

"ఏమన్నా! నేనెప్పుడయినా అజాగ్రత్తగా టికెట్లు కొట్టి తలమీదకు తెచ్చుకున్నానా? అలా భయపెడుతున్నావు" అంది నవ్వుతూ అరవింద.

"అదికాదమ్మా! నా బామ్మర్ది కళ్యాణ దుర్గం డిపోలో పనిచేస్తున్నాడు. నీకూ తెలుసుకదా! నిన్న బస్సు ఫుల్‌గా ఉందంట. లాస్టు సీట్లోఎవడో పల్లెటూరి నాయాలు టికెట్టు తీసుకోకుండా నక్కి కూర్చుని వీనికి కనిపించలేదంట. అంతే ధనధనమని స్క్వాడ్ వచ్చి బస్సు ఆపి చెక్ చేస్తే వాడు దొరికినాడంట. ఇంకేముంది టికెట్టు తీసికో నివాడు జైలుకు, టికెట్టు ఇవ్వనోడు ఇంటికి. బాగుండ్లేదాకత! వానికి లక్షసార్లు చెప్పి నాను. వళ్లు దగ్గర పెట్టుకుని టికెట్లు కొట్టు అని. ఇంటేనా? ఇప్పుడు సూడు. సస్పెండు. కోర్టులు కచేరీలు. డబ్బుల్లేక సావు"

తెలుగు సరిగ్గా రానందువల్ల కాస్త మెర టుదనం, యాస కలిపి చెబుతుంటే అర విందకు నవ్వు వచ్చింది. నవ్వితే బాగుండ దని "అయ్యో పాపం? " అంది.

"ఏం పాపం లేమ్మా! ఆడపిల్లలు మీరుమే లుగద. నిజాయితిగ 'కాం' చేసుకుని పోతు న్నరు. ఆశకు పోతే గోసిలో రాయి అని పెద్దోల్లు ఊర్కే సెప్పినార. బస్సెక్కి నాటినుంచి యాడ సిల్లర కొట్టేద్దునా యాడ మిగుల్తుందా అని సూస్తుంటాడు. దేవుడు గుడ్డోడా? ఒక్కసారి శాస్తి జరిపిస్తడు. ఇట్టాం టివాళ్ల మూలంగా మీలాంటి మంచోల్లకు సెడ్డపేరు జనంలో!" అన్నాడు సిగరెట్టు ముట్టించుకుంటూ బాషా.

"డ్యూటీ కెక్కిన తర్వాత సిగరెట్లు కాల్చ వద్దన్నానుకదన్నా! అదేదో సామెత చెప్పి నట్టు వాళ్ల తప్పులు వీళ్ల తప్పులు లెక్కబె డుతున్నావు. నువ్వు మాత్రం సిగరెట్టు కాలుస్తావు!" అంది అరవింద కాస్త విసుగ్గా.

"అయ్యో! లేదు తల్లీ! మాఫ్‌కర్ బెహెన్. ఇంకా బస్సెక్కలేదుకదమ్మా! పాడు అలవా టయింది. ఏం చేస్తును. బస్సెక్కితే గప్‌చిప్ అయిపోతాను" అన్నాడు సిగరెట్టు కిందప డేసి కాలితో నలుస్తూ.

"సరిసరి పదపద టైం అయింది" అంటూ తొందరచేసి బస్సెక్కింది అరవింద.

బస్సు ఫుల్‌గా రద్దీగా ఉంది. నిలబడటా నికి కూడా స్థలం లేనట్టుంది. అదీగాక ఆరోజు సంత. సరుకుల మూటలతో సంచులతో నడవటానికి వీల్లేకుండా దార్లో వేసుకున్నారు ప్యాసింజర్లు! తోసుకుంటూ ఇబ్బందిపడుతూ అందరికీ టికెట్లిచ్చేసి వచ్చి సీట్లో కూర్చుని ట్రేముందు పెట్టుకుని సరి చూసుకోసాగింది. అరవింద పక్కన ఓ నడి

వయసావిడ కూర్చుంది. అరవింద ఆమెను గమనించలేదు. తన పని తాను చూసుకో సాగింది. స్టేజివచ్చినపుడు హోల్డాన్ అంటూ జనం ఎక్కగానే రైట్ చెబుతూ, మళ్లీ టికెట్లిస్తూ తన పనిలో తాను మునిగి పోయింది. ఉన్నట్టుండి బస్సు ఆగింది. ఇక్కడస్టేజిలేదు ఎందుకాగిందా అని తలెత్తి చూసింది అరవింద. దబదబమంటూ ఎక్సైజ్ పోలీసులు బస్సులోపలి కెక్కి అందరి బ్యాగులు కదిపి చూస్తున్నారు. ఈ ఎక్సయిజువాళ్లకింకేం పనిలేదు. ఈ పల్లె టూరికెళ్లే బస్సుల్లో మద్యపానం ఎవరు మోసుకెళుతుంటారు. ఈ బస్సునిండా కూటికి గంజికి లేనివాళ్లు... టికెట్టు డబ్బు లకు ఇంకా పావలానో, అర్ధరూపాయో తక్కువిచ్చి ఏడిపించేవాళ్లుంటే వేలువేలు పోసి సారాయి బ్రాంది కొనుక్కుని వెళ్లి వ్యాపారం చేయగలరా? పెద్ద మనుషుల ముసుగులు తొడుక్కుని.. కార్లలో, జీపుల్లో, హైటెక్ బస్సుల్లో రవాణా చేస్తున్న వారిని చూసి చూడనట్టు వదిలేస్తారు. అమాయ కంగా ఉండే ఈ పల్లెటూరి జనంమీద దండెత్తి ప్రతాపం చూపిస్తుంటారు. గవర్న మెంటు పెట్టిన ఈమద్యపాన నిషేధం కాదుగానీ రోజూ పెద్ద తలనెప్పి అయిపో యింది. మనసులో విసుక్కుని రిస్టువాచీ చూసుకుంది. కను చీకటి పడుతోంది అను కుంటూ.

"ఏయ్! ఏముందీ బ్యాగులో గలగల మంటున్నాయి!" తన సీటు దగ్గరున్న బ్యాగును శబ్దం చేస్తూ ఓ పోలీసు అడిగేస రికి ఆలోచనల్లోంచి ఉలిక్కిపడింది అర వింద.

అరవింద పక్కన కూర్చున్న స్త్రీ నుద్దేశించి గదమాయించి అడుగుతున్నారు పోలీ సులు.

బిత్తరపోయిన ఆ స్త్రీ "ఏమో బాబూ! ఆ బ్యాగు నాదికాదు" అంది తక్కున.

"నీ దగ్గరున్న బ్యాగు నీదికాకుంటే ఇంకెవ రిది. అవతారం చేష్టలు చెయ్యకుండా నిజం చెప్పు మక్కెలిరగదంతా" అంటూ బూతు లందుకున్నాడా పోలీసు బ్యాగులోంచి బ్రాందీ సీసాలు బయటకు తీస్తూ.

"ఏంది బాబూ! అట్లరుస్తావు. ఈ సీట్లో నేనొక్కదాన్నే కూచున్నానా. ఈ బ్యాగు కండక్టరమ్మది" అనేసింది గబుక్కున.

అరవింద తుళ్లిపడింది! "ఏయ్! ఏమిటి వాగుతున్నావు. ఇందాకట్నించి ఆ బ్యాగును ఒళ్లో పెట్టుకుని కూర్చున్నావు. ఇపుడు నాదంటావేమిటి! మతిపోయిందా? " తత్తర పాటుగా మాట్లాడింది అరవింద.

కానిస్టేబులు అనుమానంగా చూశాడు అరవిందవైపు. ఇంతలో యస్.ఐ అక్కడికి చేరుకున్నాడు. "ఏంటి గొడవ? " అనడి గాడు. కానిస్టేబులు వివరించాడు. "ఈ బ్యాగులో బ్రాందీ సీసాలున్నాయి సార్! కండక్టర్‌దని ఈవిడ అంటోంది. ఆవిడదని కండక్టరంటోంది" అన్నాడు.

"ఇద్దర్నీ రిమాండుకు తీసుకో. దిగమ్మా!" అన్నాడు యస్.ఐ. అరవింద నుద్దేశించి. అరవిందకు కళ్లనీళ్లపర్యంతమైంది.

డ్రయివరు వచ్చి కలుగచేసుకున్నాడు. "ఏంటిసార్! కండక్టర్లు డ్రయివర్లు బ్రాందీ సీసాలు అమ్ముకునేవాళ్లలాగా కనిపిస్తున్నరా మీకు!

ఆడ కూతురని కూడా చూడకుండా ఏమి టాతొందర! ఈ పనికిమాలిన ముండ ఏదో చెప్పినదని నమ్మెయ్యటమేనా" అంటూ ముందుకొచ్చాడు.

"చూడు డ్రయివర్‌సాబ్! ఆవేశపడకండి. కండక్టరును జైల్లో పెడతామా? లాఠీతో కొడతామా? మాకేమంత తెలివిలేదా? సి.ఐ.దగ్గరికి తీసుకుపోయి ఈ బ్యాగు ఎవ రిది అన్నది రుజువు చేయించి ఆమెను పంపించేస్తాం. ప్యాసింజర్లనందర్నీ వేరే

బస్సుకెక్కించి మీరూ రండి" అన్నాడు యస్.ఐ.

"ఏమిటన్నా! ఈరోజు ఉదయం లేచి ఎవరి మొహం చూశానో ఏమిటో! ఏనాడూ పోలీస్టేషను మొహం కూడా చూడలేదు. ఆవిడెంత అబద్ధం చెబుతుందో చూశావా? అసలు బస్సెక్కినప్పటినుంచి బ్యాగు వళ్ళో పెట్టుకుని కూర్చోవటం చూశాను. అపుడు నాకంత అయిడియారాలేదు. డ్యూటీకొచ్చిన ప్పటినించి కుడికన్ను అదురుతోంది. నాకంతా అయోమయంగా ఉంది" అంటూ గొణుక్కుంటూనే స్టేషను చేరారు.

బ్రాందీసీసాలున్న బ్యాగు తనదేనని ఒప్పు కుందా స్త్రీ లేడీపోలీసులు నాలుగు దెబ్బలు వేసేవెయ్యకముందే ఒప్పేసుకుంది.

అరవింద, బాషా తేలిగ్గా ఊపిరి పీలుస్తూ బయటపడ్డారు.

అరవింద మాత్రం ఆ షాక్‌నించి చాలా రోజులు కోలుకోలేకపోయింది. కారణం ఆ వార్త న్యూస్‌పేపరుకెక్కటం!

"మధ్యపానం రవాణాలో లేడీకండక్టర్ హస్తం? " అంటూ హెడ్డింగ్ వేసి అరెస్టు, విడుదల అంటూ వివరించారు.

"ఇంత చిన్న విషయానికి అంతలా ఆలో చిస్తావేమిటి? ఇపుడేం కొంపమునిగిం దని? " మందలించింది లీల.

"పేపరుకు నాపేరు ఎక్కింది. ఇంతకన్నా అవమానం ఇంకేంకావాలి"

"నీవు నిర్దోషివని వివరించారు కదా!"

"లోపలి వివరణలు ఎవరు చదువుతారు! తాటికాయంత అక్షరాలతో మధ్యపానం రవాణాలో కండక్టర్ హస్తం అని వేశారు. చదువుతున్నవారి మనసులో ఎలాంటి సీన్ క్రియేట్ అయ్యుంటుందో తెలుసా? "

"అయితే అవుతుంది. ఏమిటట! ఇలాంటి విషయాలకే ఇలా క్రుంగిపోతే రాజకీయ నాయకుల సంగతేమిటి? ఇది చాలా చిన్న విషయం. ఇంకా మన ప్రయాణంలో ఎలాంటి ఆటుపోట్లుంటాయో, తట్టుకుని ధైర్యంగా సాగిపోవాలిగానీ అస్తమానం ఆలోచించకూడదు. ఓ రెండురోజులు సెలవు పడెయ్యి. వంట్లో నలతగా కూడా ఉన్నట్టుంది. రెస్టు తీసుకుంటే సరిపోతుంది" అంది లీల.

ఆ రోజు రాత్రికి అరవిందకు విపరీతంగా జ్వరం, పలవరింతలు! ముసలావిడ భయ పడిపోయి లీలను లేపుకొచ్చింది.

లీల అప్పటికప్పుడు ఆనందరావును తోడు తీసుకుని పక్కవీధిలోనున్న డాక్టరును బతిమిలాడి ఇంటికి తీసుకొచ్చి వైద్యంచేయిం చింది.

మరుసటిరోజు మధ్యాహ్నందాకా మగ తగా ఉండిపోయి, సాయంత్రానికి పూర్తిగా తేరుకుని కళ్ళు విప్పార్చి చూసింది.

ఎదురుగ్గా కరుణాకర్ కనిపించాడు పాప నెత్తుకుని.

అంతదాకా అక్కడే ఉన్న ముసలావిడ పాపను తీసుకుని బయటకు నడిచింది.

అరవింద దగ్గరకు నెమ్మదిగా నడచివ చ్చాడు కరుణాకర్. ఆమె చేతిని ప్రేమపూ ర్వకంగా తన చేతిలోనికి తీసుకున్నాడు. పశ్చాత్తాపం, బాధ, దుఃఖం, ప్రేమ కలగాపు లగమై కన్నీటి రూపం దాల్చింది.

కరుణాకర్ చేతిని ఓదార్పుగా, ప్రేమగా నొక్కింది అరవింద! కొత్తజీవితానికి నాంది పలుకుతున్నట్టు దూరంగా గుడిగంటలు మోగాయి.

★ ★ ★

ఆనందరావు, సరోజల నిశ్చితార్థం నిరా డంబరంగా జరిగిపోయింది.

రెండు నెలలు 'మూఢమి' ఉన్నందువల్ల, ఇపుడు నిశ్చితార్థం, రెండు నెలలతర్వాతే




పెళ్ళి అంటూ సీతమ్మగారు తేల్చేసి చెప్పి, ఆనందరావు తల్లితండ్రులను, సరోజ అక్కగారిని పిలిపించి జరిపించింది.

ఆనందరావు సంతోషానికి అవధుల్లేకుండాపోయాయి. సరోజతో ఒంటరిగా కూర్చుని కబుర్లు చెప్పాలనీ, భవిష్యత్తు గూర్చి కలలుకనాలని ఉవ్విళ్లూరుతున్నాడు. కానీ అతని ఆశలకు సీతమ్మగారు 'గండి'కొట్టారు.

"ఆ మూడుముళ్ళు పడేదాకా కాస్త ఓపిక పట్టరా! మరీ అంత విచ్చలవిడిగా తిరగటం మంచిదికాదు" అంటూ మనవడికి మొహాన్నే చెప్పేసింది.

నిశ్చితార్థం అంటే సగం పెళ్ళయిపోయినట్టేలెక్క! ముసలావిడ చాదస్తం! అని మనసులో కొట్టిపారేసుకుని "ఆ మాత్రం నాకు తెలీదా? ప్రత్యేకించి నువ్వు క్లాసుతీసుకోనక్కర్లేదు!" అంటూ విసుక్కున్నాడు.

సరోజ మాత్రం డిగ్నిఫైడ్‌గా మసలుకుంటోంది. ఆమెకూ మనసులో ఆనందరావుతో కబుర్లు, షికార్లు చెయ్యాలని ఉన్నా, బయటపడకుండా, అతనంటే పెద్ద ఇంట్రస్టులేనట్టూ, తన డ్యూటీలో నిమగ్నమైపోయినట్టు నటించసాగింది. అందులోనూ సరోజ అక్కగారు కూడా "ఆనందరావుతో అతిగా మాట్లాడటంకానీ, షికార్లు కానీ చెయ్యకు. ఈరోజుల్లో పీటలమీది పెళ్ళిళ్లే ఆగిపోతున్నాయి. ఏదైనా జరగకూడనిది జరిగితే ఎంత అప్రతిష్ట" అంటూ నీతిభోధ చేసింది.

ఆరోజు సరోజ డ్యూటీనించి సాయంత్రం ఆరుగంటలకు ఇల్లుచేరుకుంది. స్నానంచేసి లీల దగ్గరికెళ్ళి రావాలనుకుంటుండగానే ఆనందరావు వచ్చాడు. ఆ సమయానికి సరోజ అక్కగారు లేదు.

"అలా పార్కుకెడదాం రమ్మం"టూ సరోజను పార్కుకు ప్రయాణం చేశాడు.

పార్కులో సరోజ ఆనందరావు చతికిలబడ్డారు.

"వాతావరణం చాలా చల్లగా బాగుంది కదూ!" అన్నాడు ఆనందరావు.

"అవును" అంది సరోజ ఎటోచూస్తూ.

"ఏమిటంత ముభావంగా ఉన్నావు. ఇష్టంగా నాలుగుమాటలు మాట్లాడకూడదూ!" అన్నాడు ఆనందరావు.

"ఈరోజు డ్యూటీలో మా బస్సుకింద ఓ పంది పడి చచ్చిపోయింది" అంది సరోజ.

మొహం అసహ్యంగా పెట్టాడు ఆనందరావు. పిచ్చికోపమొచ్చిందతనికి.

"అలాగా! హాస్పిటల్‌కు తీసికెళ్ళి రక్తం ఎక్కించి, ఆక్సిజన్ పెట్టించారా?" అన్నాడు కోపం అణచుకుంటూ.

"అయ్యో! అంత వీలెక్కడిది. స్పాట్ డెడ్" అంది సీరియస్‌గా.

"చ్చొ చ్చొ పేపరులో వేయించారా?"

"బహుశ రేపు వేస్తారనుకుంటా!"

"వింటున్నాను కదాని వెధవని చేసి కబుర్లు చెబుతున్నావా? పంది చస్తే పేపర్లో వేస్తారా?" సహనం నశించి అనేశాడు ఆనందరావు.

"అదే మీతో వచ్చిన చిక్కు! పూర్తిగా చెప్పేవరకు వినరు కదా! పందికోసం రెండు వర్గాలు వారు 'పంది' మాదంటే మాదని పోట్లాడారు. డ్రయివరుతో గొడవపెట్టుకుంటారేమోనని భయపడ్డాం. డ్రయివరు సంగతి వదిలేసి రెండు వర్గాలు పోట్లాడి తలలు పగులగొట్టుకుని హాస్పిటల్ పాలయ్యారు. మేము మాత్రం చల్లగా జారుకుని వచ్చేశాము. డ్రయివరు గుండెలు ఇంకా గుబగుబలాడుతునే ఉన్నాయిట. ఏం, తంటా వస్తుందోనని, ఇంత జరిగితే పేపర్లో వెయ్యరా" అంది సరోజ.

"సర్లే! ఇష్టంగా నాలుగు మాటలు మాట్లాడమంటే పందుల వార్తలు చెప్పి మెదడు

ఖరాబుచేసేశావు గద"

"అయ్యో! మీకు ఆర్.టి.సి. అంటే ఇష్ట మని ఆవార్త చెప్పానే! అయితే ఎర్రబస్సు లన్నా, కండక్టర్లన్నా మీకిష్టం లేదు కదూ!" అంది.

"ఛ! ఛ! అలాంటిదేంలేదు. దానికీ దీనికీ లంకె పెట్టకు. పోనీ, ఆ టాపిక్ వదిలెయ్యి! ఏదైనా చిన్ననాటి కబుర్లు చెప్పు!'

"చిన్ననాటి కబుర్లా! చిన్ననాటి కబుర్లే ముంటాయబ్బా! చిన్నపుడు గౌన్లువేసుకుని చాక్లెటు తినేదాన్ని!" అంది నవ్వుతూ.

"చిన్ననాటి కబుర్లంటే అవేనా!"

"ఇంకేముంటాయి. పోనీ మీ చిన్ననాటి కబుర్లు నేను చెప్పనా? "

"నా చిన్ననాటి కబుర్లు నువ్వు చెబు తావా? " నీ మొహం అన్నట్టు చూసి, "చెప్పుచూద్దాం" అన్నాడు.

"మీరు చిన్నప్పుడు 'జాలిమ్‌లోషన్' వాడే వారటకదా! మీ బామ్మ చెప్పింది! నాకదంటే బలే అసహ్యంబాబూ!" అంటూ మొహం అదోలా పెట్టిన ఆనందరావువైపు చిద్విలా సంగా నవ్వుతూ చూసింది సరోజ!

★ ★ ★

"ఏమిటమ్మాయ్! ఇంత పెందరాళే లేచావు. కార్తీక స్నానం చేస్తున్నావా? " అడి గింది సీతమ్మ స్నానానికి వెళుతూ.

అపుడు టైం నాలుగున్నరయింది.

"కార్తీక స్నానం. మాఘస్నానం మాకెక్క డకుదురుతాయి బామ్మా! అవన్నీ మీలాంటి పెద్దవారికి వదిలేసి మేం డ్యూటీకి వెళు తున్నాం కదా! సత్యసాయిబాబా జన్మదినో త్సవ సందర్భంగా ప్రత్యేక బస్సులు నడుపు తున్నాం. డ్యూటీ, ధర్మవరం వేశారు. వెళు తున్నాను" అంది లీల.

"అలాగా! ప్రతిసారీ బాబా జన్మదినోత్సవా నికి వెళ్ళాలనుకుంటాను. ఆ సమయానికి ఏదో అడ్డంరావటం... ఆగిపోవటం. ఈ జన్మకు కుదురుతుందో లేదో" గొణు క్కుంటూ లోపలికెళ్ళిపోయింది సీతమ్మ.

ధర్మవరం రైల్వేస్టేషనునుంచి పుట్టపర్తికి వేసిన స్పెషల్ బస్సు, డ్యూటీకి వెళ్ళింది లీల.

బోలెడన్ని బస్సులు వేయటంతో ఎక్కువ రద్దీలేకుండా సీట్లమేరకే జనం బస్సు ఎక్కు తున్నారు. ప్రాణానికి హాయి అనిపించింది. సాయంత్రందాకా మూడు, నాలుగు ట్రిప్పులు నడిపినా అలసట అనిపించలేదు.

లాస్ట్ ట్రిప్పులో అంతా పి.జి.స్టూడెంట్సు ఎక్కారు. వాళ్ళను చూసేసరికి లీలకు ముందు కాస్త భయమనిపించింది. స్టూడెం ట్సుకు ఆడపిల్లలనేడిపించే ధోరణి ఎక్కువ. వాళ్ళలో చాలామంది తనకంటే ఎక్కువ వయసున్న వాళ్ళు కూడా ఉన్నారు. మొత్తం బస్సునిండా స్టూడెంట్సు. ఒకబ్బాయి ఠక్కున డోరువేసి "రైట్! రైట్!" అన్నాడు. గొంతు మారిందేమిటా అని డ్రయివరు వెనక్కి తిరిగి చూశాడు.

లీల కొంచెం కోపంగా చూసిందతనివైపు.

"డోర్‌వేసి రైట్ చెప్పుము" అని డోరు మీద రాశారు కదా డ్రయివర్ సాబ్! నేను చేసింది తప్పా" అన్నాడా అబ్బాయి అమా యకత నటిస్తూ!

డ్రయివరు నవ్వేశాడు. లీలకూ నవ్వొ చ్చింది. కానీ నవ్వలేదు.

"లీలమ్మా! వీళ్ళంతా మన ఊరి కాలేజి కుర్రోళ్ళే! మంచోళ్ళు! నువ్వేం కంగారుప డకు!" గట్టిగా అనేశాడు డ్రయివరు. స్టూడెంట్సు దగ్గర ఆ మాత్రం సమయ స్ఫూర్తి ప్రదర్శించకపోతే డేంజరు అన్న ట్టుంది అతని ధోరణి!

'నాకర్థమైందిలే' అన్నట్టు చిరునవ్వు నవ్వింది లీల!

"ఆహా! . ఏం నవ్వారండీ మోనాలిసా

లాగా!" అన్నారెవరో వెనుక సీటులోంచి అరిచినట్టు.

అందరూ నవ్వేశారు గలగలా!

లీల కూడా నవ్వకుండా ఉండలేకపోయింది. "థ్యాంక్స్! ఫర్ ది కాంప్లిమెంట్" అనేసింది గట్టిగా! ఒక్కొక్కరికి టికెట్లు ఇస్తూరాసాగింది. ఒకబ్బాయి చిల్లర అంతా గుప్పిటతో తీసి లీలకిచ్చాడు. అన్నీ ఇరవైపైసలు, పదిపైసల నాణాలున్నాయి. లీల అతనివేపు ప్రశ్నార్థకంగా చూసి లెక్కపెట్టుకోసాగింది.

"సారీ! కండక్టరుగారూ! 'కండక్టరుకు చిల్లర ఇచ్చి సహకరించండి' అని రాశారు గదండీ! అందుకనండి" అన్నాడు మెలికలు తిరుగుతూ.

లీల ఏం మాట్లాడకుండా టికెట్టుకు సరిపడా తీసికొని మిగతా చిల్లర ఇచ్చేసి ముందుకెళ్ళిపోయింది.

"అన్యాయం! అన్యాయం! డ్రయివరుగారూ! బస్సు ఆపండి" అన్నాడొకబ్బాయి. కంగారుగా బ్రేక్‌వేశాడు డ్రయివరు.

"ఏంటయ్యా" అన్నాడు.

"చేతులు బయటపెట్టరాదు" అని రాసి మీరు మాత్రం అయిదునిమిషాలకొకసారి చెయ్యి బయటపెడతారా? మీకొక, న్యాయం మాకొక న్యాయమూనా మేం సహించం" అన్నాడతను.

"స్త్రీలకు కేటాయించిన సీట్లో స్త్రీలే కూర్చోవాలి కదా! వీళ్ళంతా ఎందుక్కూర్చున్నారు. ఒకవేళ బస్సులో స్త్రీలు లేకపోతే మాత్రం సీట్లు ఖాళీగా ఉంచాలే తప్ప అలా కూర్చోవచ్చా! రేయ్! అరవండిరా! ఆర్.టి.సి. డౌన్! డౌన్!

ప్యాసింజర్ల న్యాయం! వర్ధిల్లాలి! వర్ధిల్లాలి!"

చెప్పేదొకటి! చేసేదొకటి! సహించం! సహించం!

రాసేదొకటి! చేసేదొకటి! భరించం! భరించం!"

అంటూ నినాదాలు చేశారు. దాదాపు అయిదు నిమిషాలు అలా అరిచారు. డ్రయివరు బస్సు మళ్ళీ స్టార్టు చేశాడు లీల అందరికీ టికెట్లిచ్చేసి వచ్చి తన సీట్లో కూర్చుంది.

"హే! డ్రయివరూ! ఇంత నిర్లక్ష్యమా? బహుదూరపు బాటసారీ! ఇటురావో ఒక్కసారీ" అంటూ పాటందుకున్నాడొకబ్బాయి.

"ఏమప్పా! బాబాదగ్గరికెళుతున్నారు కదా! శాంతంగా, మంచిగా, దైవనామస్మరణ చేస్తూపోవాలిగానీ, ఈ అల్లరేందప్పా" అన్నాడు డ్రయివరు.

"ఏమప్పా డ్రయివరప్పా! ఏమల్లరి చేసినామప్పా! ఏమన్నా మర్డరుచేస్తిమా? దోపిడీ చేస్తిమా? పాటలు పాడుకుంటే కూడా తప్పేనా అప్పా!"

"స్వామిని ధ్యానించుకోండప్పా!" మళ్ళీ డ్రయివరు అన్నాడు.

"పుట్టపర్తి రానీ యప్పా! ధ్యానించుకుంటాము. అంతవరకు ఇంతేనప్పా! నువ్వు బండి నిదానంగా తోలప్పా" అన్నాడొకబ్బాయి ఎగతాళిగా!

"ఏందోనప్పా! చదువుకుండే పిల్లలు ఇట్ల తయారయినారు" మెల్లిగా గొణుక్కున్నాడు డ్రయివరు! వాళ్ళతో మాట్లాడి జయించలేనన్నట్టు!

గట్టిగా చప్పట్లు కొడుతూ పాటలు పాడసాగారు. లీల మనసులోనే నవ్వుకుంటూ, తన స్టూడెంట్ లైఫ్‌ను గుర్తుకుతెచ్చుకుంది.

"ఎక్స్‌క్యూజ్‌మీ సిస్టర్" అన్న పిలుపు విని ఠక్కున పక్కకు తిరిగి చూసింది. లీల!

"మీకు పెళ్ళయ్యిందా?" అనడిగాడు ఆ అబ్బాయి.

"లేదు" అంది చిరునవ్వుతో.

"ఎందుకని? "

"ఇప్పుడవుతుంది"

"ఇప్పుడంటే ఎప్పుడు? ఎలా? "

"మీరంతా నాకు అన్నగార్లూ, తమ్ముళ్లూ! నా పెళ్ళి గురించి మీరంతా, ఇపుడు ఆలోచిస్తున్నారు కదా! త్వరలోనే మీరంతా కలిసి నాకో భర్తను వెతికి తెస్తే పెళ్ళయిపోతుంది ఏమంటారు? "

"యా! హుఠాc" అంటూ అరిచారంతా!

అప్పటినించి లీలను మాటల్లో దింపారంతా అల్లరిమానేసి!

"సిస్టర్! మీకీ ఉద్యోగం రిస్కనిపించటం లేదా? "

"ప్యాసింజర్ల బిహేవియర్ ను ఎలా తట్టుకోగలుగుతున్నారు? "

"ప్యాసింజర్లు అందరూ సంస్కారవంతులే ఉండరు కదా! సహకరించరు కదా? "

"మా ఊరి అమ్మాయి ఈ కండక్టరు పని చేయటంకంటే టవర్ క్లాక్ దగ్గర బజ్జీలు చేసి అమ్మటం బెటరంటూ రాజీనామా చేసేసింది"

"లేడీస్ సుకుమారులంటారు కదా! ఇన్ని గంటలసేపు బస్సు ప్రయాణం అలసట అనిపించటంలేదా? "

"మీరు ప్రయాణంచేస్తున్న బస్సు ఎప్పుడైనా దోపిడీకి గురయ్యిందా? "

"ఎప్పుడయినా యాక్సిడెంటయ్యిందా? "

"మీరెప్పుడయినా ఈ ఉద్యోగం వద్దు బాబోయ్ అని అనుకున్న రోజువచ్చిందా? "

"ఇంతకంటే మంచి ఉద్యోగం... అంటే ఏదైనా ఆఫీసులో ఫ్యాను కింద కూర్చుని సంతకాలు మాత్రం పెట్టే ఉద్యోగం వస్తే వెళ్ళిపోతారా? "



ఈ ఉద్యోగంలో అసంతృప్తి ఫీలవుతున్నారా? "

పత్రికా విలేఖర్లు అడిగినట్టు ఒక్కొక్కరు ఒక్కో ప్రశ్న వేశారు! చిరునవ్వుతో ఓపిగ్గా అందరికీ సమాధానం చెప్పింది లీల!

"మనం చేసే ఉద్యోగాన్ని మొదటగా గౌరవించటం నేర్చుకుంటే అసంతృప్తికి తావుండదు. కేవలం డబ్బు సంపాదించటానికే అయితే చాలా ఉద్యోగాలున్నాయి. కానీ, నాకవి ఇష్టం ఉండవు. స్త్రీలు చేసే అరుదైన ఉద్యోగాలలో కండక్టరుద్యోగం కూడా ఒకటి. నాకీ ఉద్యోగం, చాలా థ్రిల్లింగ్‌గా, ప్రతిప్రయాణమూ సమర్థవంతంగా ముగించానన్న తృప్తి, వెలకట్టలేనిది అంది క్లుప్తంగా ముగిస్తూ లీల!

పుట్టపర్తి వచ్చింది! అందరూ దిగిపోసాగారు. వెళుతూ వెళుతూ డ్రయివరును పట్టుకుని ఓ ఆట ఆడించి వెళ్ళారు.

"ఏమప్పా! డ్రయివరప్పా! యాడన్నా నదిలోకో, లోయలోకో పడేయకుండా క్షేమంగా చేరిస్తివి. థాంక్స్‌ప్పా"

"ఏరా! అలాగంటావు! మనడ్రయివరు చాలా మంచివాడు. ఎద్దుల బండికంటే నిదానంగా బస్సు తోలినాడు. ఇంకెలాగ, బస్సు పడిపోతుంది.

"వారుణి వాహిని ప్యాకెట్లు ఎన్నికొట్టి ఎక్కితివప్పా బస్సును"

"స్వామిని ధ్యానించుకోండని మాకు చెప్పితివి కదా! బస్టాపు రాగానే సిగరెట్టు ముట్టిస్తివి ఇదేం న్యాయమప్పా! స్వామిని ధ్యానించుకోప్పా!"అంటూ గలగల నవ్వుతూ మాట్లాడి వెళ్లొస్తాం సిస్టర్ అంటూ లీలతో చెప్పి దిగిపోయారు. బస్సు తిరిగి బయల్దేరింది. డ్యూటీ ముగించుకుని లీల ఇంటికి బయల్దేరింది. చాలారోజులతర్వాత ఈరోజు ప్రయాణం, చాలా ఆహ్లాదంగా జరిగింది అనుకుంటూ హుషారుగా ఇల్లుచేరింది.

ఇంకా గేట్లో అడుగుపెట్టీ పెట్టకముందే

కావేరి ఎదురొచ్చింది! "లీలా! మీ అమ్మగారి ఆరోగ్యం అస్సలు బాగాలేదు. హాస్పిటల్‌లో అడ్మిట్ చేశారు. మీనాన్నగారు వచ్చారు సీతమ్మగారు, మీ అమ్మకు తోడుకోసం హాస్పిటల్ కెళ్ళారు" అంది కంగారుగా.

అలాగా! అంటూ కోటు, బ్యాగు కావేరి చేతికిచ్చి ఆటో తీసుకుని హాస్పిటల్ కెళ్ళింది లీల!

★ ★ ★

"సారథిగారికి లీల వ్రాయు ఉత్తరం! మీ ఉత్తరం చేరింది.

నా మనసు చాలా భారంగా బాధగానూ ఉంది. కారణం మా అమ్మ నాకిక లేదు. అమ్మకి క్యాన్సర్! చివరిరోజుల్లో నాదగ్గరికొచ్చింది. ఎలా ఉండే మనిషి ఎలా అయిందని! పూచిక పుల్లలా తయారయ్యింది. మానసికంగా కూడా బాగా డల్ అయిపోయింది. పాపం! ఇంకో నెలరోజులకు చనిపోతుందనగా చీటికీమాటికీ నన్ను పట్టుకుని ఏడ్చేది.

"లీలా! నువ్వు పెళ్ళి చేసుకోవే! నేను చచ్చిపోయాక నీకడుపున పుడతాను" అనేది.

"ఆ ఉద్యోగం నువ్వు చెయ్యలేవు! ఏదైనా టీచరు ఉద్యోగమో, క్లర్కు ఉద్యోగమో చూసుకో! నీడ పట్టునుంటావు. ప్రాణానికి సుఖం ఉంటుంది" అనేది.

నేను పుట్టి బుద్ధెరిగినప్పటినించి నామీద అంతప్రేమ అమ్మ కళ్లల్లో చూడలేదు. అది సంతోషమో బాధో తెలియదు కానీ అమ్మను కావలించుకుని వలవల ఏడ్చాను. 'అమ్మను బ్రతికించుదేముడా' అని ప్రార్థించాను.

డాక్టర్లు "ఇక లాభంలేదు ఆవిడిక బతకదు ఇంటికి తీసికెళ్ళండి" అని చెప్పారు.

అపుడు అమ్మ ఏమందో తెలుసా సారథిగారూ!

నేనుంటున్న ఇంటికి ఆటో మాట్లాడ్డం చూసి "లీలా! ఇటునించి ఇటే ఊరెళ్ళిపోతానులేవే" అంది.

నాకూ చాలా ఆశ్చర్యమనిపించింది, కోపమూ వచ్చింది. ఇప్పుడా? అన్నాను ఈ స్థితిలోనా అన్న అర్థంవచ్చేలాగా!

"అవునే! అమ్మా! నేను ఏక్షణంలో చస్తానో తెలీదు నన్ను తీసికెళ్ళి, తమ్ముడింట దింపెయ్యి! చస్తే వాడేగాతలకొరివి పెట్టాలి! అదీగాక కూతురింట్లో చస్తే నరకానికి పోతారట. నీయింట్లో, వద్దులేవే!" అంది కళ్ళు మూస్తూ, తెరుస్తూ, మాట స్పష్టతకోల్పోయి... ఆయాస పడుతూ!

అవాక్కయిపోయాను నేను. అమ్మమీద కోపం రాలేదు. విపరీతమైన జాలికలిగింది. అసలు అమ్మమీద అనవసరంగా మొదటినుంచి ఓరకమైన ద్వేషం పెంచుకోవటం నా తప్పు అనిపించింది.

అవును మరి! ఆమె ఈ సమాజంలో సగటు స్త్రీ నేను బాధగానీ ద్వేషంకానీ, పగకానీ పెంచుకోవాల్సింది ఆమెమీద కాదు ఆడపిల్లను. అక్కడ పిల్లగా మగపిల్లవాడిని ఇక్కడి పిల్లాడుగా, ప్లస్, మైనస్‌ల పేర్లు పెట్టి... అబ్బా! ఆడపిల్లా? అని భయపడి భయపెట్టించే ఈ వ్యవస్థమీదే!

చివరి రోజుల్లో ఆమె కోరిక కాదనటం ఇష్టంలేక, ప్రయాణపు దిశమార్చి తమ్ముడింటి దగ్గరదిగాము.

కానీ మార్గమధ్యంలోనే అమ్మ చనిపోయింది. శవాన్ని తీసికెళ్ళటానికి రేటు ఎక్కువవుతుందని టాక్సీ వాడు గోలపెట్టాడు. తమ్ముడిని టాక్సీ బాడుగ గురించి డబ్బు అడిగాను. అక్కడే చచ్చిపోయింది కదా! ఇంత దూరం తీసుకురావటమెందుకు? ఇవన్నీ డబ్బు దండగకాదా? అన్నాడు వాడు.

అమ్మ వింటుందేమో... అమ్మ ఆత్మ వింటుందేమోనని భయపడ్డాను. బలవంతంగా మొక్కుబడి తీర్చినట్టు కార్యక్రమాలు







పూర్తిచేశాడు.

నాన్న పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు. జీవిత సహచరి! కష్టంలో, సుఖంలో పాలు పంచుకున్న భార్య చనిపోయి ఇకముందు తనకు జీవితమే లేదని పొగిలిపొగిలి ఏడుస్తున్నాడు!

"పెద్దకర్మ అయ్యాక ముసలాయన్ని బస్సెక్కిస్తాను. ఇకనించి నీ దగ్గరే అట్టిపెట్టుకో. నా దగ్గర వద్దు. ఈ ముసలాయన చాదస్తం నా పెళ్లాం భరించలేదు" అని నిష్కర్షగా చెప్పాడు.

నాన్న బాధపడతాడని ఊరుకున్నాను. లేకుంటే తల తిరిగిపోయేలా వాదించేదాన్నే. నాన్న లేని సమయం చూసి వాడితో ఓ మాటన్నాను. "అమ్మా, నాన్న కొడుకు, కొడుకు అని కలవరిస్తారు. ఇప్పుడు నాన్న నాకు బరువు కాదు. కానీ చివరిరోజుల్లో మళ్లీ నీ దగ్గరికే రావాలంటారు. అదేదో ఆయన్ని ఇప్పటినించే నీ దగ్గర పెట్టుకుంటే పుణ్యమూ, పురుషార్థమూ దక్కుతాయికదా" అన్నాను.

"పెద్ద తెలివిగలదానివనుకుని సెంటిమెంటుతో పడెయ్యాలని చూస్తున్నావా? నాన్నను నీ దగ్గరుంచుకోమంటున్నది నీ మేలుకోసమే. పెళ్ళీ పెటాకులు లేకుండా ఒంటరిగా పడున్నావుకదా. రోజులు బాగా లేవు. పెద్ద దిక్కుగా నాన్న నీ దగ్గరుంటే, నీకు సేఫ్టీగా ఉంటుందని. ఇక చివరిరోజుల్లోనంటావా? ఏం చేస్తాం! కొడుకై పుట్టాక బాధ్యత తప్పుతుందా? ఇప్పుడు అమ్మను తెచ్చినట్టే ఆయన్నీ తీసుకురా" అన్నాడు.

రక్తం మరిగిపోయింది నాకు. వాడితో మాట్లాడటమంత నీచత్వం ఇంకోటి లేదనిపించింది. వాడింట్లో మంచినీళ్లు కూడా తాగాలనిపించలేదు. ఆడపిల్లను కాబట్టి నేనింత సహించాను. నా స్థానంలో మగపిల్లవాడుంటే అన్నదమ్ముల మధ్య ఎంత






పోట్లాట జరిగేదో అనిపించింది. దినపత్రికల్లో "అన్నను చంపిన తమ్ముడు! తమ్ముణ్ణి చంపిన అన్న" అంటూ వార్తలు చదువుతుంటే... ఒక రక్తం పంచుకుపుట్టిన అన్నాదమ్ముల మధ్య ఇంత పెద్ద పోట్లాటలెందుకు వస్తాయా?" అనిపించేది. ఇంత దారుణమైన, స్వార్థపూరితమైన, మనస్తత్వాలుంటే ఎందుకు జరగవు అనిపించింది.

నాన్నను నాతో రమ్మని ప్రయాణం చేశాం. "వద్దులే అమ్మా! పెద్ద కర్మ అయ్యేదాకా ఇక్కడే ఉంటాను. మీ అమ్మ మెడలో గొలుసు, పుస్తెలు అమ్మితే ఎనిమిదివేల దాకా వస్తుంది. ఇంకో రెండువేలు నీవు సర్దు. కర్నాటకలో మంచి వృద్ధాశ్రమముందిట. పదివేలు కడితే చచ్చేదాకా అన్ని వసతులు వాళ్లే చూసుకుంటారుట. ఇంకెప్పుడూ నిన్ను డబ్బు అడగను. నేను ఎవ్వరికీ భారం కాదల్చుకోలేదు" అన్నాడు.

నాన్నను చూస్తే నాకు చాలా బాధనిపించింది. ఎంత అనుకున్నా జన్మనిచ్చిన తండ్రి! నేను ససేమిరా ఒప్పుకోలేదు. వృద్ధాశ్రమంలో దిక్కులేనివాడిలా ఒంటరిగా ఉండే ఖర్మ నీకేం పట్టింది. నా దగ్గరే ఉండు" అని బతిమిలాడాను.

ఎట్టి పరిస్థితుల్లోనూ ఉండనన్నాడు. ఆయన్ని వృద్ధాశ్రమానికి పంపటం నాకిష్టం లేక చివరికి ఆయన్ని బాధపెట్టే మాటలన్నాను.

"అన్ని బాధ్యతలు తీరినట్టు అలా వెళ్ళిపోతానంటావేమిటి? చెల్లెళ్ళకు, తమ్ముడికి పెళ్ళిళ్లు చేశావు. అన్నీ సమకూర్చావు. దేముడి దయవల్ల... నీవు చెప్పించిన చదువువల్ల ఉద్యోగం చేసుకుని బతుకుతున్నాను. తండ్రిగా నాకు పెళ్లి చేయాల్సిన బాధ్యత నీకు లేదా? నీ మట్టుకు నీవూ వెళ్ళిపోతే నా గతేంకాను. అసలు నేను మీకు పుట్టానా? లేదా? అన్న అనుమానం నాకు వస్తుంటుంది. ఇప్పుడు నా గురించి మర్చిపోయి వెళ్లిపోతుంటే అనుమానం నిజ

మౌతోంది" అన్నాను.

"నేనిప్పుడు అశక్తుణ్ణి తల్లీ! నీకు కట్నా లిచ్చి పెళ్లి చేసే స్తోమత నాకు లేదు. మగా డిలా ధైర్యంగా బతుకుతున్నావు. పెళ్లి కూడా అదే అవుతుంది. టైం రావాలి" అని దాటేయబోయాడు. నేనాయన మాటలు వినకుండా కూడా తీసుకొచ్చేశాను.

"వెళ్లు! వెళ్లు! అదేం తెలివితక్కువదీ కాదు. అమాయకురాలూ కాదు. అమ్మ గొలుసు కోసం ప్లాన్ వేసింది. అదీగాక నెలానెలా పెన్షనూ కొట్టేయచ్చని నంగనాచి కబుర్లు చెబుతోంది. లేకుంటే దానికి పెళ్లెం దుకు? ఈపాటికి మెడలో తాళి తప్ప అన్నీ అయిపోయి ఉంటాయి" అన్నాడు.

"ఒక తమ్ముడు అక్కను అనే మాట లేనా? నా కడుపున చెడబుట్టావు" అంటూ నాన్న బూతులందుకున్నాడు.

పరిస్థితి శృతిమించి బజారుకెక్కకముందే గడపదాటి వచ్చేశాను నాన్నతో సహా!

"నాకు పెళ్ళి చెయ్యి" అని ఏ కూతురూ నాన్నను నిలదీసి అడిగిఉండదు. పెళ్లి గురించి తాపత్రయపడుతున్నట్టు నాన్న దగ్గర మాట్లాడకపోతే నాన్న ఒంటరిగా వెళ్లి పోతాడన్న భయంతో మాట్లాడాను. కానీ నాన్న నా మాటలను మరిచిపోలేదు. పైగా అలా నిలదీసి అడిగినందుకు అవమానం గానూ, సిగ్గుగానూ కూడా ఫీలయినట్టు న్నాడు. ఏమాటకామాటే చెప్పుకోవాలి. నాన్న మారిపోయాడు. నా విషయంలో తనవల్ల నాకేదో అన్యాయం జరిగిపోయి నట్టు, ఆడపిల్లల్ని బాధపెట్టామనీ, వాళ్ల ఉసురువల్లే తన భార్య చనిపోయిందనీ, కొడుకు నిరాదరణ... ఇలా అన్నీ నేను లేన ప్పుడు సీతమ్మగారితో ఏకరువు పెట్టుకుని బాధపడేవాడుట.

నెలలోపలే ఓ సంబంధం పట్టుకొచ్చి, పెళ్లిచూపులకేర్పాటు చేసేశాడు. పెళ్లిచూ పులు అనగానే మీ పెళ్లిచూపులు గుర్తుకు వస్తున్నాయా? సారధిగారూ!

టెన్షన్, ఆత్రుత, బాధ, భయం, నిరీక్ష ణలు లేకుండా ఈ దేశంలో ఏ ఆడపిల్ల పెళ్లిచూపులూ జరిగిఉండవేమో!

అబ్బాయి గ్రాడ్యుయేట్! ఉద్యోగం లేదు. ఫరవాలేదనిపించే అందం! స్వంత ఇల్లు లేదు. పెళ్లికావల్సిన చెల్లి ఉంది. తల్లిదండ్రు లున్నారు. ఇవీ వివరాలు వచ్చి చూసి వెళ్లారు.

కట్నం ఒకటిన్నర లక్ష కావాలిట. అలాగ యితే త్వరలోనే ముహూర్తాలు పెట్టుకుం టారుట.

నాన్న అగ్గిమీద గుగ్గిలమై ఎగిరాడు. మా అమ్మాయి ఉద్యోగం చేసి డబ్బు సంపాది స్తోంది. అయినా కూడా అంత కట్నం ఇవ్వ టానికి బాకీనా? " అంటూ.

మా దగ్గర కట్నం తీసుకుని వాళ్ల చెల్లికి కట్నమిచ్చి పెళ్లి చేయాలిట. మా కట్నం తోనే అబ్బాయి అయితే బిజినెస్‌కూ లేకుంటే ఉద్యోగానికి లంచం ఇచ్చుకుని సెటిల్ అవుతాడుట.

ఇంతేసి కట్నమా? అంటే కండ క్టరుద్యోగం చేస్తున్న అమ్మాయిని ఉదారబు ద్ధితో పెళ్లి చేసుకుంటున్నాడు కాబట్టే లక్ష న్నర కట్నమట. వేరే ఆఫీసులోనో, టీచరు గానో అయ్యుంటే ఆ రేటు కాస్త తక్కువగా ఉండేదిట. అన్నట్టు నెలనెలా నేను సంపా దించే నా జీతం మొత్తం బ్యాంకులోవేసి సంవత్సరం తిరిగేలోగా ఇల్లు కట్టాలిట. అందులో చిల్లిగవ్వ కూడా నా తండ్రికిగానీ, మరే ఇతర కారణాలకుగానీ వాడరాదుట.

సారధిగారూ! ఇదండీ ఈ దేశపు మధ్య తరగతి ఆడపిల్ల పెళ్లిభాగోతం!

"కేవలం మగపుట్టుకే లక్షల కట్నానికి క్వాలిఫికేషన్" అంటూ నాన్న తిట్టిపోశాడు.

నాన్నను సముదాయించాను.

"టైం వస్తే పెళ్లి అదే అవుతుందని నీవే అన్నావుకదా! ఊరికే హైరానపడకు" అంటూ మందలించాను.

నా దగ్గర సరేనన్నా, తను చేసే ప్రయత్నాలు మాత్రం తను చేస్తూనే వున్నాడు.

అన్నట్టు మీ పెళ్లి ప్రయత్నాలెంతవరకు వచ్చాయి?

మీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ లీల."



సరోజ పెళ్ళి దగ్గరపడింది.

లగ్నపత్రిక వ్రాసుకున్నాక ఆనందరావు, సరోజ కలిసి వెళ్లి అందమైన పెళ్లిపత్రికలు అచ్చువేయించారు. పెళ్ళి ఇంక పదిరోజులే ఉంది. అరవింద, కావేరి, సరోజ, లీల కలిసి కూర్చుని శుభలేఖలకు పసుపుకుంకుమ రాసి అడ్రసులు రాస్తున్నారు. సరోజను ఆటపట్టిస్తూ నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అన్నెం పున్నెం ఎరుగని అమాయకుడిని బుట్టలో పడేసుకుంటివికదా! ఆనందరావు లాంటి మంచివాడు భర్తగా దొరకాలంటే, పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుండాలి సుమా" అంది కావేరి.

"పెళ్లవగానే వేరుకాపురం పెడతావా? పాపం సీతమ్మగారు నీమీద బోలెడు ఆశలు పెట్టుకుంది" అరవింద అందుకుంది.

"ఆశలా? అదేంటి? " సరోజ ఆశ్చర్యంగా అడిగింది.

"కానీ కట్నం లేకుండా మనవడిని వల్లో వేసుకున్నావుకదా! పెళ్లవగానే అత్తగారి లెవెల్లో సూర్యకాంతం 'ఇన్‌చార్జి'లా ప్రవర్తించాలనీ, నిన్ను రాసి రంపాన పెట్టాలని ఆశ!" అంది అరవింద ఉడికిస్తూ.

"చాల్లే ఊరుకో! పాపం ముసలావిడ ఉసురెందుకు పోసుకుంటావు"

"మీ అత్తగారిలా రాకాసి కాదులే" అంది సరోజ.

"మా అత్తగారినేమన్నా అన్నావంటే చంపేస్తా" ఉడుక్కుంది అరవింద.

"చూశావా లీలా! దీనికెంత పొగరో! మంచి అత్త దొరికివుంటే అసలు భూమి మీదే నడిచేది కాదు సుమా!" అంది సరోజ.

"అబ్బబ్బ! ముసలివాళ్ల కబుర్లు ఆపండర్రా. లీలా! ఇంతకీ నీ పెళ్లెప్పుడే! అన్నట్టు కలం స్నేహం అంటూ ఉత్తరాలు రాస్తుంటాడే ఆ రథసారథి, అతన్నే పెళ్లి చేసుకుంటేపోలా? " అంది కావేరి! టాపిక్ మార్చేస్తూ!

"అవునే! అయిడియా బాగుంది. ఈపాటికి అతన్ని నీవూ, నిన్ను అతడు బాగా అర్థం చేసుకుని ఉంటారుకదా!" అంది అరవింద.

"మొన్నీమధ్య ఓ సినిమాలో చూశా! ఇలాగే కొన్నాళ్లు ఉత్తరాలు రాసుకుని ఆ తర్వాత కష్టపడి కలుసుకుని పెళ్లి చేసుకుంటారు. అతన్నోసారి మన ఊరు రమ్మని చెప్పు!" అంది సరోజ. తను చూసిన సినిమాను గుర్తు తెచ్చుకుంటూ.

"సినిమాల్లో కాబట్టి అందంగా ఉంటారు. ఒకవేళ ఇతను ఏ ముసలివాడో, అవిటివాడో అయివుంటే? " అనుమానం వ్యక్తం చేసింది కావేరి.

"ముందు అతని ఫొటో పంపమని రాసెయ్యి!" సరోజ అంది.

"కాసేపు అందరూ ఊరుకుంటారా? సరోజా! నిన్న డ్యూటీలో, సినిమాలో హీరో యిన్‌లాగా రెచ్చిపోయావట. ఏమిటి విశేషం?" అంటూ టాపిక్ మళ్ళించింది లీల.

"అంతా తెలిసే ఉంటుందికదా! మళ్ళీ ఎందుకు అడగటం?" అంది సరోజ.

"నాకు కొంతే తెలుసు. అదీ టూకీగా! నీవైతే చక్కగా దృశ్యం అంతా కనిపించేలా చెబుతావు చెప్పు. అందరూ విని తరిస్తారు" నవ్వుతూ అంది లీల.

"ఏమిటీ! ఆర్.టి.సి. బస్సులో హీరోయిన్ పోర్షనా? ఏం జరిగింది చెప్పవా?" కావేరి తొందర చేసింది.

సీతమ్మ, ఆనందరావు కూడా వచ్చి చేరి పోయారు.

అందరివైపు ఓసారి చూసి ఊరించి ఊరించి నిదానంగా, నిజంగానే దృశ్యం కళ్లకు కనిపించేలా చెప్పసాగింది సరోజ. నవ్వుతూ వినసాగారందరూ.

"అప్పుడే ఫ్రెష్‌గా తయారయి, కాఫీ తాగి పెళ్లికూతురులాంటి కొత్తబస్సు ఎక్కాను. బస్సునిండా జనం. అందులో సగంమంది స్త్రీలు. పెళ్ళిళ్ల సీజనేమో పట్టుచీరల రెపరెపలు. మల్లెపూల గుబాళింపులు. సూట్‌కేసుల మోతలు, గాజుల గలగలలు, పిల్లల కిలకిలలు... ఆడవాళ్లకి టికెట్లు ఇస్తూ ఇస్తూనే వాళ్లు కట్టుకున్న పట్టుచీరలను ఓ కంట గమనించసాగాను.

"పడ్డాయా పట్టుచీరమీద కళ్లు" వింటున్న శ్రోతలలో ఓ గొంతు వెటకారంగా అంది.

"చేస్తున్నది మగరాయుడిలాంటి ఉద్యోగమైనా కళ్లు మాత్రం ఆడకళ్లేకదా! పుట్టుకతో వచ్చిన కళ్లు..."

"చీరలమీదేనా? నగలమీద కూడా కళ్లు పడుండాలే" అనుమానం వ్యక్తం చేసింది మరో శ్రోత.

"ఇంతకూ ఏం చేశావ్! వాళ్లు కట్టుకున్న చీరల్లాంటివీ, నగలూ, నీ పెళ్లికి సెలక్టు చేసుకున్నావా?"

"అమ్మో! చీరల సెలక్షన్‌లోపడి టికెట్లు సరిగా కొట్టినట్టు లేదు. ఏ స్క్వాడో రైడింగు... మన హీరోయిన్ డైలాగులు... వాళ్లు బోల్తా. కథ సుఖాంతం... బస్సు షెడ్డుకి... హీరోయిన్ ఇంటికి... అంతేనా?" గబగబ అనేశాడు ఆనందరావు.

"ఆహా! ఏమి ఊహ! కథ రాసి అమెరికా పత్రిక్కి పంపండి. ప్రయిజు వస్తుంది. అందరూ కాసేపు ఊరుకుంటారా? కట్టెయ్యమంటారా?"

"అయ్యో! అంతపని చెయ్యకు! సినిమాకెళదామంటే టైమయిపోయింది. టి.వి. కూడా రిపేరుండి చానల్స్ సరిగా రావటం లేదు. పొద్దుగడవటం లేదు. చెప్పు చెప్పు" ఆనందరావు అంటుండగానే అతనివైపు గుర్రుగా చూసి మళ్ళీ మొదలుపెట్టింది.

"సరే! ఎక్కడ ఆపాను. పట్టుచీరల దగ్గర కదా! టికెట్లు ఇస్తుండగానే "ఏమమ్మగారూ ఈ బస్సులో డ్యూటీ చేస్తుండారా?" అన్న పలకరింపు మాటలు విని ఠక్కున తిరిగి చూశాను. మా పనిమనిషికి స్వయానా అక్క. ఎప్పుడైనా తన చెల్లి నాగా పెడితే తను వచ్చి పనిచేసేది. పేరు గంగమ్మ. బాగా వాగుడుకాయ. ఏ వార్తాపత్రిక, రేడియో, అందివ్వలేని వార్తలన్నీ తెల్లారగట్టే అందించేస్తుంది.

"ఏంటి గంగమ్మా! ఎక్కడికి ప్రయాణం?" అన్నాను. అంతే! అందుకుంది.

"ఈవిడగారు మా యజమానులండి. ఆళ్లమ్మాయి పెళ్లయిపోనాది. అల్లదిగో పెళ్లికూతురు. బాగుందికదండి. ముప్పయి తులాలబంగారం, లక్ష రూపాయల కట్న

మండి. అల్లుడుగారు ఇంజనీరండి. నెలకు పదివేలు జీతమండి. ఎర్రగా సినిమా యాక్టరు సుమన్‌లాగుంటడండి. చీరలు, సారెలతో అమ్మాయిని దిగబెట్టి రావటానికి ఎలుతున్నారండి. నన్నూ తీసికెళుతున్నారండి. ఇదిగో ఈ చీర మా అమ్మగారే కొనిచ్చారండి" అంటూ తను కట్టుకున్న చీర చూపిస్తూ అలా వాగుతూనే ఉంది.

నేను ఊం కొడుతూ నా పని నేను చేసుకుంటున్నాను.

ఇంతలో ఆమె కాళ్ల దగ్గర పెట్టుకున్న స్టీలు డబ్బా మూత లూజయిందేమో ఠప్పున శబ్దం చేస్తూ ఊడింది.

ఏమిటా శబ్దం అని తలతిప్పి చూశాను. అందులో ఎర్రగా కారంపొడి కనిపించింది. విచిత్రం కాకపోతే కారంపొడి కూడా చీర సారెలతో పాటు పంపాలా?

నా మనసు గ్రహించినట్టు గంగమ్మ వెంటనే "అమ్మగారికి అమ్మాయిగారంటే ప్రాణమండి. అత్తారింట్లో దేనికీ కష్టపడకూడదని అన్నీ పంపిస్తున్నారండి." అంటూ నాతో ముగించి, వాళ్ల యజమానురాలితో నా గురించి, మా అక్క గురించి ఆపకుండా చెబుతోంది. మేము ఏ కూరలు తింటామో, ఏ కూరలు తినమో మొదలుకొని, డ్యూటీల గురించి, నిద్ర గురించి కూడా చెబుతోంది.

దాన్ని ఆపడం నా తరం కాదు. వెళ్లి నా సీట్లో కూర్చున్నాను. కాసేపటికి గంగమ్మ నోరు మూసింది.

ఇంతలో బస్సు టైరు పంచరయింది.

'బాప్‌రే!' అనుకుంటూ చుట్టూ చూశాను. చుట్టూ దట్టమైన పొదలు కనుచూపు మేరలో మనిషి అలికిడి లేదు. డ్రయివరు దిగివచ్చి టైరు మార్చాడు. ప్యాసింజర్లు అతనికి సహాయం చేశారు.

ఆ సమయంలోనే ఓ ఇద్దరు మగవాళ్లు... వాళ్లు చాలా శుభ్రంగా, మంచి గుడ్డలేసుకుని, చెరగని క్రాపుతో మంచి హోదాగల ఆఫీసర్లలాగా ఉన్నారు. తాము పక్కనున్న పల్లెకు పనిమీద వచ్చామనీ, ఇది స్టేజి కానందున ఏ బస్సూ ఆపటంలేదనీ, స్టేజిదాకా వెళ్ళాలంటే నడిచివెళ్ళాలనీ, ప్రాధేయపడుతున్నట్టు మాట్లాడి బస్సు ఎక్కారు. వారికీ టికెట్లిచ్చేసి కూర్చున్నాను.

బస్సు బయల్దేరింది. కనుచీకటి పడుతోంది. దాదాపు రెండు కిలోమీటర్లు పొడవు రోడ్డుకిరువైపులా ముళ్లపొదల మధ్య ప్రయాణం, కంపచెట్లు కొమ్మలు బస్సు కిటికీలకు తగిలేంత దగ్గరగా ఉంటాయి. ఆ కాసేపు ప్రతిరోజూ చిరాకే!

నా ఆలోచనల్లో నేనుండగానే, ఇందాక బస్సెక్కిన ఇద్దరు పెద్ద మనుషులూ ఆడవాళ్ల సీట్ల దగ్గరకొచ్చి నిలబడి, పిడిబాకులు చెరోటి పైకితీసి చేతుల్లో పట్టుకున్నారు. సంగతి అర్థమయిపోయింది. ఆడవాళ్ళంతా ఒకటే కేకలు. డ్రయివరును బండి ఆపమన్నారు.

"అరిచారంటే పొడిచేస్తాం! నగలన్నీ ఒలిచి ఇటియ్యండి" అనేసి బిక్కచచ్చిపోయిన మగాళ్లవైపు చూస్తూ, "ఏందిరా అట్ల సూస్తుండారు. వాచీలు, ఉంగరాలు, జేబులో డబ్బు తీసియ్యండి" అంటూ ఒకడు మగాళ్లవైపు వెళ్లాడు. నాకు, డ్రయివరుకు కాళ్లు, చేతులు ఆడలేదు. ఆడవాళ్లు ఏడుస్తూ నగలు తీసే కార్యక్రమంలో ఉన్నారు.

నేను ఒకసారి ఇద్దరి దొంగలవైపు పరికించి చూశాను. ఒకడు బస్సు చివర్లో మగాళ్ల దగ్గర, మరొకడు డోరుకు దగ్గర్లో ఆడవాళ్ల సీట్ల దగ్గరుండి బెదిరిస్తున్నారు. ఏదయితే అదయిందని "గంగమ్మా! నీ దగ్గరున్న కారంపొడి వాడి మొహాన కొట్టు" అంటూ గట్టిగా అరిచాను.

స్టీలుడబ్బా తీసిన శబ్దం అయింది అంతే! ఆడవాళ్ల సీట్ల దగ్గరున్న దొంగ... కారంపొడి అనగానే భయపడి డోరు తీసుకుని

పారిపోబోయాడు. ఆ పారిపోవటంలో చేతి లోనున్న బాకు కిందపడింది. డ్రయివరు పరిగెత్తినట్టు వచ్చి వాడిని ఒడిసిపట్టుకున్నాడు. ఇంకో ఇద్దరు ప్యాసింజర్లు... అదీ ఆడవాళ్లే డ్రయివరుకు సాయంగా వాడిని కదలకుండా పట్టుకున్నారు. వాడు బూతులు తిడుతున్నాడు. వెనుకసీట్ల దగ్గరున్న దొంగ ఇది చూసి కాస్త గాబరాపడి అంతలోనే తేరుకుని "రేయ్ వాడిని వదలండి. లేకుంటే పొడుస్తా" అంటూ ప్యాసింజరునొకతన్ని ఒడిసి పట్టుకుని బెదిరించాడు.

"ఇంతలో నేను గంగమ్మ దగ్గరున్న కారంపొడి గుప్పెట్లో పట్టుకుని, "వాడిని బాకు కిందపడెయ్యమని చెప్పు. లేకుంటే నీ కళ్లల్లో కారం కొడతా"నంటూ మా దగ్గరున్న దొంగను బెదిరించాను.

నా చేతిలో కారం చూసేసరికి భయపడిపోయాడు. "రేయ్ రంగా బాకుపడెయ్యిరా!" అని గట్టిగా కేకపెట్టాడు.

"పడేత్తావా కారం కొట్టాల్నా! నా కొడకా" అంటూ గంగమ్మ కూడా ఓ గుప్పెడు కారం తీసుకుని వాడి ముందుకు పోయింది.

"పొడిస్తే ఒక్కన్ని పొడుస్తావంతేకదా! పొడుసు నీ కండ్లు ఉడికిపోవాల" అంటూ ముందు ముందుకు పోయింది. వాడు వెంటనే బాకు కిందకు పడేశాడు. దబదబమని బాదుతూ ప్యాసింజర్లు వాడిని చావగొట్టారు. ఇద్దరినీ తీసికెళ్లి పోలీసులకప్పగించాం" అంటూ ముగించింది సరోజ.

"కారంపొడి ఆలోచన బాగా రక్షించింది కదా!" కావేరి అంది.

"మరే! లేకపోతే పెళ్లికూతురు దగ్గరున్న బంగారం, నా దగ్గరున్న డబ్బు హుష్‌కాకి అయ్యేది"

"ఈసారి ఆగస్టు పదిహేనుకు రాష్ట్రపతి అవార్డు ఇస్తారేమో" ఆనందరావు ప్రశంసగా చూస్తూ అన్నాడు.

"ఇకనించి దూరప్రయాణాలప్పుడు కాస్త కారంపొడి తీసికెడతాను బాబూ! మా అన్నయ్యగారి ఊరెళ్లేటప్పుడు ఘాట్‌రోడ్లో మరీ భయంగా ఉంటుంది. ఆ రూట్లో ఎప్పుడూ బస్సుదోపిడీలే" అంది సీతమ్మ.

"అవునవును. నేనూ అలాగే చేస్తాను" అంది కావేరి.

"ఈరోజంతా కారంపొడి కబుర్లేనా? కడుపుకేమయినా పెట్టేదుందా? " అంటూ కందస్వామి ప్రవేశించటంతో అందరూ నవ్వుతూ తలోదారి వెళ్లారు.

"రాత్రినించి నలతగా ఉందన్నావు ఈరోజు డ్యూటీకి వెళ్లకపోతేనేం. సెలవు పెట్టకూడదా అమ్మా"! అన్నాడు లీల తండ్రి డ్యూటీకి బయిల్దేరుతున్న కూతురి నొసట చేయిపెట్టి జ్వరం ఉందేమోనన్నట్టు చూస్తూ!

"ఇపుడు బాగానే ఉందిలే నాన్నా అనవసరంగా సెలవెందుకు"! అంటూ బయిల్దేరింది లీల.

గడపదాటుతుండగానే కావేరి ఇంట్లోంచి కందస్వామి తమ్ముడు, నారాయణస్వామి వస్తూ కనిపించాడు.

"బావున్నారా? ఎప్పుడొచ్చారు? ఏమిటిలా చిక్కిపోయారు? ఒంట్లో బాగా లేదా? సుమతిగారూ పిల్లలూ కూడా వచ్చారా? " అతనిమీద పశ్నలపరంపరలు కురిపించింది లీల.

నారాయణస్వామి కూడా ఆర్.టి.సి. కండక్టరు కావటంతో కావేరి ఇంటికి అతనువచ్చినపుడల్లా తనే కలుపుగోరుగా మాట్లాడటం, ఉద్యోగంలోని సాధకబాధకాలు చర్చించుకోవటం చేస్తుండేది. ఈ మధ్య చాలా రోజులుగా అతను రాలేదు. మనిషి బాగా చిక్కిపోయాడు. గెడ్డం పెంచుకుని జ్వరం పడిలేచిన వాడిలా ఉన్నాడు.

"ఆ, ఏంలేదు. కాస్త ఆరోగ్యం బాగాలేదంతే! మీ ఉద్యోగం ఎలాఉంది". అంటూ పరామర్శించాడు నారాయణస్వామి.

"ఆ అమ్మాయి ఉద్యోగానికేం నిక్షేపంలాఉంది. నీలాగా తెలివితక్కువపనులు చేసుకుని ఉద్యోగం ఊడగొట్టుకుని ఊళ్ళమ్మట తిరుగుతుందనుకున్నావా" అంటూ గట్టిగా అరచినట్టు మాట్లాడుతూ బయిటకొచ్చాడు కందస్వామి.

"ఆ! ఏమిటి ఉద్యోగం పోయిందా? ఎలా? ఎప్పుడు? " ఆశ్చర్యం, బాధ, ఆందోళన మిళితమైన స్వరంతో ప్రశ్నించింది లీల.

"మనుషులతో సౌమ్యంగా మాట్లాడటం అర్థం చేసుకోవటం మీకు రాదుకదా! అతని బాధలో అతనుంటే స్వంత అన్నగారై ఉండి అలాగేనా మాట్లాడటం"? అంది కావేరి నీళ్ళబిందె లోపలికి తీసుకుపోతూ. కందస్వామి కోపంగా గేటుదాటి వెళ్ళిపోయాడు.

"అసలేం జరిగింది"! రెట్టిస్తూఅడిగింది లీల.

"ఏమయితే ఏంలెండి! నాటైంబాగాలేదు" అంటూ చెప్పటం ప్రారంభించాడు. "ఆరోజు మామూలుగా డ్యూటీకెళ్లాను. మైలుదూరానికి నాలుగుచోట్ల స్టాపింగులంటూ మా ప్రాణాలు తీస్తారు ఆ ఊరివాళ్లు. ఆవూరి నిండా ఫ్యాక్షనిష్టులు. ఒకడిమీద ఒకడు పోటీ! ఒకడు బస్సు ఆపించుకుని దర్జాగా దిగీ దిగకముందే, వాడిమీద పోటీగా ఇంకొకడు బస్సు ఆపమంటాడు. డ్రయివరు, కండక్టర్ల సహనం చచ్చిపోతుంది.

"ఓరోజు కోపమొచ్చి ఇరువర్గాలవారిలో ఒకరికి కోరుకున్నచోట ఆపాను. ఇంకొకరికి ఆపనన్నాను. గొడవపెట్టుకున్నాడు. పోట్లాడిదిగిపోయాడు.

"మరో వారంతర్వాత ఆవూరిలో జాతర జరుగుతోండగా బస్సు క్రిక్కిరిసి ఉంది. బస్సు ఆపి మరీ టిక్కెట్లిచ్చాను. ఎలా మిస్సయ్యానో ఓ స్త్రీకి మాత్రం టిక్కెట్టు ఇవ్వలేదు. ఇంకా స్టేజిరాకముందే స్క్వాడ్ వచ్చింది. అందరినీ తనిఖీచేశారు. అందరూ టిక్కెట్లు చూపించారు. ఆస్త్రీమాత్రం "నా దగ్గర టిక్కెట్టు లేదండయ్యా. కండక్టరు నాతో డబ్బులైతే తీసేసుకున్నాడు కానీ టిక్కెట్టియ్యలేదు. ఇస్తాడుకదాని ఎదురుచూస్తున్నా" అనేసింది.

"అంతే!

"ఎటువంటి విచారణ లేకుండా, కేవలం ఓ ప్యాసింజరు మాటను ప్రామాణికంగా తీసికొని నన్ను సస్పెండు చేశారు.

ఆతర్వాత ఓవారం రోజులకు నాతో గొడవపెట్టుకున్న ఫ్యాక్షనిష్టు "ఏం మంచి శాస్తి జరిగిందా! చేతులకు మట్టి అంటుకోకుండా నిన్నెలా పడగొట్టానో చూశావా? లేకుంటే నాప్రత్యర్థి వర్గంలో చేరిపోయి వాడు చెప్పినచోట బస్సాపి... నేను చెప్పిన చోట బస్సాపవా? ఇపుడు పొగరణిగిందా? " అంటూ గేలి చేసి వెళ్ళిపోయాడు.

మొత్తం ఆర్.టి.సి. అంతా డ్రయివరు కండక్టర్ల మీదనే ఆధారపడి నడుస్తోంది. కానీ అటు అధికారులకుగానీ, ఇటు జనాలకుగానీ కండక్టర్లు, డ్రయివర్ల మీద సదభిప్రాయంలేదు. అది మన దురదృష్టం." అంటూ ముగించాడు నారాయణస్వామి.

"అయితే మీరిపుడేంచేస్తున్నారు? " అంది లీల.

" ఏంచేస్తాను. కేసు కోర్టులో నడుస్తోంది. అది, వాయిదాలు గడచి మళ్లీ నాకుద్యోగం రావాలంటే కనీసం అయిదారేళ్లు పట్టొచ్చు అంతవరకు భార్యాపిల్లలతోసహా పస్తులుండలేం కదా! నేనొక ప్రయివేటు కంపెనీలో తక్కువ జీతానికి చేరాను. నాభార్యకూడా కాన్వెంటులో చేరింది. మా ఇద్దరి జీతాలు జీవితాలకు సరిపడటంలేదు. డబ్బు సహాయం కోసం అదీ అప్పుగానే, అన్నయ్య

దగ్గరకొచ్చాను. ఎంతలోకువైపోయానో చూశారా!" అన్నాడు నారాయణస్వామి గొంతు పూడుకుపోతున్నట్టు.

"బాధపడకండి! మీ అన్నయ్యే కదా! లోకువ చేసి మాట్లాడుతున్నాడని ఎందుక నుకుంటున్నారు. తమ్ముడన్న చనువుతో, మందలింపుగా మాట్లాడినదాన్ని మీరు సీరియస్‌గా తీసుకుంటారెందుకు!" అంది లీల.

"ఏమిటయ్యా! మీ అన్నయ్య స్వభావం తెలిసి కూడా బాధపడతావెందుకు? ఏదో గబుక్కున నోటికొచ్చింది వాగేస్తారు తప్ప ఏదో మనసులో ఉంచుకుని సాధించి బాధ పెట్టే మనస్తత్వంకాదు. రాత్రి నించీ నీఉద్యోగం గురించి ఆయన బాధపడుతూనే ఉన్నారు. నీకోసం డబ్బు తేవడానికిపుడు బ్యాంకుకు కూడా వెళ్లారు" అంటూ భర్తను మంచిచేస్తూ మాట్లాడింది కావేరి.

"మళ్లీ ఉద్యోగం రావటానికి అయిదారేళ్లు పడుతుందా? " అంది లీల.

విరక్తిగా నవ్వుతూ "అదృష్టం బాగుండి ఆర్.టి.సి. సొమ్ము తినాలని ఉంటే అయిదారేళ్లకయినా వస్తుంది. లేకుంటే అసలు రాకపోవచ్చు చాలా మందికి నా ఎరికలో సస్పెండయిన వారికి మళ్లీ ఉద్యోగాలు రాలేదుకూడా" అన్నాడు నారాయణస్వామి.

చాలా బాధనిపించింది లీలకు. మౌనంగా అలా కూర్చుండిపోయింది కావేరి ఇంటి ముందున్న అరుగుమీద.

"అదేమిటమ్మాయ్! డ్యూటీకి టైం అవుతోంది అలాకూర్చుండిపోయావు". అంటూ సీతమ్మ ప్రవేశించింది. ఉలిక్కిపడి టైంచూసుకుని "వస్తానండి"! అంటూ బయల్దేరింది.

బస్టాండుకెళ్లి బస్సెక్కేదాకా లీల అన్యమనస్కంగానేఉంది. "ఏమిటి లీలమ్మా ఈరోజు డల్‌గా ఉన్నావు? " అని పలకరించాడు ఆరోజు డ్యూటీలో ఉన్న డ్రయివరు.

బస్సు బయల్దేరటానికి ఇంకా పదినిమిషాలు టైం వుండటంతో బస్టాండులో ఉన్న టీస్టాల్ ముందునించుని టీ త్రాగుతున్నారిద్దరూ. "ఏమిటోనన్నా ఈరోజు నామూడం తాపాడయిపోయింది" అంటూ నారాయణ స్వామి ఉదంతమంతా చెప్పేసింది.

"అంతేనమ్మా! డ్రయివర్లు, కండక్టర్ల జీవితాలు కత్తిమీద సాములాంటివి. ఏరోజు కారోజు ఎంతో అప్రమత్తతతో ఉంటే తప్ప ప్రయాణం, సజావుగాసాగదు. ఇవన్నీ మామూలే. వాళ్లను గురించి, వీళ్లనుగురించి ఆలోచిస్తుంటే మన మెదడుచెడిపోతుంది. టైమయిపోతోంది పద! పద!" అంటూ డ్రయివరు లీలను తొందరచేసి బస్సు దగ్గరికి వచ్చేసారు.

బస్సు ఫుల్‌గా ఉంది. దార్లో అడ్డంగా లగేజిమూటలు, పెరుగుగిన్నెలున్న గంపలు, పాలక్యాన్లు, నిండిపోయి అడుగు తీసి అడుగు పెట్టడానికి వీల్లేకుండా ఉంది.

లీల అవస్థపడుతూ అందర్నీ దాటుకుంటూ ఒక్కొక్కరిని పిలిచి టిక్కెట్లివ్వసాగింది.

బస్సువెనకాల చివరిసీట్లో ఓ ముస్లిం యువతి నిండా నల్లటి బురఖా వేసుకుంది. రెండుసీట్లకు సరిపడా స్థలం ఆక్రమించుకుంది. ఎంతలావుగా ఉందో అనుకుంటూ ఆమెకూ టిక్కెట్టు ఇచ్చింది.

దార్లో ఓమూటమీద ఓ ముసలమ్మ కూర్చుని ఉంది. దాదాపు డబ్బయి సంవత్సరాల ముగ్గుబుట్ట. "అవ్వా! టిక్కెట్టు తీసుకో. ఏ ఊరికెళ్లాలి? " అంటూ ఆమెను తట్టి అడిగింది. ఓ సారి తలెత్తి పాతాళంలో గులకరాళ్లలాంటి కళ్లతో చూసి "తీసుకుంటానమ్మాతల్లీ. తీసుకోకుంటే ఊరుకుంటారా. మీ బస్సుల్లో మా యట్ల ముసలోల్లను ఊరికే బస్సు ఎక్కించుకోకూడదా" అంటూ బొడ్లో దోపుకున్న సంచితీసింది. దానికి నాలుగు అరలు కుట్టారు. ఒక దాంట్లోఆకులు, మరో దాంట్లో వక్కలు,

ఇంకోదాంట్లో పొగాకు దేనికవే విడివిడిగా ఉన్నాయి. డబ్బులకోసం ప్రత్యేకంగా కుట్టిన ఓ అరలో ముసలమ్మ చెయ్యిపెట్టింది. మళ్లీ తలెత్తి లీలవైపుచూసి "ఏమమ్మాయ్యా టిక్కెట్టు తీసుకొనే తీరాల్నా!" అంది.

"అవునవ్వా! తీసికోకుంటే నీకు అయిదు వందల రూపాయలు జరిమానా వేస్తారు." అంది లీల ఆమె డబ్బు తీసే సంచివేపు, చెయ్యివైపు ఆత్రంగా చూస్తూ.

"ఏందీ! జుల్మానా? నాకా? " బోసినోరు వెళ్లబెట్టి పకపక నవ్వింది. "నాకు జుల్మానా ఏస్తే వాడు సచ్చినాడే అనుకో!" అంది.

"ఏం ఎందుకు? "

"ఎందుకేమి అమ్మాయ్యా. నాదగ్గర ఈడ్చి తంతే పదిరూపాయలు లేదు. అయిదొందలు ఎట్టసాదిస్తడు. సావగొడ్తామంటే సెర్మం దప్ప కండ లేదాయె. వానికోపమూ తీరదు. డబ్బులూ రావు" అంటూమళ్లీ నవ్వింది అవ్వ.

"సర్లే! డబ్బులుతియ్యి" అసహనంగా అంది లీల. ఆకు సంచిలోంచి ఓ ప్లాస్టిక్ ఉండతీసింది. దాన్ని విప్పింది. అందులో మరో ఉండ, మరో ఉండ. నాలుగు ప్లాస్టిక్ పేపర్ల ఉండయ్యాక, చివర్లో తీసింది డబ్బు! అది ఎంతోకాదు. ఓ అయిదు రూపాయల నోటు, ఆనోటు తప్ప ఇంకో అయిదుపైసలు కూడా ఎక్కువలేదు. లీలకు మొట్టమొదటి సారిగా వళ్లుమండే కోపంవచ్చింది. స్టేజి దగ్గరకు వచ్చింది. ఇంకా టిక్కెట్లు ఇవ్వవలసి ఉంది. ముసలమ్మదగ్గరే టైం అంతా అయిపోయేట్టుంది. "ఈ అయిదు రూపాయలు తియ్యటానికి ఇంతసేపా? ఇదేదో వజ్రం అయినట్టు అంత భద్రంగా దాచిపెట్టినావు" అంటూ లాక్కున్నట్టు తీసికొని రెండున్నర రూపాయలు ముసలమ్మకిచ్చింది కోపంగా.

"నీకేంతల్లీ ఎన్నయినా అంటావు. నీ పేనానికి అది అయిదురూపాయలు. నాపేనానికదివజ్రమే. వారందినాలనుండి జొరం వత్తాంది. దర్మాసుపత్రికి పోతానంటే సతాయిచ్చి సతాయిచ్చి వజ్రమట్ల నాకొడుకు ఇయ్యాల ఈ అయిదు రూపాయలిచ్చిండు. వచ్చేకి పొయ్యేకి చార్జి. ఇది, గనక పోగొట్టుకుంటే నాసావు దేవునికెరుక" అంది ముసలమ్మ లీల ఇచ్చిన చిల్లర భద్రపరచుకుంటూ. లీల మనసు ద్రవించిపోయింది. ముసలమ్మను కసిరి మాట్లాడినందుకు తనమీదతనకే అసహ్యం వేసింది.

"అయ్యో! నొచ్చుకోకవ్వా! నువ్వింతనిదానంగ డబ్బు తీస్తుంటేనాకు టైం లేదని విసుక్కున్నానంతే! నీ మనవరాలు నిన్ను కసిరిచ్చి ముద్దుగా మాట్లాడదా? నేనూ అంతే!'' అంది ముసలమ్మను ప్రసన్నం చేసుకుంటూ.

"అయ్యో! నాతల్లీ! నువ్వు కసిరిస్తే నేనెందుకు నొచ్చుకుంటాను. కొడుకులతో దెబ్బలే తింటి గదా!" అంటూ ఇంకా ఏదో గొణుక్కుంటున్నముసలమ్మను జాలిగాచూసి అక్కడినుంచి కదిలింది లీల!

అందరికీ టిక్కెట్లివ్వటం పూర్తిచేసి తన సీటువైపు వెళుతుండగానే బస్సు స్లో అయింది. 'ఇక్కడేం స్టేజిలేదు ఎందుకు ఆగిందా' అనుకుని బయటకు చూసింది లీల!

స్క్వాడ్ ఆపింది.

"స్క్వాడ్ వచ్చింది!" బస్సులో గుసగుసలు... కొంతమంది గట్టిగానూ మాట్లాడుకోసాగారు. చివరి సీట్లో కూర్చున్న ముస్లిం యువతి"కండక్టరమ్మా జల్దీరా" అంటూ గట్టిగా పిలిచింది.

ఏమిటన్నట్టు లీల ఆమెవైపు చూసింది.

"నేను ఇంకా టిక్కెట్టు కొనలే, బేగివచ్చి టిక్కెట్టియ్యి"! అనటంతో పరిగెట్టినట్టు జనాన్ని నెట్టుకుంటూ వెళ్లి ఆమెవద్దకు చేరుకుని టిక్కెట్టిచ్చింది లీల.

"పిల్లదానికి టిక్కెట్టు ఎందుక్కొనాల అంటూ బురఖాలో దాచిందమ్మా. పిల్లది ఎంత సేపని ఊపిరాడకుండా బురఖాలో ఉంటది. అదీకాక దానికి వాంతులవుతు న్నాయి. స్క్వాడ్ వస్తుందని జనం అనుకుం టున్నారు. మేమిచ్చే రెండురూపాయల టిక్కెట్టుకోసం, నీ ఉద్యోగమెందుకు పోవాల, ఆపాపం మనకెందుకు, అని ఇందాకట్నించి సెప్పుతుంటే, ఇదిగో ఇప్పటికి ఇనింది నామాట". అంటూ ఆ ముస్లిం యువతి భర్తవివరిస్తుండగానే స్క్వాడ్ లోపలికి ప్రవే శించి తనిఖీ ప్రారంభించింది.

రెండు నిమిషాల్లో తన జీవితమే తిరగబ డిపోయేదిగదా అని లీలకు అదంతా కలలో జరిగినట్టుగా అనిపించింది.

స్క్వాడ్ వెళ్లిపోయాక ఈ సంఘటన గురించిబస్సంతా ప్రాకిపోయింది. ప్రయాణీ కులు ఆ ముస్లిం యువతిని నిందించారు. డ్రయివరు కల్పించుకుని, ఆ యువతిని, ఆమెభర్తను ఉద్దేశించి "మా జీవితా లతోఆడుకుందామనుకుంటిరా! ఇంతకంటె గడ్డి తినకూడదా" అంటూ ఆవేశంగా తిట్టాడు.

లీల అతన్ని వారించింది. వారివల్ల తనకిప్పుడు చెడు జరగలేదుకదా అని స్టేజి రాగానే బస్సు దిగి వెళుతున్న ఆ యువతిని, ఆమె భర్తను కృతజ్ఞతగా చూసింది లీల!

"మనుషుల్లో ఇంకా మంచితనం, మాన వత్వం మిగిలి ఉండబట్టే వర్షాలు కురుస్తు న్నాయి". అని ఎప్పుడో చిన్నప్పుడు నానమ్మ అన్నమాటలు గుర్తుకు వచ్చాయి లీలకు!

★ ★ ★

"లీలగారికి సారధి వ్రాయునది.

నాఉత్తరం చూడగానే "ఈ మహానుభా వుడు ఈసారి ఏ పెళ్లిచూపులకెళ్లాడో, ఏం సాధించాడో, అని మనసులో అనుకుంటూ ఉత్తరం విప్పుతారు కదూ!

"అరె! నామనసులో అనుకున్నది మీకెలా వినబడింది! అందులోనూ ఇన్ని వందల మైళ్ల దూరానికి" అనుకుంటున్నారా?

ఆరునెలలు సావాసం చేస్తే వారు వీరవు తారట!

ఒక బెంచీలో కూర్చుని చదివి, ఓ కంచంలో తిని, చెట్టాపట్టాలేసుకుని... ఇలా చేస్తేనే సావాసం" అనిపించుకుంటుంది అంటారా?

అదేంకాదు! ఆరోజులు పోయాయి. ఉత్త రాలద్వారా మనసులు విప్పుకుంటే కూడా, స్నేహం అవుతుంది, అయింది కూడాను.

సరే అసలు విషయానికొద్దాం! నా పెళ్లి చూపుల హంగామా జరుగుతూనే ఉంది. ఈమధ్య నేను అయిదు కేజీల బరువెక్కా నండోయ్! పెళ్లికుదరలేదని దిగులుతో తగ్గాలి కానీ, ఎక్కటమేంటని విస్తుపోతు న్నారా? పెళ్లిచూపుల పేరుతో వెళ్లినచోటల్లా స్వీట్సు తినీ, తినీ, బరువెక్కానన్నమాట.

పెళ్లి చూపులకు వెళ్లి వెళ్లి చివరికి పెళ్లం టేనే విరక్తి కలుగుతోంది. పెళ్లి జీవితానికి అంత అవసరమా? పెళ్లి లేకుండా జీవి తాంతం ఒంటరిగా బ్రతకలేమా? అని నన్ను నేను ప్రశ్నించుకుంటుంటాను. నాలాంటివారి ప్రశ్నలకు జవాబులు చాలా మంది పెద్దవారు, రచయితలు, కవులు వ్రాసిన ఉపోద్ఘాతాలు, వ్యాసాలు, సంపు టాలుగా వెలువడి నోరుమూయిస్తున్నాయ నుకోండి! అసలు పెళ్లి చేసుకున్నవారు ఎవరు సుఖపడ్డారు? పెళ్లి అయినప్పటి నించి ఏవో గొడవలు, మనస్పర్ధలు, అపా ర్థాలు, అసూయలు... తన్నుకోడాలు... విడా కులు... లేదూ... రాజీపడి... పిల్లలకో సమో... సమాజం కోసమో... పెద్దవాళ్లకో సమో... అనుక్షణం ఆత్మవంచన చేసు కుంటూ, రాజీపడిపోయి... ఏరోజు కారోజు గడిచిపోయిందంటూ నిట్టూర్చి, బ్రతికె య్యటం. ఈమాత్రం దానికి పెళ్లెందుకు?




అప్పుడప్పుడు నాలో పెళ్లిమీద ఈ వికారం తలెత్తటానికి కారణం మా అమ్మా నాన్నలే కావచ్చు అనిపిస్తుంటుంది.

నా గురించి... అంటే నా చిన్నతనం గురించి చిన్నతనపు ఊహలగురించి చెబితే మీరు నవ్వుతారేమో...

అందరిలా కాకుండా...నన్నందరూ ప్రత్యేకంగా గుర్తించాలన్న తపనతో...కాస్త వెరైటీగా ఉండాలనుకునేవాడిని, నేను.

అదేమిటో నా ఊహ తెలిసినప్పటి నుంచి...నా భావాలమీద నీళ్లు చల్లే వారే కానీ...ప్రోత్సహించేవారు లేరు.

నేను టెన్త్‌క్లాసు చదువుతున్న రోజుల్లో ఓ వారపత్రికలో అచ్చయిన ఓ కథ నన్ను బాగా స్పందింపచేసింది. అందులో ఒకాయనఉద్యోగరీత్యా భార్యకు దూరంగా వేరే ఊళ్లో ఉంటూ, పిల్లలగురించివిశేషాలడుగుతూ, భార్యకు వ్రాసిన ఉత్తరం నన్ను చాలా ఆకట్టుకుంది. ఊరికే ఆకట్టుకోవటం కాదు కన్నీరు తెప్పించింది. దాన్ని ఊరికే చదివి వదిలెయ్యకుండా నానోట్సులో వ్రాసి పెట్టుకున్నాను. అంతే! అదిచూసి అదేదో ప్రేమలేఖ అయినట్టూ, నేనో గ్రంథం నడుపుతున్నట్టూ, నానా హంగామా చేసేసి టీచరుదాకా...చివరికి అమ్మానాన్నలదాకా... తీసుకెళ్లారు నా తో స్టూడెంట్లు. తర్వాత తిట్లు...దెబ్బలు..చివరికి పుస్తకాలు చదవటం మానేశాను. కరాటే నేర్చుకుంటానని అమ్మానాన్నలను బ్రతిమిలాడాను. వద్దు ఎముకలు విరిగితే పుత్తూరు కెళ్లాలి అన్నాడు నాన్న.

చదువయ్యాక మిలిటరీ కెళతానన్నాను. ఉన్నది ఒక్కకొడుకువి. అంత దూరం వెళితే మాకు తలకొరివి ఎవరు పెడతారు అంటూ ఏడ్చింది అమ్మ.

పక్క జిల్లాలో ప్రయివేటు కంపెనీలో మూడు వేలరూపాయల జీతానికి పనిచేస్తానంటే వద్దని...ముప్పయివేలు లంచమిచ్చి ఉన్న ఊళ్లో రెండు వేలరూపాయల గుమస్తాగిరిలో కూర్చోబెట్టాడు నాన్న!నేను నిమిత్తమాత్రుడిని! నిర్ణయాలన్నీ వాళ్లవే! ఎప్పటికప్పుడు తల్లిదండ్రులు... తల్లిదండ్రులు... అనుకుంటూ శ్రీరామచంద్రుడి పాఠాలు వల్లె వేసుకుంటూ రోజులు గడిపేస్తున్నాను. కానీ ఈ మధ్య నా పెళ్లి విషయం వచ్చేసరికి... నాలో ఏదో తెగింపు లాంటిది వస్తోంది. కనీసం పెళ్లి విషయంలోనైనా నా అభిప్రాయానికి విలువ ఇవ్వరా? అంటూ అమ్మా నాన్నలతో పెద్దగా పోట్లాడాను. ఇంట్లోంచి వెళ్లిపోతానన్నాను. పాపం అమ్మ చాలా బాధపడింది. నాన్న కూడా బాధపడే ఉంటారు. కానీ బయటపడడు. సరే! పెళ్లి విషయంలో నిర్ణయం నీకే వదిలేస్తున్నాము. ఏ సినిమాల్లాగానో మాకు చెప్పకుండా మాత్రం చేసుకోకు. నీవెలాంటి అమ్మాయిని చేసుకున్నా మాకభ్యంతరం లేదు! పెళ్లిమాత్రం మా ఆధ్వర్యాన జరగాలన్నారు. మీకో సంతోషకరమైన వార్త చెప్పమంటారా నాపెళ్లి...నేను చేసిన గలాటా కారణంగా ఎన్నేళ్లుగానో మాట్లాడుకోని అమ్మానాన్న రాజీకొచ్చేసారు. ఇంతవరకు ఓ.కే. నేను చేసుకోవాలనుకున్న అమ్మాయి...నాభార్య...వెరైటీగా... అభిప్రాయాలకు తగినట్లుగా...అసలు నాపెళ్లే... ఓ వెరైటీగా ఉండాలని నాకోరిక. మనసువిప్పి మీముందు ంచుతున్నాను. నవ్వుకోరుగా? ...ఉంటాను. నా పెళ్లివిషయంలో మీసలహా కోరుతూ...సారధి."

★ ★ ★

"సారధిగారికి లీల వ్రాయు ఉత్తరం!

మీ ఉత్తరం చేరింది. సరోజ, ఆనందరావుల పెళ్లి నిరాడంబరంగా జరిగిపోయింది. చాలా రోజులుగా వాళ్లిద్దరూ ప్రేమికులు. ఇపుడు పెళ్లిచేసుకుని ముచ్చటయిన జంటయ్యారు.

ఇకపోతే మీపెళ్లి గురించి నా సలహా అడిగారు.

ఏమండోయ్! మీకు నేను పెళ్లిళ్ల పేరమ్మ లాగా కనిపిస్తున్నానా ఏమిటి? మీ పెళ్లిగురించి మీకు తెలీదా?

వెరైటీగా ఉండాలనుకుంటున్నారుకదా! ఆ వెరయిటీ, ఏదో ఇతరుల మెప్పుకోసమో, నలుగురిలో గుర్తింపు కాంక్షతోనో కాకుండా, అటు చేసుకున్నవారికీ, మీకూ, తృప్తిగానూ, నలుగురికీ ఆదర్శప్రాయంగానూ ఉండేలా పెళ్లి చేసుకోండి! ఇంతకంటే మీ పెళ్లిగురించి నేనేం చెప్పలేను.

పోతే సరోజ పెళ్లయ్యాక, నాకూ ఓ తోడుంటే...అంటే పెళ్లయితే బావుండునని పించింది. చిత్రంగా ఇన్నేళ్లుగా కలలోకూడా పెళ్లితలంపురాని నాకు మిత్రురాలి పెళ్లయి పోగానే నేనొక్కదాన్నే ఒంటరిని అన్న ఆలోచన మరీ మరీ రాసాగింది. నామనసు గ్రహించినట్టు నాన్నగారు కూడా సంబంధాలకోసం ముమ్మరంగా ప్రయత్నాలు చేస్తున్నారు. బహుశ నాపెళ్లి త్వరలోనే జరగచ్చు ఇకపోతే మీరు మనసువిప్పి చెప్పినట్టే... నేనూ...మనసు విప్పి మీతో ఓ విషయం చెప్పాలనుకుంటున్నాను. అదేమిటంటే...మీతో కలం స్నేహం చేస్తున్నట్టు నా స్నేహితులకు తెలుసు. వాళ్లంతా ఏమంటున్నారో తెలుసా! అదేదో సినిమాలోలాగా కలం స్నేహితుణ్ణే పెళ్లి చేసుకో! అతన్ని ఇక్కడికి రప్పించు. అంటూ సలహాలిస్తున్నారు.

వాళ్లకెవ్వరికీ నేను సమాధానం చెప్పలేదు. ఎప్పటికైనా మీరు కూడా వాళ్ల లాగా... "ఇన్నేళ్లు ఒకరిమనసు ఒకరు అర్థం చేసుకున్నాం. భార్యాభర్తలమవటానికి ఇంతకంటే క్వాలిఫికేషను ఏముంటుంది" అని అంటారేమోనని... ముందుగానే వ్రాస్తున్నాను... క్షమించండి! మీరలా వ్రాయకపోతే అది నా అదృష్టం!

"ఇన్నాళ్లు స్నేహంచేశారు. నన్నర్థం చేసుకున్నదింతేనా? " అని మీరు నిష్ఠూరంగా వ్రాస్తేనే, నేనెక్కువ సంతోషిస్తాను. ఎందుకంటే... పెళ్లిచేసుకోవటానికి... మీకు సమస్య లేకున్నా, నాకు...ఇప్పుడు కాకపోతే...ఇంకొన్నాళ్లకి... ఓ మనిషి ఖచ్చితంగా దొరుకుతాడు. మీరన్నట్టు...రాజీపడిపోయి, తన్నుకుంటూనో, కీచులాడుకుంటూనో జీవితం వెళ్లబారుస్తాము. కానీ జీవితాంతం మనసు విప్పి చెప్పుకోవటానికి, ఓ స్నేహితురాలుకానీ, స్నేహితుడుకానీ ప్రతివారికీ ఉండాలి. పెళ్లిచేసుకోటానికి ఎవరైనా దొరుకుతారు. కానీ ఆత్మీయతను పంచుకొనేమనసున్న మనిషి దొరకటం అరుదు.

నా అదృష్టం కొద్దీ నాకు మీరు లభించారు. నాకు మిమ్మల్ని చూడాలని లేదు. మీఅందంతో నాకు పనిలేదు. మీతో మాట్లాడాలన్నకోరికాలేదు. మీ ఉత్తరాలతో...జీవితాంతం ఊరటచెందుతూఉండాలనీ... మనసువిప్పి అన్నీ చెప్పుకోవాలనీ మాత్రం ఉంది. ఎప్పుడైనా, ఎన్నేళ్లకయినామీతో నా స్నేహాన్ని కూడా అర్థం చేసుకుని మరీ గౌరవించే వ్యక్తి మాత్రమే నాకు భర్తగా నా జీవితంలో ప్రవేశిస్తాడు. వీడ్కోలులేని ఈ ఉత్తరాలకు ముగింపుఉండకూడదని ఆశిస్తూ.
లీల. "

ఉత్తరం వ్రాసి...అడ్రసు వ్రాసి...ప్రక్కవీధిలోనున్నపోస్టుడబ్బాలో ఉత్తరం పడేసిఇంటికి వచ్చింది. లీల.

ఓ వారంరోజుల తర్వాత... "ఇదిగో లీలమ్మా! నీకు ఉత్తరం వచ్చింది. కలం స్నేహితుడేనా? ఉత్తరం చాలా బరువుంది సుమా! అది చదువుతూ డ్యూటీ సంగతి మరిచేవు! మునక్కాడ చారు కాస్తున్నా! నాన్నగారికిస్తాగాని రాత్రికి తిను" అంటున్న కావేరిని చిరునవ్వుతో చూస్తూ ఉత్తరం అందుకుంది లీల.

కావేరిలాంటి మంచి మనసున్న స్నేహితులు దొరకటం వరం,అదృష్టం! తను




వీళ్ళందరికీ ఎంతగా రుణపడిపోతుందో... అనుకుంటూ కవరు చించబోయి అంతలో వాచీచూసుకుని, ఆగిపోయింది లీల. టైంద గ్గరవుతోందనుకుంటూ, ఉత్తరం బ్యాగులో పెట్టి, బ్యాగ్ భుజానికి తగిలించుకుని, డ్యూటీకి బయలుదేరింది. గుమ్మందాటు తుండగా తండ్రి పలకరించాడు.

"ఖమ్మంనించి పెళ్లిచూపులకు రేపు వస్తామని కబురుపంపారమ్మా! సెలవు పెడతావుకదూ"!

"సెలవెందుకు? రేపు నాకు వీక్ ఆఫ్ కదా!"

"అయితే మరీమంచిది. ఈసారయినా పెళ్లి కుదిరితే షిరిడి వస్తానని మొక్కుకున్నానమ్మా" అంటున్న తండ్రిని జాలిగా చూసింది లీల!

"వాళ్లు కట్నం వద్దు అమ్మాయి నచ్చితే చాలన్నారు. అబ్బాయిది బ్యాంకు ఉద్యోగం. స్వంత ఇల్లు. ఆస్థి అదీ కాస్త ఉన్నవాళ్ళే నట. ఈసంబంధం కుదిరితే నీకంటే అదృష్టవంతురాలుండదు". అంటున్న తండ్రిమాటలు పూర్తికాకముందే "వెళ్ళొస్తానాన్నా" అంటూ బయటపడింది.

బస్టాండు చేరేదాకా తనపెళ్ళికోసం నాన్న తాపత్రయం గురించి ఆలోచిస్తూనే ఉంది. తల్లిదండ్రులు పిల్లల్ని గురించిన ఆలోచనల బారినుంచి బయటపడి జీవితంలో విశ్రాంతి తీసుకునేదంటూ అసలు ఉండదేమో! అనిపించింది. బస్స్టాండ్ వద్ద బూత్‌లో డ్యూటీ రిపోర్ట్ ఇచ్చి, తతంగం పూర్తిచేసుకుని, టిక్కెట్లు, బ్యాగ్ సర్దుకుంది. బస్‌కోసం ఎదురుచూస్తుండగా, తన బ్యాగ్‌లోని ఉత్తరం గుర్తొచ్చి తీసింది.

బస్‌రావటం, జనం బస్‌మీదికి దూకటం, కుస్తీపట్లు, సర్దుకోవటం, అన్నీ అయేసరికి టైం పడుతుందనుకుంటూ కవరులోంచి ఉత్తరం తీసి చదవసాగింది.

"లీలగారికి సారధి వ్రాయునది.

"మాయింట్లో మూడవప్రపంచయుద్ధం జరుగుతోందండోయ్!

ఎందుకని అడగరేం!

అందుకు రెండుకారణాలున్నాయండోయ్. మొట్టమొదట కారణం మీరే!

"నేనా"? అంటూ భయంతో నోరువెళ్లబెట్టారా

"అవును అక్షరాలా మీరే! ఆమధ్య సెలవు పెట్టేసి, నా ఫ్రెండ్సు వెంట తిరుపతి వెళ్లానులెండి. ఆ టైంలో మీరు వ్రాసిన ఉత్తరం... మా అమ్మానాన్నల చేతిలో పడింది. ప్రాయంవచ్చిన కొడుకులకు వచ్చిన ఉత్తరాలు చదవటంలో మాత్రం, సభ్యత సంస్కారాలు ప్రదర్శిస్తే పెంపక లోపమవుతుందనుకున్నారేమో ఆసాంతం చదివేశారు. నేనువచ్చేసరికి ప్రశ్నలనే తూటాలతో రెడీగా ఉన్నారు.

"ఏమిట్రా ఆ ఉత్తరం? "

"ఎవరా అమ్మాయి"?

"ప్రేమిస్తున్నావా? "

"ఎన్నిరోజులనించి జరుగుతోందీ భాగవతం"?

"పెద్దవాళ్లం చచ్చామనుకున్నావా"?

"వేరే ఊళ్ళో ఆ అమ్మాయితో తంతు నడుపుతూనే, నంగనాచిలా పెళ్లిచూపులకు హాజరవుతున్నావట్రా"?

"తెలుగు సినిమాలోలాగా ఇద్దర్నీ పెళ్లిచేసుకుని పాటలు పాడదామనుకున్నావా వెధవా"? అంటూ ప్రారంభించారు.

"అమ్మో! నేను ఇక్కడ రాసినవి మచ్చుకి కొన్నిమాత్రమే. ఒక్క గంటలో నాతల వాచిపోయేలా తిట్టారు. వాళ్లకు నచ్చచెప్పేసరికి, తలప్రాణం, కాళ్లకొచ్చిందనుకోండి.

సరే! వాళ్ల సంగతలా వదిలెయ్యండి! మీకో విషయం చెప్పాలి!

"అది మన స్నేహం, దాని భవిష్యత్తు గురించి!

"అమ్మా, నాన్నా చాలా గొడవపడ్డారని రాశానుగదా! చూడండి,

"లీలగారూ,

మీ రూపాన్ని, వ్యక్తిత్వాన్ని నేనెంత ఉన్నతంగా నాలో ప్రతిష్టించుకున్నానంటే, అదేదో భ్రమ... అని తేలికగా తీసిపారేయకండి.

"కేవలం ఊహించుకోవటంకాదు, చాలా కాలంగా మిమ్మల్ని స్వయంగా చూస్తూనే ఉన్నాను. ఆశ్చర్యపడకండి. మీతో కలిసి మీకు తెలీకుండానే ఎన్నోసార్లు మీబస్సులో ప్రయాణం చేశాను. మీ చేతిలోంచి టిక్కెట్లెన్నిసార్లు అందుకున్నానో! నా చేతిలోంచి మీరెన్నిసార్లు డబ్బందుకుని బ్యాగ్‌లో వేసుకున్నారో!

"కాని, నేను ఫలానా అని మీకు తెలియదుగదా!

"అవును! మీగురించి నాకు బాగానే తెలుసు. అందుకే ఉన్నతంగా... ఊహించటం! కాదు, గ్రహించాను. నా హృదయంలో మీకున్న ఉన్నతపీఠం మీకే శాశ్వతం కావాలని నాకోరిక. మనది కేవలం కలంస్నేహంగానే మిగిలిపోగూడదు. అది చాలా అన్యాయం.

"జీవిత భాగస్వామితోకూడా పంచుకోలేనంత సన్నిహితంగా నాభావాల్నింత కాలం మీముందుంచుతూ వచ్చాను. అలా పంచుకుని సంతృప్తి చెందుతున్న నన్ను మీరు కేవలం కలం స్నేహితునిగా మిగల్చగూడదు.

'మొగమాటం ఎందుకుగానీ, లీలగారూ...'మిమ్మల్ని, మనసెరిగిన మనిషిగా, అర్ధాంగిగా తప్ప మరోలా ఊహించుకోలేకపోతున్నాను. నా ఆశ ప్రకారం ఇన్నాళ్ల మన సావాసాన్ని బట్టి మీరు నాపట్ల అనుకూలంగానే స్పందించగలరని ఆశిస్తున్నాను.

"మొహమాటపడో నన్ను బాధపెట్టగూడదనో మాత్రం నాకు అనుకూలంగా జాబురాయకండి. అలా ఆత్మవంచన చేసుకుని రాయరని నాకు గట్టి నమ్మకం.

"మీరు నాకు మంచి మిత్రురాలిగానే కాక, నిత్య సహచరిగా కూడా నిలిచిపోవాలి. మనం ఎన్నోసార్లు ముఖాముఖిగా కలుసుకునే ఉన్నాం. కాని, మీకా సంగతి తెలియదు. కలిసే ప్రయాణంచేశాం. అదీ మీకు తెలీకుండానే. అందుకు నన్ను మన్నించాలి.

సరే! త్వరలోనే అమ్మా,నాన్నలతో మీ ఇంట్లోనే మిమ్మల్ని చూసేందుకు వస్తున్నాను. కాదు కాదు... మీకు నన్ను చూపించుకునేందుకు వస్తున్నాను.

మోసం చేశానని ఆగ్రహించరు గదా! అయినా, ఇది తియ్యని మోసం, మన ఇరువురికీ లాభించే మోసమేగదండీ లీలగారూ."

డిపోనుంచి వచ్చిన బస్సు క్షణాల్లో జనంతో కిటకిటలాడిపోసాగింది. డ్రయివరు గట్టిగా హారన్ కొట్టాడు.

బస్సు కదులుతోందని క్రిందనిలబడి సిగరెట్లు త్రాగేవారు, పిచ్చాపాటి మాట్లాడేవారు పిలిచినట్లు హడావిడిగా బస్సు ఎక్కేశారు. అందరూ ఎక్కారని చూసి డోరువేసింది లీల!

"ఏం లీలమ్మా! టిక్కెట్లు స్టేజి వచ్చేలోగా కొడతావా? కాసేపు ఆపి ఉంచమన్నావా"? డ్రయివరు కేకేశాడు.

"రైట్! రైట్! "అంది లీల హుషారుగా! పూర్ణగర్భిణిలా... యధావిధిగా... గమ్యం వేపు ప్రయాణం చేయసాగింది ఎర్రబస్సు! బస్సు కదలగానే చల్లటిగాలి రివ్వున తగిలి కలలకన్నా ముఖ్యమైన కర్తవ్యాన్ని గుర్తుచేసింది లీలకు!



## సచిత్ర విచిత్రం



# అన్నదాత

పదమూడేళ్ల ఈ డేవిడ్ లెవిట్‌కి తమస్కూల్ కేంటీన్‌లో మిగిలిపోతుండే ఆహారపదార్థాల్ని చూసి 'అయ్యో కనీసం వీటిని ఆహారం కొనుక్కునే స్తోమతు లేనివారికిచ్చినా వృథాకాదుకదా' అనిపించింది.

ఎనిమిదో క్లాసు చదువుతున్న లెవిట్, అలా పంచిపెట్టేందుకు రూల్స్ ఒప్పుకోవని తెలిసి స్కూల్ అధికారుల్తో మూడేళ్లపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి అనుమతిని సాధించాడు. తోటి పిల్లల్తో కలసి, తమ స్కూలులోనేగాక చుట్టుపక్కల మరో తొమ్మిది స్కూళ్ల కేంటీన్లలో కూడా అలా మిగిలిపోయే ఆహారాన్ని సేకరించి శుభ్రంగా ప్యాక్‌చేసి, ఇల్లులేక పేవ్‌మెంట్లమీద నివసించే వారికి పంచిపెట్టనారంభించాడు. ఆవిధంగా ఒక్క ఏడాదిలో 55 వేల పొన్ల ఆహారం పంచిపెట్టగలిగారు వాళ్లు!

# చతుర కతలు

## పచ్చబొట్టు

"జగన్ అల్లరి రోజురోజుకీ శృతిమించుతోం దిరా! నువ్వే ఏదైనా ఉపాయం ఆలోచిం చాలి" అన్నాడు శీను.

నారాయణ తల వూపాడు.

"కాలేజీలో గొడవ చేస్తున్నాడా? "

"లెక్చెరర్స్‌కి నిక్‌నేమ్స్ పెట్టి ఏడిపిస్తుం టాడు. వాళ్ళకి ఇరిటేషన్ వచ్చి మమ్మల్ని తిట్టి వెళ్ళిపోతారు. వాళ్లదేంబోయింది? సిలబస్ పూర్తికాదు. మనకు చదువు రాదు'

"ప్రిన్సిపాల్ ఏమంటాడు? "

"ఏమీ అనడు. పప్పుసుద్ద"

"జగన్‌గాడి బ్యాగ్రౌండ్ ఏమిటి? "

"పెద్ద బ్యాగ్రౌండ్ ఏంలేదుగాని వాళ్ళ నాన్న కాంట్రాక్టులు చేసి సంపాదించాడు. వాళ్ళ వార్డులో మున్సిపాల్టీ కౌన్సిలరో ఏదో అనుకుంటా? దానికే ఈ కొడుకు విర్రవీగు తుంటాడు. లెక్చెరర్స్‌తో సరిపెట్టుకోలేదు. ఆడపిల్లల్నీ ఏడిపిస్తున్నాడు"

"మీ క్లాసులో పలుకుబడి గలిగినవారి ఆడ పిల్లలు ఎవరూ లేరా? "




"రమణి అని సేల్స్‌టాక్స్ ఆఫీసర్‌గార మ్మాయి వుంది. మీనా అని పోలీస్ ఇన్‌స్పె క్టర్ కూతురు"

"సేల్స్‌టాక్స్ డిపార్ట్‌మెంట్ మనకి పనికి రాదుగాని పోలీస్ ఇన్‌స్పెక్టర్‌తో పనవు తుంది"

"ఏంటీ పోలీసులకు కంప్లెయింట్ ఇవ్వ మంటావా? ఏడ్చినట్టుంది నీ సలహా. కొరి వితో తలగొక్కున్నట్లే గదూ? కథ అడ్డం





తిరిగి మమ్మల్ని లాకప్‌లో పడేసి తన్నినా తంతారు"

"ష్... సరిగావిను. నేనేం కంప్లెయింట్ ఇవ్వమనడంలేదు. కంప్లెయింట్ ఇవ్వకుండా ఇన్‌స్పెక్టర్‌తో తన్నించాలి. ఐడియా అంటే అదీ"

"ఏం చేయాలో చెప్పు"

"మీనా అందంగా వుంటుందా? "

"చచ్చు ప్రశ్న. వయసులో వున్న పిల్ల అందంగా లేకుండా ఎట్లా వుంటుంది? వయసువస్తే గాడిదపిల్ల గూడా అందంగా వుంటుందట"

"నీ సామెతలతో చస్తున్నారా! మీనాని వాడెప్పుడైనా ఏడిపిస్తుంటాడా? "

"వాడంత తెలివితక్కువ దద్దమ్మ కాదు లేరా! మీనా ఇన్‌స్పెక్టర్ కూతురని వాడికి తెలుసు. ఆ పిల్లజోలికి పోడు"

"నీతో బాగుంటాడా? "

"ఆ... ఏ పేచీ లేదు"

"రేపు వాడి బ్యాచ్‌వాళ్లని రూమ్‌కి తీసుకురా. వాళ్ళు ప్రేమించిన అమ్మాయిల పేర్లు పచ్చబొట్లు వేయించుకుంటే ప్రేమ ఫలిస్తుందని చెప్పు. జగన్‌గాడు మీనా పేరు పొడిపించుకునేటట్లు చూడు. నేను అందరికీ పచ్చబొట్లు పొడుస్తాను. ఆ సామానంతా నా దగ్గర వుంది"

"అయితే ఏం జరుగుద్ది? "

"కాగల కార్యం గంధర్వులు తీరుస్తారు. సరేనా! చెప్పినట్లు చెయ్యి" విసుగ్గా అన్నాడు నారాయణ.

మర్నాడు ఆదివారం శీనుతోపాటు జగన్ వాడి అల్లరి ఫ్రెండ్స్ రూమ్‌కి వచ్చారు. తాము ప్రేమిస్తున్న అమ్మాయి పేరు చేతి మీద పొడిపించుకుంటే ప్రేమ ఫలిస్తుందని నారాయణ చెప్పాడు.

శీను సలహాతో మీనా పేరు తన చేతి మీద పొడుపించుకున్నాడు జగన్. ఎవరికి నచ్చిన అమ్మాయి పేరు వాళ్ళు వేయించుకున్నారు.

పదిరోజులు గడిచి పోయింది.

"ఇంకా ఏం జరగలేదు" నిరాశగా అన్నాడు శీను.

"ఏం జరగాలి? "

"జగన్‌గాడికి బుద్ధి చెప్పిస్తానన్నావుగా? "

"మనం తల్చుకోవాలేగానీ ఏ మహాత్మ్యం జరగదు గనుకా! నీకు వాడిమీద పీకలదాకా కోపంగా వున్నప్పుడు చెప్పు"

"ఇప్పుడు అట్లాగే వుంది. పాపం సునీత జడపట్టుకుని గొడవ చేశాడు రాస్కెల్. ఆ అమ్మాయి ఏడుస్తూ ఇంటికెళ్ళిపోయింది"

"సరే, ఇప్పుడు మనం తల్చుకుంటున్నాం గానీ పద" అన్నాడు నారాయణ.

ఇద్దరూ టెలిఫోన్‌బూత్ దగ్గరికి వెళ్లారు. నారాయణ రిసీవర్ ఎత్తి పోలీస్‌స్టేషన్‌కి రింగ్ చేశాడు.

"ఇన్‌స్పెక్టర్‌గారేనా? "

"యస్. స్పీకింగ్"

"సార్! నా పేరు చక్రధరరావు. డిగ్రీ కాలేజీలో లెక్చరర్‌ని. మీ అమ్మాయి నా క్లాసే"

"అలాగా! చెప్పండి ఏం చేయాలో"

"ఏం లేదుసార్! మా క్లాస్‌లో జగన్ అని ఒక పోకిరీవెధవ వున్నాడు. లెక్చరర్స్‌ని బతకనివ్వడంలేదు. ఇక అమ్మాయిల్ని గొడవచేస్తున్నాడు. ఎన్నిసార్లు చెప్పినా ప్రిన్సిపాల్ చర్యతీసుకోవడంలేదు. మీరు వాడికి బుద్ధిచెప్పాలి. అన్నట్లు వాడు మీ అమ్మాయి మీనాను ప్రేమిస్తున్నానని గొప్పగా అందరికీ చెప్పుకుంటున్నాడు. మీనా పేరు తన చేతి మీద పచ్చబొట్టు పొడిపించుకున్నాడు సార్!'

అవతల రిసీవర్ పెట్టేసిన చప్పుడైంది.

"ఇక వాడు అయిపోయాడురా!" నవ్వుతూ అన్నాడు నారాయణ.

కాలేజీనుంచి వస్తూనే రూమ్మేట్ నారా

యణని వాటేసుకున్నాడు శీను.

"పోలీసులు జగన్‌గాడిని ఎవరి జేబునో కొట్టేశాడని చెప్పి పిచ్చపిచ్చగా కొట్టి వ్యాన్‌లో వేసి పోలీస్‌స్టేషన్‌కు పట్టుకుపోయారు" చెప్పాడు సంతోషంతో.

"అటువంటి రౌడీవెధవలకి బుద్ధిబలంతో బుద్ధిచెప్పాలి. డైరెక్టుగా ఎదుర్కోలేం. మన వేమీ సినిమా హీరోలం కాదుగా" అన్నాడు నారాయణ.

**–వాణిశ్రీ**

---

## పన్నుపోటు

సుబ్బారావుకి ప్రమోషనొచ్చింది. అయినా అతని ముఖంలో ఏ కోశానా ఆనందమన్నది లేదు. దానిక్కారణమేమంటే... ప్రమోషన్ వల్ల జీతం పెరిగింది. జీతం పెరగటంవల్ల అతను ఇన్‌కంటాక్స్ కట్టాల్సిన వాళ్ళ లిస్టులో పడ్డాడు. ఇన్‌కంటాక్స్ విషయంలో జీతంలో నలభైవేలు కాదు సరికదా, కనీసం పది వేలన్నా సేవింగ్స్ లేదు. ఎలా చూసుకున్నా ఇప్పుడు సుబ్బారావు ఇరవైవేలమీద ఇరవై అయిదు పర్సంట్ చొప్పున అయిదువేలు టాక్సకట్టాలి. అది తప్పించుకోవాలంటే అర్జంటుగా ఇరవైఅయిదు వేలు సేవింగ్స్ చూపాలి. సంవత్సరాంతంలో పాతికవేలు సేవింగ్ చెయ్యడమంటే మాటలు కాదు.




సేవింగ్స్ క్కూడా ఒక లిమిట్ వచ్చింది. సుబ్బారావుకొచ్చే జీతంలో నలభైవేలకి మించి సేవింగ్స్ చూపడానికి లేదు. ఆ నలభైవేలకీ ట్వంటీ పర్సంట్ టాక్స్ రిబేటుంటుంది. ఇంత వరకూ సుబ్బారావుకి

అందుకే, అతను ఇన్‌కంటాక్స్‌నించి తప్పించుకుందుకు ఇతర మార్గాల్ని వెతకసాగాడు.

సరిగ్గా అదే సమయంలో పెనుతుఫానొచ్చి ఆంధ్రదేశాన్ని ముంచింది.. దానికోసం ప్రజల్ని విరివిగా విరాళాలిమ్మని ప్రభుత్వం కోరింది. అలా ఇచ్చిన విరాళాలకి ఆదాయం పన్నులో మినహాయింపుంటుందని ప్రక

టించింది.

ఇంకేం?!

రాజమార్గం దొరికినట్లయ్యింది సుబ్బారావుకి. న్యూస్‌పేపర్లవారు తుఫాను బాధితుల కోసం విరాళాలు సేకరిస్తుండటంతో, నాలుగైదు న్యూస్‌పేపర్లని కొని తెచ్చుకుని ముందే సుక్కూర్చున్నాడు. వాటిలో అయిదు వేల రూపాయలదాకా విరాళాలిచ్చిన నలుగురు సుబ్బారావు పేర్లకింద పెన్నుతో అండర్లయిన్ చేసి, ఆ నాలుగు పేపర్ల వారికీ తానే విరాళం పంపినట్టుగా రిటర్ను తయారుచేసి సిద్ధం చెయ్యమన్నాడు గుమాస్తాని. ఆ తర్వాత పని తొందర్లో పడి జీతాలు తీసుకునే కంగారులో ఆ కాగితాలపై సంతకాలు చేసి ట్రెజరీకి బిల్లులు పంపేశాడు. జీతాలందుకున్నాక తను ఎంత చక్కగా ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటుని మోసం చెయ్యగలిగానోనని తలుచుకుంటూ మురిసిపోయాడు.

ఇది జరిగిన ఆర్నెల్లకి ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటు నించి సుబ్బారావుకి రిజిస్టరు నోటీసొచ్చింది. అందులో మీరు సమర్పించిన రిటర్న్ ప్రకారం మీరు మీకొచ్చిన జీతంకన్నా ఎక్కువ తుఫాను నిధికి విరాళంగా ఇచ్చినట్లు తోస్తోంది. పాతిక లక్షలదాకా విరాళం ఇచ్చినమీకు ఇంతటి సొమ్ము ఎక్కడ్నించొచ్చిందో తెలుపగలరు.

దీనినిబట్టి మీరు ఉద్దేశపూర్వకంగా తప్పుడు రిటర్న్ సమర్పించినట్లు తెలుస్తోంది. ఆదాయం పన్ను శాఖవార్ని తప్పుదోవ పట్టింపచూసినందుకు మీపై ఏల చర్యతీసుకోరాదో తెలియబర్చగలరు. ఈ నోటీసు అందుకున్న తేదీ లగాయితు నెలరోజులలోగా మీరు ఇరవైవేల రూపాయలు ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటుకి కట్టి, సరియైన రిటర్ను ఫైలు చెయ్యవలసినదని ఇందుమూలముగా ఆదేశించడమైనది. ఇట్లు, ఇన్‌కంటాక్స్ ఆఫీసరు.

సుబ్బారావుకి ముచ్చెమటలూపట్టి కుప్పకూలిపోయాడు. 'ఇదేమిటిదీ? నేను ఇరవైవేల రూపాయలే తుఫాను నిధికి విరాళంగా పంపినట్లు చూపితే, పాతిక లక్షలు విరాళం ఇచ్చినట్టు చూపానని ఇన్‌కంటాక్స్ వాళ్ళు రాస్తున్నారేమిట'ని దిగ్భ్రాంతి చెందాడు సుబ్బారావు.

అసలిదంతా ఎలా జరిగిందో తెలుసుకుందుకు సుబ్బారావు ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్‌కి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. అక్కడి న్యూస్‌పేపర్ కటింగ్స్ వున్న, తను ఫైలు చేసిన రిటర్న్ చూసేసరికి సుబ్బారావుకి మతిపోయింది.

న్యూస్ పేపర్లలో సుబ్బారావు అనే పేరున్న చోటల్లా నల్ల సిరాతో అండర్లయిన్ చెయ్యబడి వుంది. ఆంధ్రదేశంలో ఎందరో సుబ్బారావులుండటంతో, వారందరూ విరాళంగా పంపిన సొమ్మంతా కలిపితే లక్షలు దాటింది. ఇది కావాలనే తన కింద పనిచేస్తున్న గుమాస్తా చేసిన పనని సుబ్బారావుకర్థమైంది. ఇన్‌కంటాక్స్ ఆఫీసరిచ్చిన సలహామేరకు ఛార్టర్డ్ ఎకౌంటెంట్ ద్వారా డబ్బు కట్టి మరో రిటర్ను ఫైలు చేసేటందుకు పరిగెత్తాడు పాపం! సుబ్బారావు.

—రాంరళి

## చెరపకురా చెడేవు

బోసుగారు చాలా ఆనందంగా ఉన్నారు. తను తీసిన చిత్రం "పిల్లా లేచిపో" ఆంధ్రదేశంలోని అన్ని సెంటర్లలో బంపర్ కలెక్షన్స్‌తో ఆడుతోంది. రోజుకి నాలుగు ఆటలు వేసినా హౌస్‌ఫుల్ బోర్డు పెట్టాల్సివస్తున్నది.

పదిపదిహేనేళ్ళక్రితం బోసు అనామధేయుడు. చిత్రరంగప్రవేశం చేశాక అంచెలంచెలుగా హీరో, మరియు ప్రొడ్యూసర్ అయిపోయాడు. పట్టిందల్లా బంగారమే అయింది. తను నటించిన పిక్చరుకి ఎటువంటి ఢోకాలేదు. అందుకే ఇండస్ట్రీలో బోసుగారికి ముద్దుగా మరో పేరు బాక్సాఫీసు బాబు! అయితే



బోసుగారు తన చిత్రానికి యెన్నుకొనే కథలో వైవిధ్యం ఉంటుంది. ప్రజల నాడి బాగా తెల్సిన సినీ డాక్టర్ అతను. అతనికి జరిగిన సన్మానాలకు అంతులేదు. ఒకదాని తర్వాత ఒకటిగా విజయపరంపరలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు బోసుగారు.

తారాబలం తనకు అనుకూలంగా ఉంది. కాబట్టి యీ టైమ్‌లోనే ఒక మంచి హిట్ ఫిలిమ్ తీద్దామని నిర్ణయించుకున్నాడు బోసుగారు. ఫైవ్‌స్టార్ హోటల్ గదిలో నిర్మాత, దర్శకుడు నటుడు అన్నీ అయిన బోసుగారు రచయితతో కూర్చుని కథ అల్లారు. యువతను ఆకర్షించే సబ్జక్టు తీసుకొన్నారు. తల్లిదండ్రుల్ని ఎదిరించి ప్రేమించిన వ్యక్తితో లేచిపోయే అమ్మాయిలను ప్రోత్సహించే ఇతివృత్తంగా కథ మలచబడింది. ఆ సిన్మాయే ఈ 'పిల్లాలేచిపో'. విదేశాల్లో డ్యూయెట్స్, వెస్టర్న్ మ్యూజిక్‌తో తీసిన ఈ కొత్త తరహా పిక్చరు చూసి యువత ఉర్రూతలూగింది. నభూతో నభవిష్యతి అని పత్రికలు రాసేయి! సిల్వర్ జూబిలీ ఖాయం అన్నారు సినీ పండితులు.

బోసుగారు తన విజయానికి కారకులైన దర్శకుడ్ని, రచయితని, పాత్రికేయుల్ని పిలిచి బ్రహ్మాండమైన విందు యిచ్చాడు. స్కాచ్ విస్కీ వరదలైపారింది. రొయ్యల వేపుడుతో నంజుకొని, చికెన్‌తో డిన్నరు తిని ఎవరి దారిన వారు యిళ్ళకు వెళ్ళారు. అందరికీ వీడ్కోలు చెప్పి బోసుగారు ఇంటికి బయల్దేరారు.

అతని శరీరం, మనసు దూది పింజెలా తేలిపోతున్నాయి. కారు దిగి యింట్లోకి అడుగు పెట్టాడు. రాత్రి రెండు గంటలయినా యింట్లో వెలుగు దేదీప్యమానంగా ఉంది. లంకంత కొంపలో ఉండేది భార్యా ఒకే ఒక కూతురూను. బేబీ! బేబీ అంటూ కూతురి గదిలోకి వెళ్ళాడు.

అప్పుడే మైనారిటీ తీరిన కన్నకూతురు ఎక్కడా లేదు. ఆమె పెట్టిన కాగితం మాత్రం రెపరెపలాడుతోంది. "నాన్నా, నీవు తీసిన సినిమా "పిల్లా లేచిపో' అద్భుతం! దాని ప్రభావం నా మీద చాలా బాగా పడింది. నీవు చూపిన బాటలోనే పోతున్నాను. నా కోసం వెతక్కు''

**—ఆనందరావ్ పట్నాయక్**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78